# మనస్వాతంత్ర్యము

## ద్వితీయ భాగము

## ( Rationalistic Free Thought )

### PART II




వల్లూరి సూర్యనారాయణరావు

బి యె బి యల్, యల్ టి.

హైకోర్టు అడ్వకేటు

కొవ్వూరు


[ వెల 0—8—0 ]

TO

The Sacred Memory

OF

My Beloved Son

# Yalluri Rama Mohun

Who, but for his premature demise would have been
of great help to me in my research work,
with his knowledge of Sanscrit, English, Hindi and Urdu
and his earnestness for truth, honesty and free thought

*This little book is lovingly dedicated

# ఉపోద్ఘాతము

క్రిందటి సంవత్సరములో, వెలువడిన మొదటిభాగ ములో, నేను పురాణములను గురించి వ్రాసిన విషయముల మీద కొందరు పూర్వాచారపరాయణులు చేసిన ఖండనము లకు నాకు తోచిన ప్రత్యుత్తరములను యీ రెండవభాగ ములో నుల్లేఖించితిని. ఇప్పుడు ప్రపంచములో నామమాత్రా వశిష్టముగనున్న మతసాంప్రదాయములకును, ఆధునిక భౌతిక శాస్త్రజ్ఞుల ప్రకృతిపరిణామవాదమునకును యెప్పటికిని, యెట్టి సమన్వయము కుదరనేరదు. వార్తాపత్రికలలో నేనప్పుడప్పుడు యీ విషయమై వ్రాయుచుండిన వ్యాసములలో, కొన్ని ముఖ్యమైనవానిని, యీగ్రంథములో చొప్పించుటచేత, చర్విత చర్వణము లుండవచ్చునుగాని, నేను ప్రతిపాదించు సూత్ర ములు, పదేపదే నొక్కివక్కాణించుచుండుట ఆవశ్యమని నేను భావించెదను. భౌతికశాస్త్రములన్నియు దేశభాషలలో అనువదింపబడకపోవుటవలన, జనబాహుళ్యమునకు నా యభి ప్రాయములు వింతగ తోచుటయేగాక, నేను వారి హేళనకు కూడ గురియగుదునని నే నెరుగుదును కాని, విస్సన్న చెప్పి నది వేదమని నమ్మక ప్రతివాదుడను, ప్రకృతిశాస్త్రజ్ఞాన మును కొంతవరకైనను, చిన్నతనమునుండియు అలవడఁజేసి కొనుచుండిననే తప్ప, లేనిచో మూఢమతవిశ్వాసములకు,

అతడు దాసుడుగాక తప్పదు కాబట్టి ఆయాశాస్త్రముల లోని ప్రధానాంశములనైనను సులభశైలిని ఆంధ్రములో విద్యార్థికులు వ్రాసియిచ్చినయెడల, మా కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమువారు, తమ స్వంతఖర్చుమీాద అచ్చు వేయించుకొని, ముఖ్యమైన ఆంధ్రగ్రంథాలయములకు ఉచిత ముగా పోస్టేజి తామే పెట్టుకొని పంపుచు, వ్యక్తులకు స్వల్ప ఖరీదుకు విక్రయించుటకు తగిన యేర్పాటులు చేయుదురు

25—4—33
కొవ్వూరు

వల్లూరి సూర్యనారాయణరావు
సెక్రటరీ,
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము
కొవ్వూరు



1 ఇదవిసృష్టిర్యత ఆబభూవ। యదివాదధేయ ది
వానదధే। యో అస్యాధ్యక్షః పరమేవ్యోమన్। సో అంగవేద
యదివా వేద। ఋగ్వేదము- నాసదీయసూక్తము— మం 10
సూ 129

అర్థము —(సత్తుయొక్క) యీ విసర్గము, అనగా వ్యాపనము యెచ్చోనుండి వచ్చినది? లేక, అది నిర్మించినను, నిర్మింపక పోయినను సరే అది పరమమగు నాకాశము నందుండెడి నీ జగత్తునకు నధ్యక్షుడగు (హిరణ్యగర్భుడు) వాడెఱింగియుండును, లేక, యెఱుంగక సైతముండును? (ఎవరుచెప్పగలరు)?

2 కలడందురు దీనులయెడ। కలడందురు పరమయోగి గణములపాలన్। కలడందు రన్నిదిశలను। కలడు కలండనెడు వాడుకలండో లేడో-(భాగవతము)

3 There is nothing so dangerous to intellectual virility as to have an "infallible book" to fall back upon There is no sacred book in the world which has not crippled human souls—Dr O W Holmes

4 The improver of natural knowledge absolutely refuses to acknowledge authority as such For him scepticism is the higest of duties, and blind faith, the one unpardonable sin—Huxley

5 A man who speaks out honestly and fearlessly, that which he knows and that which he believes will always enlist the good will and the respect, however much he may fail in winning the assent of his fellow-men—Huxley

6 Not to communicate one's thoughts to others, to keep one's thoughts to oneself as people say, is either cowardice or pride It is a form of sin A good man is an open man It is a duty to talk, teach, explain, write, lecture, read, and listen Every truly religious man, every good sociolist is a propogandist—H G Wells

7 In this age, the mere example of non-conformity the mere refusal to bend the knee to custom is itself a service—John Stuart Mill.



# విషయసూచిక



అధ్యాయములు

# మత స్వాతంత్ర్యము

## ద్వితీయ భాగము

## హైందవమతసాంప్రదాయములు



### 1 వ అధ్యాయము

ప్రస్తుతమందు ప్రపంచములో ముఖ్యమైన మతసాంప్రదాయములు అయిదారున్నవి వినిలో హైందవ, బౌద్ధ, చైనా, క్రైస్తవ, ముస్లీము, పార్సీల జ్ఞానవిజ్ఞానములు ప్రధానములు వీనిలో అంతర్భేదములు కొన్నియుండి, మొత్తము మీద వీనికి ప్రత్యేకత కలదు వీనిలో నన్నిటికంటెను మొదటిది మనఋగ్వేదకాలమునాటి ఆర్యమతము దీనిశాఖ బౌద్ధమతమని చెప్పనగును ఈ సాంప్రదాయమే ప్రపంచములో యెక్కువ జనసంఖ్యచేత అంగీకరింపబడుచున్నది ఈ మత సాంప్రదాయములన్నియు మానవకల్పితములే ఇట్టి భిన్నమతములుండుటచేతనే, పరమకారుణికుడు సర్వశక్తుడునగు దేవుడొకడున్నను, ఆయన యిట్టిమతభేదములను కల్పించి అన్యోన్యకలహములకు తావీయడని తెలిసికొనవచ్చును ఈ మతములన్నియు, పౌరుషేయములే యని చాటుటకు యీ ఒక్కనిదర్శనమే చాలును సాంఘికపరిణామావస్థలో నీతి నియమములు క్రమేణా వృద్ధినొంది, వానిని నిలబెట్టుటకే మత

ములని నవి యేర్పడి యుండవచ్చును గాని, మతము లు నీతి కేర్పడిన పునాదులు కావు

పైన వ్రాసిన ఆపసాంప్రదాయములలో, ఆధ్యాత్మిక విషయములను చక్కగా వర్ణించెసి, హేతువాదనలచే మన లను కొంతవఱకైనను ఒప్పించగలిగినని మన వేదాంతము, బౌద్ధ మతములే తక్కినవి పిరిచాదనలతో మనలో యిటీవలయేర్పడిన కర్మకలాపాచారకాండలవలె నిండియున్నవి నీతిసూత్రములు మాత్రము, అన్నిటిలోను సామాన్యములే గనుక సనాతనధర్మములని చెప్పకొన్న హైందవ బౌద్ధ జైనమతములవలెగాక, తక్కినవి ఒక్క నమ్మకములమీదనే ఆధారపడి వానిని నమ్మినవారికే ముక్తిదొరకునని చెప్పును మనమతమట్లుగాక, ప్రపంచములో ప్రతివానికిని భక్తి, కర్మ, జ్ఞాన, ధ్యాన, వైరాగ్య విధానములలో దేనివలననైనను మోక్షము రాగలదని చాటుచున్నది ఈ కారణముచేతనే మన భారత వర్షములో, అనేకవంకల మతసిద్ధాంతములతో నిండిన యీ హైందవమతము, యెన్ని విప్లవములు సంభవించినను నశించ లేదు ఈ సిద్ధాంతములలో ఒకదానినే నమ్మవలసినదని మన ఉపనిషత్తులు, గీతలు మనలను బలవంతపరచవు మనస్వానుభవముచేతనే మన మాధ్యాత్మికవిషయములను గ్రహించవలసియుండుమని మన వేదాంతము ప్రతిపాదించుచున్నది కాబట్టి యిదియొక మతసాంప్రదాయమని యనిపించుకొనదు ఇది సిద్ధమని ఖండితముగ మనవేదములు వక్కాణించలేదు ప్రపం

శము లోని అన్నిజాతులకు మోక్షమార్గము చూపించుటకు ఈ సిద్ధాంతము లన్నియు ఊహాప్రపంచముమీద నాధారపడిన వేయనియు, మనయాత్మ పరిశోధన చేసికొనుచు మనము ప్రవర్తించవలెననియు, మనలోనిదియు, సర్వభూతాత్మకమగు ప్రకృతిలోనిదియు ఒక్కటే యని చెప్పి, నీతికి శాశ్వతపునాది మన పూర్వులే యేర్పరచిరనియు, మనము నమ్మవలెను దేవుడు, ఆత్మ, పునర్జన్మ మొదలగు ముఖ్యవిషయములలోకూడ భిన్నాభిప్రాయములు, సందేహములు, మనపూర్వులే వెల్లడించియుండిరి కాని యిట్టి సందేహంవినష్టికెట్టికొరతయు లేదు సంఘాభివృద్ధికి కావలసిన నైతికమార్గములను మన మనుసరించితిమేని మనకెట్టి కొరగునయు నుండదు తక్కిన మతములలో అట్లుకాదు మనవలె కాళ్ళు,చేతులు గలదేవునిగాని, ఆయన పంపినట్లు చెప్పే ఒక దేవదూతనుగాని ప్రార్థించుచుండక పోయినయెడల, మనకందరకు నరకప్రాప్తి సంభవించునట! మనలో అనేకలక్షల వేదాంతులు, అనేకకోట్ల బౌద్ధులు, చీనావారు, దేవుడొకడున్నాడనియే నమ్మరు కాని, వారెవ్వరును నైతికప్రవర్తనలో మనకు తీసిపోరు వీరందరు నరకమునబడెదరా? క్రైస్తవసిద్ధాంతముప్రకారము శాశ్వతనరకమును దేవుడు వీరికి ప్రసాదించునా?

అధ్యాత్మిక లేక వేదాంతవిషయము లటుండనిచ్చి మతకర్మానువర్తము మనలో, తక్కినమతములలోకంటె కర్మకాండ, మంత్రబ్రాహ్మణకాలము మొదలు పెరిగిపెరిగి

యిప్పుడు క్రమక్రమముగా నశించుచున్నందుకు సంతోషము నానాజాతులలో యిరి భిన్నరూపములనదాల్చి జనులను బానిసలుగి జేసివై చినది మతగ్రంథములను నవి పెక్కులు వ్రాయబడి వానిలోని యద్భుతకల్పనలన్నియు మనము నమ్మి తీరవలెనట! వానిని విమర్శించకూడదట! విమర్శించబూనుట గొప్పయపరాధమట! మనలో ముఖ్యముగా అన్ని శ్రుతిస్మృతి పురాణేతిహాసములు మతగ్రంథములేనట! వీనినన్నిటినికలిపి సమర్ధించవలెనట! మనము పూర్వమునుండి అనుశ్రుతముగా, వంశపారంపర్యముగ వచ్చుచున్న అలవాటులను పోగొట్టుకొన లేకను, ఉన్న సంఘమును వదలలేకను, తక్కిన యితరమతము లలో మనలో వానికంటె పిచ్చినమ్మకములు, విషయములుం డుటచేతను, ప్రస్తుతకాలములో కొన్ని కట్టుబాట్లతి సనాౖ ముగాని, యీకట్టుబాట్లు యిదివర కెన్నియోసారులు స్మృతులకాలమునుండియు మారినవి ఇప్పుడు మారుచున్నవి. ముందుమారగలవు మహాసముద్ర ప్రళయమును ఒక అర చేతితో ఆపుటకు ప్రయత్నించు టెంతవెర్రియో, యీసనా తనధర్మవాదులమని చెప్పుకొనవారు, తమరెంతవరకు పూర్వ సాంప్రదాయమ్ములను ఖండజాంపదరో మరిచపోయి, మన హైం దవులనందరిని పూర్వపుటాచారముల ననసరించమనికోరుట, అంతవెర్రిపనియని తలచవలెను

మన ఆర్యులలో అనేకమార్పులు, యిదివరలోనే వర్ణాశ్రమధర్మములలో కలిగినవి. ఇప్పుడు బ్రాహ్మణులలో

నైనను పేరునకుమాత్రము పైకి కొంతఆడంబరముతో నున్నట్లు కనిపించినను, అవి వారిదినచర్యలో మృగ్యములగు చున్నవి అంతశ్శాఖ, అంతర్వర్ణవివాహములేగాక, అంతర్జాతీయవివాహములు ఆచరణలోనికి రాకతప్పదు ఐచ్ఛికవివాహము, వివాహచ్ఛేదనము, దాయక్రమములోని మార్పులు, న్యాయశాస్త్రసవరణలనుబట్టి జరిగినను దీనివలన మిన్నువిరిగి మీదపడునని భయపడనక్కరలేదు సంఘము నెమ్మదిగా దానియంత టది నడచుచునే యుండును స్త్రీలోకము యొక్క ఆదర్శములేమారును పెనిమిటి తన కెంతఅన్యాయముచేసినను సీతవలె, పరమపతివ్రత అతనిఅడుగులకు మడుగులొత్తదు స్త్రీ పురుషుల సమానత్వాదర్శము, పురుషులలో కొందరికి రుచింపకపోవచ్చునుగాని, మన వేదాంతశాస్త్రములప్రకారము ఉభయులలోను, ఆత్మ ఒకటేయైనపుడు, దానిసమానత్వమును మానవనిబంధనలతో బంధించినచోట అవినీతికరము. అన్యాయము ఇట్టి సంఘసంస్కారణలమూలమున, శ్రుతిస్మృతి పురాణములలోని సూత్రాతిక్రమణ దోషముకలిగి పాతిత్యములు వచ్చుననుభయము హిందూవారికి కలుగదు

దేవుడు, ఆత్మమోక్షము, మొ లగునవి యుండుగాక, లేకపోవుగాక ప్రపంచములోని వివిధమతాచారములను పోల్చి చూచినయెడల, నైతికపథము (Life of righteousness) పరిగణించనివారికి, బుద్ధునివంటి [illegible] సూత్రములనతిక్రమించినయెడల యెట్టిదోషము వాటిల్లునని గట్టిగనమ్మ

వలెను తన మనస్సంతృప్తికొరకుతప్ప యే వేదాంతగ్రంథము చదివినను, యే కర్మకాండలో మగ్నుడైనను, యెన్నిపూజలు, జపములుచేసినను, సామాన్యనైతికధర్మములను, (అనగా సనాతనధర్మములు) విడనాడినయెడల, యెట్టి ప్రయోజనములేదు ఆచారవ్యవహారములు, మతవిశ్వాసములు మనలనుపెత్తించవు తరింపజేయవు మన సన్మార్గప్రవర్తనయే మనకు శరణ్యము ఇదియే మనవేదాంతులు, బుద్ధదేవప్రభృతులు, తఖ్వాప్యాపిమస్ మొదలగు పూర్వఋషులు ప్రతిపాదించిన విషయము

## పు రా ణ ము లు

### 2 వ అధ్యాయము

శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు, నావ్యాసము మీదచేసిన మొదటివిమర్శనకు నాకు తోచినసమాధానము ఆంధ్రపత్రికలో ప్రచురింపబడియున్నది ఇప్పుడు వారు తమ రెండవవిమర్శనను ఆంధ్రపత్రికలోను, త్రిలింగ పత్రికలోను, మిక్కిలి ఓపికతో వ్రాసియున్నారు. తక్కిన విమర్శనలవలెగాక యీయన కొంతవరకు హేతువాదము నంగీకరించుచు, తమ పాండిత్యముతో పురాణములలోని విషయములన్నియు సమర్థించుటకు ప్రయత్నించుటవలననే, యీవిమర్శలో నేను ప్రాధాన

వలసి వచ్చుచున్నది మల్లెల శ్రీరామమూర్తిగారు మొద లగువారు, పురాణములు అతిపవిత్రములైన మతగ్రంథములు గనుక వాని యంతరార్థము తెలియనివారు విమర్శింపనేకూడ దని పిడివాదము చేయుచుండుటచే వీరితో మెట్టచర్చలకును అవకాశమే లేదు అట్టివారియెడ మౌనమేయుంచెది మన బ్రహ్మయ్యశాస్త్రిగారు ఆధునిక భౌతిక శాస్త్ర పరిశోధనలను త్రోసివేయజాలక పురాణములలో చెప్పు సృష్టిపరిణామము, ఆపరిశోధనల కనుగుణ్యముగా నుండుటయేగాక మనవారింకను, యెక్కువ ప్రకృతిరహస్యములను కనుగొన్నారని వీరవాదన ఇటులయు వీరి పాండిత్యప్రతిష్ఠచేతను, బుద్ధిబలముచేతను, ముడిబెట్టి ప్రయత్నములవ్వ వేసుకొందలనియు సామాన్యమాన వులకు ఉపకరించునిమిత్తము తేటతెల్లముగ వ్రాసినపురాణ గాథలకు, రహస్యార్థములు విపరీతముగ కల్పించుచున్నారనియు నావాదన ఈ ఉభయవాదములలోని సత్యాసత్యములను చదు వరులు గ్రహించెదరుగాక

నేను బ్రహ్మాండపురాణము, విష్ణుపురాణములను తెప్పి కొనిచదివియే, సృష్టిపరిణామాదివిషయములను గురించి విమర్శించితిని వానిని చదువకుండ నెట్లు విమర్శించగలను? ఏవిషయములైనను, నేను సరిగా అర్థము చేసుకొనలేదని విమ ర్శించవచ్చును గాని నేను చదువకయే వ్రాసితినియు, నేను వ్రాసిన [illegible] పురాణములు, విమర్శనకు నుపయోగించినట్టి [illegible] సూత్రోక్తులు,

నాయొక్కలను విరుగగొట్టవు స్వర్గమందు దేవతల, భూమియందు మర్త్యులయుత్పత్తినిగురించియే వ్రాయబడుటచేతను, భూమిచుట్టుతిరుగుటకు సూర్యచంద్రనక్షత్రాదులను సృజించి మనకు రాత్రింబవళ్లు మాసములు, అయనముల నేర్పరుచుటచేతను, యితరగోళముల స్థావరజంగమములనుగురించి, పల్లెత్తుమాట చెప్పకపోవుటచేతను, దీవులు సముద్రములు పర్వతములు మొదలగునవన్నియు భూమిమీదనేయున్నట్లు, పుటలుపుటలు నింపుచుండుటచేతను, యీ మొదలగువిషయములనుబట్టి, మర్త్యలోకమె ప్రధానముగా పురాణకర్తలునమ్మి వారికొరకే యితరగోళములన్నియు సృజింపబడినట్లు నాకుస్పష్టముగా కనబడుచున్నది ఇది భ్రాంతికాదు ధ్రువము, యీ మర్త్యలోకములో రాజవంశములో పుట్టి, తుదకునక్షత్రమై సూర్యనక్షత్రములనడపుచున్నాడట! భూమిచుట్టూ వానిని ప్రదక్షిణము చేయించుచున్నాడట! ఇదంతయు నాభ్రాంతియగునో కాదో, మన బ్రహ్మశ్రీయ్యశాస్త్రిగారిని తిరిగి ఆపురాణములను చదివి చెప్పుడని సవాలుచేయుచున్నాను.

నేను కొందరు పాశ్చాత్యపాదిరీలు బైబిలువిమర్శించినట్లు మన పురాణములను విమర్శించుచున్నాననియు, నేనువారివలె అగ్నాస్టిక్కునేగాక, నాస్తికుడననియు ఆక్షేపించుచున్నారు వీరియాక్షేపణలను నేను నిందగాభావించను గనుక, దీనినిలక్ష్యముచేయను బైబిలువంటి మతగ్రంథములే, యీ పురాణములుగనుక, మొదటిదానిని స్తనశల్యపరీక్షచేసినట్లు

వీనినికూడ చేయవలసినదే మొదటిదానినిసమర్థించుటకు యెట్టివిపరీతార్థములు పాశ్చాత్యవిమర్శలు కల్పించ ప్రయత్నించుచున్నారో మన బ్రహ్మయ్యశాస్త్రిగారు మొదలగు పూర్వపండితులుకూడ మనపురాణములను అట్లేసమర్థించ జూచుచున్నారు ప్రపంచమంతటను యిట్టిమతావేశపరులకును, ఐహికపు నవనాగరికులకును సంఘట్టనతప్పదు గనుక, ఓర్పుతో చదువరులు, ఉభయవాదనలోని హేతువులను గ్రహించవలెనుగాని, అప్రస్తుతాంశములతో మన కేమియు పనిలేదు ఇక మనబ్రహ్మయ్యశాస్త్రులుగారు, తమవాదనకు పయోగించునని కొందరి పెద్దలపేర్లు యేకరువుపెట్టిరి కాని, పెద్దలలో అనేకులు, కొన్నినమ్మకములకును, మూఢవిశ్వాసములకును, పూర్వసాంప్రదాయములకును దాసులై వానినివిడువలేరు వీరువిద్యాధికులైనను, కొన్నివిషయములలో, విలువలేనివారున పొరబాట్లకు గురియగుచుండువారునై యుందురు గనుక వీరిపేర్లుచెప్పి మమ్ముల భయపెట్టిన లాభములేదు ఇక్కడ ఒక్కటేప్రశ్న పురాణములలో వ్రాసిన సృష్టిక్రమము భౌతికశాస్త్రపరిశోధనలకు అనుగుణ్యముగానున్నదా? లేనియెడల దేనినంగీకరించవలెను? పురాణములలో చెప్పినదానికి, ఆగ్రంథకర్తలు, హేతువులనుకనపరచిరా? వీరు కాలప్రమాణము అర్బుదములకొలది సంవత్సరములును, దూరముల ప్రమాణము అర్బుదములకొలది యోజనములును నిర్ణయించుటవలన యేమిప్రయోజనము? వీనిని యెట్లుతెలిసకొనిరో వ్రాయ

ఎపుడు, వీరు ప్రపంచమంతయు గ్రుడ్డిగా నమ్మవలసినదేనా? వారు విని నమ్మి నిర్ణయించిరి? ఈ ప్రశ్నలకు మన బ్రహ్మయ్యశాస్త్రులుగారు సమాధానము వ్రాయవలెనని వెంకట చాలాబులోకము, యిప్పుడుకూడ సవాలుచేయుచున్నాను విషయనిర్ణయము నమ్మకముమీదనా? ప్రమాణాన్వేషణము మీదనా?

పురాణపరిశీలనము ఒక శాస్త్రపరిశీలనము వంటిదనియు దానిలోని యర్థవాదములను మనము గ్రహించలేమనియు వానిలోని రహస్యార్థములను పెద్దలవలన తెలిసికొనవలసినదనియు మన బ్రహ్మయ్యశాస్త్రిగారు చెప్పుచున్నారు, యిది "మైథాలజీ" శాస్త్రమనుకొనుచున్నారు. ఇదియే నాకు కావలసినది. మైథాలజీ శాస్త్రమనగా ఎక్కడటి పురాణము నానాదేశములలో, పూర్వులిట్టి అభూతకల్పనలతో తమదేవుళ్ళను, దయ్యములను సృజించగా, ఆ ధనికులు వీనినన్నిటిని పోల్చి యిట్టి వివిధ మూఢనమ్మకములు, యేదేశస్థులవి, యేయే దేశమువారు తెచ్చిరివిరో, యీ విషయములను శోధించుటకు మాత్రమే, యీ మైథాలజియనునదికూడ ఒక శాస్త్రముగా వాడబడుచున్నదేగాని, అది భౌతికశాస్త్రములలో ఒకటికాదు ఈ శాస్త్రవర్గులో మన్ననకెక్కిన చేసిన సముద్రుని స్త్రీగా ఒక జాతి యున్నారనియు, ఒక జాతిలో, భూమి అట్లాసు అనుపురుషుడు మోయుచున్నాడని చెప్పెదరనియు, యిట్టి మొద్దలగు పొల్లుమాటలు మనము వానిని నమ్ముటకు హేతువులు

కావు ఇవియన్నియు సర్వాబద్ధములే ఆయాకాలపువారు ఊహాప్రపంచములోని అల్లికలే వీనిలో దేనినికూడ మరి యొకదానిచే సమర్థించజాలనట్టి శుష్కవాదములు ఇట్టివాదమును యెవరు అంగీకరించుదురు రెండు నలుగులుకలసి ఒక తెలుపగునా?

ప్రకృతి అనాదియని వేదాంతసిద్ధాంతసూత్రము నొక దానిని తీసికొనుచు, సత్యనారాయణశాస్త్రిగారు, శాస్త్రిగారంట గ్రహించుచున్నారు పురాణగాథలు, ప్రకృతిని ఒకబ్రహ్మ సృష్టించెనని చెప్పుచున్నవి. ఈ గ్రంథకర్తలు, ప్రకృతిఅనాదియని నమ్మితే, హిరణ్యగర్భుడెవ్వాడెట్లుండెనచ్చెను? ఆయనయు ప్రకృతి లోనివాడే మనశాస్త్రిగారు, మరియొకనాటి యీ రెండుపురాణముల చదివి, వానిలోని సృష్టిక్రమము, ఏమని కట్లు అర్థమైనదో తేటతెలుగులోనికియిలతో వ్రాసినయెడల, వారికి నేననేక కృతజ్ఞతాభివందనముల నాచరింతును నేను వ్రాసినదానిని సవరించుకొందును ఇట్లుగాక, కొన్నికొన్ని వాక్యములను శబ్దములకును విపరీతార్థములు చేయుచు, సంస్కృతపదములను మా మీదికి గుప్పించినయెడల ప్రయోజనమేమియు నుండకపోగా, చదువరులను పొగలోనముంచివేసి, సత్యాన్వేషణమునకు మార్గము కనబడకుండచేయుట తప్ప వేరుప్రయోజనముండదు నేను ప్రత్యక్షప్రమాణము మీద ఆధారపడిన భౌతికశాస్త్రజ్ఞానమును అంగీకరించినయెడల, యీ పురాణములలోని సృష్టిక్రమమును, వీరిరహస్యార్థములతో వ్రాసి, దానిని నను

ర్థించుమని తిరిగి వేడుచున్నాను. నేను యీ పురాణములను చదివియే, వానివాక్యార్థమే వ్రాసి, నాకుతోచిన విమర్శనను చేసితిని ఇవి సరికాదని రూపించుటకు, వానిలో చెప్పినసృష్టి క్రమముయేదియో వ్రాయుడని కోరుచున్నాను.

భూమికి పాము, తాబేలు, అష్టదిగ్గజములు, కులపర్వతములు ఆధారములని స్పష్టముగా పురాణములు చెప్పుచుండగా, శేషశబ్దమునకు పాముకాదు, కూర్మశబ్దమునకు తాబేలుకాదు, నిఘంటువులను త్రోసివారవేసి, ఎని అంతరార్థము తెలిసికొనుటకు ప్రయత్నించవలెను, అని శాస్త్రిగారివాదన చేసెనగాక, సామాన్యమానవులంతరు యిట్టియర్థమునే గ్రహించి పురాణశ్రవణము చేయుచున్నారు. గ్రహణములకు కారణము రాహువు సూర్యచంద్రులను మ్రింగుట, భూమికి తాబేలు, శేషుడు ఆధారభూతములగుట యిట్టి పూర్వ(పు)కథలు యీ నాటికిని సామాన్యప్రజలు, విద్యార్థులుకూడ విశ్వసించుచున్నారు. నూతనశాస్త్రిగారు యీ పురాణములకు నూతనభాష్యము వ్రాసినగాని, వానిలోని పదములకు మనము మామూలు అర్థమునే చేసికొనవలసియుందుము.

భాస్కరాచార్యులవారి జ్యోతిషశాస్త్రములోని ప్రమాణములను కొన్ని జూపించిరి. పురాణములు ముందు పుట్టినవా, లేక భాస్కరాచార్యులవారి సిద్ధాంతము ముందు పుట్టినదా యనువిషయము నాకు శాస్త్రిగారు ప్రమాణములతో నిరూపించిన తరువాత, వీరివాదన నాలోచింతము. భాస్కరాచార్యులు

గారు, మనశాస్త్రిగారివలెనే పురాణములయందలి నమ్మకము నుండక లేక, తన భౌతికజ్ఞానమును కనుగుణ్యముగా పురాణము లలో నిస్పష్టమైన శబ్దములకు విపరీతార్థములను కల్పించియుం డవచ్చును శబ్దార్థమునకు యీయన ప్రామాణికుడెట్లగును? ఒకవేళ యీయనే పురాణగ్రంథకర్తలకంటె ముందుపుట్టిన యెడల యీయన భౌతికజ్ఞానము ఆ గ్రంథకర్తలకు తెలియక నైన పోవచ్చును తెలిసియున్నయెడల, యీ ఆకర్షణశక్తి భూచ్ఛాయ, మొదలగునవి స్పష్టముగానే వారేల వ్రాయరు? ఇంతక్లిష్టముగా సృష్టివర్ణనను వ్రాయవలసిన పనియేమి? దీని లో రహస్యమెందుకు

కాబట్టి మనబ్రహ్మయ్యశాస్త్రులుగారు, పురాణముల లోని సృష్టిక్రమమును, భౌతికశాస్త్రములతో సమన్వయము చేయప్రయత్నించుటలో ఉపజయముపొంది తీరుదురు నేను మనపూర్వులలో భౌతికశాస్త్రజ్ఞులు లేరని యెన్నడుచెప్పలేదు న్యూటనుకంటె భాస్కరాచార్యుడు గొప్పవాడు కావచ్చును ఇప్పటిప్రశ్న యదికాదు మనపూర్వుల సర్వజ్ఞత్వమును నిల బెట్టుటకు, యీ పురాణకర్తల సృష్ట్యుత్పత్తికి విపరీతార్థము లను మనశాస్త్రిగారు కల్పించుచున్నారని నాయభిప్రాయము. మానవుడు పూర్వపు తోకలేనికోతులనుండి అనేకలక్షల సంవ త్సరముల క్రింద జన్మించినట్లు, భౌతికశాస్త్రపరిశోధనలవలన, ప్రత్యక్షప్రమాణముమీదనే యథారపరచి, తెలుపబడుచున్న దని నేనువ్రాయగా, దీని నంగీకరించుచు, భగవంతుడు మత్స్య

పడుచుగానన్నను, నేను ప్రకృతిశాస్త్రజ్ఞుల పరిశోధనలను, వ్యాయామము, దయాదాక్షిణ్యాదులు మొదలగువానిని పాటించి రజస్వలానంతర వివాహములు, వితంతూద్వాహములను అంగీకరించుచున్నాననగాని, అట్టియాచారములను ఊరకదూషించువారు, యెంతగొప్పవారైనను నేను లక్ష్యముచేయను నేనట్టి మనస్స్వాతంత్ర్యమును కోరుచున్నానో, ఇతరులకు కూడ దానినంగీకరించువాడనే గనుక మన వేణుగోపాలశాస్త్రిగారు, తమయభిప్రాయముల కనుకూలురగు కొందరిపెద్దల పేర్లను ఏకరువుపెట్టినంత మాత్రముచేతనే, ప్రకృతిశాస్త్రములు, అంతర్వర్ణవివాహములు, పునర్వివాహములు అనర్థదాయకములని ఋజువుపరచినట్లు నేను నమ్మను ఈ వాదనలు చదువరులకు వదలివేయుటతో మనము తృప్తినొందెదము

ఇక పద్మనాభస్వామిగారి వ్యాసములో కఠినోక్తులను వదలివేసి, తక్కినభాగమును కొంతతెరచి చూచినను హేతువాదన బొత్తిగా నాకు కనపడలేదు నేను వేదములనుగాని, మరియేయితర మతగ్రంథమునగాని, వానిని వ్రాసిన గ్రంథకర్తలనుగాని యెన్నడు ద్వేషింపను వానిలోని కల్పనలు సహేతుకములుకావని నేను ఖండించుచున్నంతమాత్రముచేత, అది ద్వేషమెట్లనిపించుకొనును? మన ఋషులను, అప్పటి కాలమునకు యిప్పుడున్నంత భౌతికజ్ఞానములేదనుట గొప్ప అపరాధమా? నేను వ్యాసులవారు తమపురాణములలో ప్రతిపాదించిన నైతికధర్మములను విమర్శించితినా? ఈయన సర్వజ్ఞుడు

కాడనియు, యీ కాలమునాటి ప్రకృతిరహస్యపరిశోధనలు తెలియవు గనుక ఊహామాత్ర సృష్ట్యుత్పత్తిక్రమమును వ్రాసి యుండవచ్చుననియు నా వాదన దీనిలో యేమి దోషమున్నదో నాకు గోచరించలేదు నా వాదనకు నేను కొన్ని హేతువులు కనపరచితిని ఈ విమర్శకులు పురాణములలో వ్రాసినది సత్యమని సమర్థించుటకు హేతువులను చూపించవలెను గాని నన్నొరక ఆడిపోసికొనుటవలన వీరికి ప్రయోజనమేమి? వీరిది హేతువాదమని చదువరులంగీకరింతురా?

ఇప్పుడు తిరిగి యీ పూర్వాచారపరాయణులను యిట్లు సవాలుచేయుచున్నాను 1 నేటివరకుగల ప్రకృతిశాస్త్రములలోని సృష్టిపరిణామజ్ఞానమును వీరంగీకరించెదరా? లేక త్రోసిపుచ్చెదరా? 2 అంగీకరించినయెడల, పురాణములలో వ్రాయబడిన సృష్టివిధానమును దానితో పోల్చి యెట్లు సమర్థించెదరో వ్రాయుడు 3 అంగీకరించనియెడల, వానిలోని సృష్టివిధానమును దానితో పోల్చి యెట్లుసమర్థించెదరో వ్రాయుడు 3 అంగీకరించనియెడల, వానిలోని సృష్టివర్ణనలకు ఆ గ్రంథములే ప్రమాణమనెదరా? లేక వేరుహేతువులు కనపరచి వానిని సమర్థించగలరా? 4 వ్యాసులవారు దానినెట్లు తెలిసికొనగలిగిరి? దివ్యజ్ఞానమువలన తెలిసికొనిరన్న అది ప్రత్యక్షప్రమాణములకు వ్యతిరేకమైనదనియు, అట్టిది మూఢనమ్మకమనియు నే నేలవాదించకూడదు? కాబట్టి చేతనైతే యీ పైప్రశ్నలకు స్పష్టముగ జవాబులు వ్రాయవల

యున బూకరింపుమాటలు, వాగాడంబరములు, హేళనవాక్యములు యెన్నటికినితర్కవాదములని అనిపించుకొనవు

ప్రస్తుతము చర్చనీయాంశము సృష్ట్యుత్పత్తిక్రమము మన పద్మనాభస్వామిగారు హేతువాదమును తప్పక అంగీకరించవలసినదేయని చెప్పుదురు, యింతవరకు దానిని తమ వ్యాసములో సరిగ్గా నను చెప్పిరిము ముందువ్యాసములలో పురాణములలో చెప్పబడిన సృష్టిక్రమమును సమర్థించమని వేడుచున్నాను ఎంతగొప్పవాని విశ్వాసమైనను, సహేతువులు కనుపరచనపుడు, అది మూఢమని చెప్పినంతమాత్రమున ఆయన మూఢుడని వక్కాణించు టెన్నటికినికాదు బడిలో ఒక బాలుడు చేసిన పనినిగురించి "Your act is foolish అని చెప్పవచ్చునుగాని "You are a fool" అని వారికి సర్టిఫికెట్టునీయకూడదు ఆలాగుననే పూర్వులలోనైననేమి, ఆధునికులలోనైననేమి కొన్ని ఆచారములు, విశ్వాసములు, మౌఢ్యములని ఖండించుచున్నంతమాత్రమున వానిని వివరించుచుండిన గ్రంథములుకొందరు యెంతపవిత్రములని యెంచినను ఆగ్రహించతగదు తమకు శక్తియుంటె వానిని సహేతువులతో యితర ప్రమాణములతో సమర్థించవలెను లేదా తూష్ణీంభావమువహించి తమ గుడ్డినమ్మకములో తాముండవచ్చునుగాని వట్టిదూషణలతో వ్యాసములనునింపిన ప్రయోజనములేదు

## పురాణములు—సృష్టిపరిణామము



### 4 వ అధ్యాయము

ఈ విషయమున, నా విమర్శకులు చర్చింపక, నా స్వకీయచరిత్రను గురించి యేమేమియో వ్రాసెదరేమి? పురాణములలో వ్రాసిన సృష్ట్యుత్పత్తి పరిణామములు భౌతికశాస్త్ర జ్ఞానము మనకు ప్రత్యక్ష ప్రమాణముమీద చూపినంతవరకు దానితో సమర్థించవలెనా లేదా, వీనిలో దేనినైనను త్రోసి వేయవలెను. అటుగాక, సనాతనధర్మవాదులగు శ్రీవడ్డి గోపాలకృష్ణశాస్త్రి మొదలగువారు, నా స్వీయచరిత్రలోని నా స్వకీయాభిప్రాయములను, నా యుత్తరములను విమర్శించుటతో తృప్తినొందెదరేమి? వానినిగురించి నేనెప్పటికిని సిగ్గుపడను సరికదా, వానిని వెదజల్లుటకు, నా కున్న జీవితము ను ధారపోసెదను. నా పూర్వఋషులు, మతాచార్యులు, క్రైస్తు, మహమ్మదు, బుద్ధుడు, రాముడు, కృష్ణుడు, జోరోస్టరు మొదలగు వారందరు నాకు వంద్యులే. వారి నీతిధర్మములు వేదాంతమును నేను మెచ్చుకొనవాడనే. కాని, వారందరు మనుష్యమాత్రులే గనుక, వారియభిప్రాయములలో కొన్ని లోపములున్నవని నేను విశ్వసించినపుడు, వానిని ప్రజలముందు పెట్టుట స్వాభావమైనట్టియు, విధ్యుక్తమైనట్టియు కార్యమని నేను తలచెదను. వేదములు, బైబిల్, కోరాన్, మొదలగు యేమతగ్రంథములు

కానిండు వానిలోని కొన్ని విశ్వాసములు కేవలము హాస్య ములని విమర్శించినంతమాత్రమున, ఆ మతకర్తలను నిరశించు టకాదు ప్రతిజాతిలోన, వారివారి పూర్వమతసాంప్రదాయ ములను ఖండించుచున్నారు అప్పుడు పూర్వసాంప్రదాయ కులు గగ్గోలుపెట్టుచునే యుందురు ఈ యాధునికయుగము లో, యీ యన్యోన్యసాంఘిక సంఘట్టనలో "అయ్యో సర్వ జ్ఞులగు నాపూర్వులను తృణీకరించుచున్నారే, నా పవిత్రమత ముసు పాడుచేయుచున్నారే, మిన్ను విరిగి మీద పడిపోవునే మో" యని యంగలార్పులకు జాలి జెందువారెవరు? లక్ష్య పెట్టువారెవరు? మనగోపాలకృష్ణశాస్త్రిగారు స్వర్గమునకు పోయి, నలువదికోట్ల బౌద్ధులు, నలువదికోట్ల జైనావారు, జపానీయులు, యేమతములయందును నమ్మకములేని యితర జాతులవారు, వేనవేలు నరకమునకు పోయినయెడల, నేను వీరందరితో పాటు యుండుటకు యిచ్చగింతునుగాని, యీయన పరమదయాళుడగు దేవునికి మా విషయమై శిఫారసుచేసి, స్వర్గమునకు మమ్మును రప్పించదలచినను మేము ఒప్పుకొనము నాస్తికపథము త్రొక్కు మానవులకు, దేవుడున్నాడో, లేడో యని సందేహపడినను, ఆయనను ప్రార్థించిన అనుపయోగమని నను, మతములన్నియు మానవకల్పితములన్నను, యెట్టినష్టము యెన్నటికి రాదని నాదృఢనమ్మకము కాబట్టి మనశాస్త్రి గారు యీ యప్రస్తుత ప్రశంసను కట్టిపెట్టి, పై విషయచర్చ లోనే వేసిన ప్రశ్నలకు జవాబు దయచేయుడని వేడుచున్నాను.

ఇక కాశీభొట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి విమర్శనను చదివితిని అన్యోన్యవ్యక్తి దూషణలు కూడదను సూత్రమును నేనే యుల్లంఘించితినని వ్యాసములలో కొన్ని యుదాహరణలు చూపించిరి నేనుకూడ మానవమాత్రుడనే గనుక అట్టివానిని సహితము, నా వ్యాసములో దొర్లనిండచేసెదను కాని పూర్వుల లోపములను చూపించి, వానిని యిప్పుడు గ్రుడ్డిగానమ్మువారినడతను నేను కఠినముగా విమర్శించినపుడు, తమపూర్వులకు దూషించితిననిగాని, తమ్మును దూషించితిననిగాని యనుకొనకూడదు

లండనుపట్టణమనునది ఒకటియున్నదా, లేదా యను విషయమును గురించి, దానిని చూచివచ్చినవారు చెప్పునది నమ్మటయు, ఒక స్వర్గమనునది ఒకటి యున్నదని పూర్వమతకారులు అయిదువేల సంవత్సరములక్రిందట వ్రాసినది నమ్మటయు, సరితూగినవనియే బ్రహ్మయ్యశాస్త్రులుగారి వాదమా? పదితలలుగల మనిసిని ప్రకృతిలో విపరీత లక్షణముగలవారిని మన మిప్పుడు చూచినట్లే వాల్మీకి చూచియుండకూడదాయని వీరు ప్రశ్నించెదరు ప్రకృతిలో కారణములేనిది కార్య ముద్భవించదు, స్త్రీయొక్క రక్తస్రావములోని గ్రుడ్డులో, పురుషబీజములోని ఒకటిరెండుమూడు అణువులు ఒక్కసారిగా కలియుట తటస్థపడినపుడు, యిద్దరుముగ్గురు కవల పిల్లలు పుట్టవచ్చును వీరు, ఒకటివెంట ఒకరు తల్లి గర్భకోశమునుండి వెడలెదరు. ఒకప్పుడు వీరి శరీరములు

అంటుకొనిపోయి విడకుండ, బయటకు రాగలిగినయెడల, నానావికారరూపములుగా రెండుతలలతోగాని, రెండుపొట్ట లతోగాని, నాలుగుచేతులలోగాని పుట్టవచ్చును సాధారణ ముగా యిట్టి కళేబరము జీవించదు గొప్పధీమంతుఁడు బల శాలి, చిరకాలజీవియగు రావణుడనే రాక్షసుడు పదితలలతో విపరీతాకారముగలిగి పుట్టియుండడనియు, యిదికవియొక్క యుత్ప్రేక్షయనియు నాయభిప్రాయము ఇట్టి కళేబరములు, భూగర్భశాస్త్రకారులు, యెంతపరిశోధించినను కనుపడలేదు. మన బ్రహ్మయ్యశాస్త్రులుగారు యిట్టివియున్నట్టు యేశాస్త్ర జ్ఞుని గ్రంథములో చదివిరో దయచేసి వ్రాసినయెడల, నేను దానిని తెప్పించి చదువుకొనెదను.

ద్రవ్యము, శక్తి ఒకపదార్థము నుండియె పుట్టెనను విష యమును గురించియు, జడపదార్థములోనుండి జీవ మెట్లుత్పన్న మైయుండవచ్చునను విషయమును గురించియు, యింకను భౌతిక శాస్త్రజ్ఞులు భిన్నాభిప్రాయముగలవారై యున్నందున, వానిని వేరుగానున్నట్లే వ్రాసితిని మన శాస్త్రిగారు, యీరెండును ఒకటే వస్తువులోనుండి యుద్భవించెనని మన పూర్వులే వ్రాసియున్నారు గనుక యిప్పటి భౌతికశాస్త్రజ్ఞానమంతయు మనవారి కెన్ని లక్షలసంవత్సరముల క్రిందనో గలిగియుండెనని వీరి వాదన అటులైనచో, సృష్ట్యోత్పత్తి, పరిణామములను గురించి పూర్తిగా వ్రాయబడిన బ్రహ్మాండపురాణములోని వానిని పైవాదనతో యెట్లుసమర్థించగలరో వీరిని వ్రాయ

గోరుచున్నాను ఆపురాణములో క్రింది జడపదార్థములనుండి పై జీవరాసులన్నియు, ఉత్పన్నమైనవని చెప్పుటకు బదులుగా దేవుడు, బ్రహ్మాదిదేవతలగుండా యీచరాచరసృష్టిలోనున్న ప్రతివస్తువున ప్రత్యేకముగా సృజించినట్లు వ్రాయబడినది నాయభిప్రాయము పొరబాటైన నేను దిద్దుకొందును ఈయన పదేపదే నాకు మన పురాణములుగాని, భౌతికశాస్త్రములు గాని తెలియనే తెలియవని సాహసించి వ్రాయుచుండును నే నీ రెంటిని చదివియే వ్రాసితిని ఇంకను చదివి వ్రాయు చుందును ఆధునిక భౌతికశాస్త్రజ్ఞుల పరిశోధనలయందు తమకు అత్యంత గౌరవమున్నదనియు కాని వారిలోనే యింకను భేదాభిప్రాయములుండుటచే వానిని మనము విమర్శించవచ్చుననియు యీయన చేయువాదనననుసరించియే మనపూర్వుల జ్ఞానమందు నాకు అత్యంత గౌరవమున్న దనియు, కాని వారి యభిప్రాయములు కొన్ని తప్పనియు, వీని నన్నిటినితూచా తప్పక అనుసరించుటయోగ్యము క్షేమ కరము కాదనియు, యెటులైనను సత్యాన్వేషణమే మనకు ప్రధానముగాని, అయిదువేల సంవత్సరములక్రింద నున్నవారి యూహలను గ్రుడ్డిగానమ్మవలదనియు నేను మనవి చేయు చున్నాను. సర్వజ్ఞత వీరిలో ఉభయులయందును లేదని శాస్త్రులుగారు ఒప్పుకొన్నయెడల, అంతిగా మా ఉభయుల మధ్యను తగవులుండవు నేను వ్రాయు ప్రతివిషయమునకు, భౌతికశాస్త్రజ్ఞుల గ్రంధములను, పేజీలతో శాస్త్రులుగారు

కోరితే వ్రాయుచుందును. వారు చెప్పువిషయములను భౌతిక శాస్త్రములలో చూపించిన నేను ఒప్పుకొనెదను. కాని పూర్వగ్రంథములలో యిట్లు వ్రాయబడియున్నదని చెప్పినంత మాత్రమున, లేక నిజముగా అట్లున్నంతమాత్రమున, సనాతన ధర్మవాదులుతప్ప మరియెవరును ఒప్పుకొనజాలరు. వీరికి శృతి స్మృతి పురాణాదులన్నియు ప్రమాణములే. నాకివిగాని, మరియేయితర మతగ్రంథముగాని ప్రమాణముకాదు. గనుక, వీరితో నెనట్టి వాగ్వాదమును పెట్టుకొనక, హేతువాదన మీదనే, వానిలోని కొన్ని మూఢనమ్మకములను విమర్శించు చున్నాను.

## పురాణములపై

### విమర్శకులకు ఒకటే సవాలు

ప్రత్యక్షప్రమాణములతో, నేటివరకు భౌతికశాస్త్ర పరిశోధనలనుబట్టి మనము తెలిసికొనగలిగిన సృష్టిపరిణామము పురాణములలో వ్రాసిన సృష్టిక్రమమునకు వ్యతిరేకమా, కాదా? వ్యతిరేకము కాదనువారు పై రెంటిని కలపి సమర్థించ వలెను. వ్యతిరేకమని యొప్పుకొన్నవారు వానిలో, దేనిని యేల త్యజించెదరు? ప్రస్తుతవిషయముతో సంబంధించని, ఆదిదైవిక, ఆధ్యాత్మికవిషయములను గురించి నాకుగల యభిప్రాయములను చర్చించుచున్న లాభమేమి? అవి యనేకులకు యిష్టము లేకపోవచ్చును. లోకములో, యేమతగ్రంథముగాని, యేమతాచార్యుడు గాని, సంపూర్ణసత్యమును గ్రహించలే

దనియు, గ్రహించుట అసంభవమనియు నానమ్మకము దీనిని గురించి "సూర్యనారాయణీయము" అను గ్రంధము వ్రాసి నచో, నేను "వెర్రిపప్పీయము" అను మరియొక యుక్తగ్రంధ మును వ్రాయగలను కాని యిట్టి గ్రంధరచనలు, వారివారి దురహంకారములు, దురభిమానములే బయటపెట్టునుగాని, ప్రజలజ్ఞానోత్పత్తి కెల్లు తోడ్పడగలవు? హేతుపూర్వకముగ యేవిషయముగాని విమర్శనచేసి, చదువరులను ఒప్పించు టయు, జ్ఞానవిజ్ఞానబీజములను ప్రజల మనస్సులలో వెదజల్లు టయు ప్రధానము ఒండొరుల స్వీయాభిప్రాయములను యితర విషయములలో నున్నవన్నియు అధిక్షేపించుచు, అసలు ప్రశ్నను నెమ్మదిగా జారవిడుచుట న్యాయముకాదు ఈప్రస్తు తవిషయవిచారణ, నావిమర్శకులలో మృగ్యము "అయ్యో! నాశృతిస్మృతిపురాణములను యీయన ధిక్కరించుచున్నాడే? ఈయనకు సంస్కృతభాష రాక రహస్యార్ధములు తెలిసికొన జాలకున్నాడు! పాపము యీయన రౌరవాదినరకములకు పోకతప్పదు! పోతే పోయినాడు, ప్రజలకు యెంతహాని కలిగిం చుచున్నాడు!" అను యీవేదనలు, శోకములతో పత్రికలలో పుటలుపుటలు నింపిన ప్రయోజనమేమి? కాబటి నామొదటి పై ప్రశ్నలకు జవాబులను, సహేతువులతో వ్రాయగల సమ ర్ధులకు నేను మిక్కిలికృతజ్ఞుడనై నేను పై విషయమును గురించి వ్రాసిన వ్యాసములలో లోపము లున్న యెడల వానిని సవ రించుకొనుటకు యెల్లప్పుడు సిద్ధముగానేయున్నాను

## 5 వ అధ్యాయము

ఈ విషయమై శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, వ్యాసములు వ్రాయుచున్నారు మనపూర్వుల ఘనతను గురించి యుద్గ్రంధము లనేకములు వ్రాయబడియుండుట చేత, వీరు పదేపదే యీ విషయమై వ్రాయనవసరములేదు నేను మన పూర్వులు, యీజిప్షియనులు, బాబిలోని యనులు, అస్సీరియనులు, పారసనులు మొదలగువారు, వివిధశాస్త్రములలో నెంతెంత కృషిచేసినది నాకు తెలియకపోలేదు నేనువారిని నిందించలేదు వారియందు నాకు ఎక్కిలి గౌరవముకలదు అంతమాత్రముచేత పురాణములలో వ్రాసిన సృష్ట్యోత్పత్తి, సృష్టి పరిణామమును నేను విమర్శించుట అపరాధమా? ఈ శాస్త్రి గారును, మరికొందరు సనాతనధర్మవాదులును, నేను వ్రాసినది, యీవిషయములలో తప్పైనయెడల వానిలో నిజముగా యేమి వ్రాసినది తెలియచెప్పినచో నేను వీరియందు కృతజ్ఞతచూపెదను కాని నేను ఆ పురాణములు, భగవద్గీతలు, చదువనే లేదనియు, నాకేమియు తెలియదనియు ఊరక మనపూర్వులను నిందించుచున్నాననియు వ్రాసిన నేమి ప్రయోజనము?

ఈ పురాణములలోని యంశములు యెంతవరకు మనము నమ్మతగినవి? నైతికసూత్రములు, రాజులచరిత్రలను

గురించియు, ఆయాకాలపు సాంఘికవిషయములను గురించియు వీని యుపయోగమును నేను తిరస్కరించలేదు వీనిలో ఊహలమీఁద వ్రాసినవి తూచాతప్పక నమ్మవలదనియు, ప్రకృతిలో జరుగని, జరుగనేరని అభూతకల్పనలు, విద్యావిహీనులగు అప్పటి జనసామాన్యమునకు అతిశయోక్తులతో వ్రాయబడెననియు నావాదన దీనికి ఆధునిక భౌతికశాస్త్రజ్ఞానమును నేను తోడు చేసికొంటిని సృష్ట్యుత్పత్తి సృష్టిపరిణామమను ఒక్కవిషయము తీసికొని చర్చించి, యీ విషయమై పురాణములలో వ్రాసినది సరికాదని ఒకసారి ఋజువుకాగానే పురాణములను, మతగ్రంథములుగా నొప్పుకొనకూడదనియు, శ్రుతిస్మృతికరలకంటె యీ పురాణకర్తలకు, ఆధ్యాత్మిక ఆదిభౌతికవిషయములు యెక్కువగ తెలియవనియు, గ్రుడ్డెద్దు చేనబడినట్లు వీనిని చదువుకొని మురియకుండియు నేను కఠినముగ విమర్శించినంతమాత్రమున నేను నా పూర్వుల నందరిని శుంఠలని నిందించితినని యీ సనాతనధర్మవాదులు నన్ను దూషించుచున్నారు శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు మాత్రము కొంతహేతుపూర్వకమైన వాదనలో దిగువారుగనుక వారినితిరిగి మరియొకసారి యిప్పుడు సవాలు చేయుచున్నాను సృష్ట్యుత్పత్తి, సృష్టిపరిణామముల్లను, బ్రహ్మాండపురాణములో వ్రాసినదానిని తమ కర్థమైనట్లు వ్రాసి వానిని సమర్థింపవేడుచున్నాను ఒరుల దూషణభూషణలను నేను లక్ష్యపెట్టువాడనుకాను అయ్యో! మనము పవిత్రములనుకొన్న పురాణములలోని విషయములు

తప్పులతడికెలని మనపూర్వులను నిందించుచున్నానని వీరి సీతన్న్మశోకములవలన లాభమేమి? నాకుతోచిన సత్యమును నేను వెల్లడించుటకు విమర్శన చేయుచున్నపుడు నా విమర్శనలో యెట్టితప్పులు దొర్లినవి యీ విమర్శకులు చూపించవలెను తమరు విమర్శనచేయుటకు సంపూర్ణస్వాతంత్ర్యము నా వలెనె వారికినిగలదు ఊరక నా యభిప్రాయములు తప్పనియు, వారిట్లు చెప్పిరనియు, వీరిట్లు చెప్పిరనియు, వ్రాసికొన్న లాభమేమి? నేను నాస్తికుడనైన నేమి? లేక ఋగ్వేదము లోని నారదీయ సూక్తఋషివలె ఆధ్యాత్మికవిషయములలో సంశయాత్ముడనైన నేమి? మతములన్నియు పౌరుషేయములని వాదించిననేమి? ఇప్పటిచర్చనీయాంశము పురాణముల ప్రామాణ్యము మన శ్రీ బ్రహ్మయ్యశాస్త్రులుగారు, బ్రహ్మాండపురాణములోని సృష్ట్యుత్పత్తిక్రమమును, వారు గ్రహించినట్లు వ్రాసి దాని సత్యమును నిలబెట్ట ప్రార్థించుచున్నాను వారు వ్రాయు తక్కిన విషయములతో నాకు యెట్టి ప్రసక్తియులేదు ఈపురాణములు మనకు ప్రమాణములు గావని నా వాదన స్థాలీపులాకన్యాయముగ నెర ఒక్క విషయము నెత్తుకొని నా "మనస్వాతంత్ర్యము"న గ్రంథములో విమర్శించితిని, పురాణములలో ఉన్నది ఉన్నట్లు మన శాస్త్రిగారు వ్రాసి సమర్థింపవలెనని తిరిగి వారిని ప్రార్థించుచున్నాను

# మ త స్వ రూ ప ము



## 6 వ అధ్యాయము

ప్రపంచములో అనేకవిధములైన మతములున్నవి. ఇవి యన్నియు కాలానుసారముగ వృద్ధినొంది వికాసము చెందు చున్నవి వీనిలో ననేకమార్పులు కలుగుచునే యుండును ప్రతిమతములోను మూడు ప్రత్యేకభాగము లుండును —

(1) వేదాంతము (Theology or Philosophy) దేవుడననగి యేమి? అత డెట్టివాడు? మనమెట్లు యీ ప్రపంచములో పుట్టితిమి? ఎందుకు పుట్టతిమి? మన కాత్మయనునది ఒకటి యున్నదా? మనము మృతినొందినతరువాత మనకొక సూక్ష్మ శరీర మున్నయెడల, అది యెక్కడకు పోవును? స్వర్గనరకము లను ప్రపంచములు వేరుగా నున్నవా? ప్రకృతికి, పురుషుడు వేరుగా నున్నాడా, లేక దానిలోనే కలసియున్నాడా? పున ర్జన్మ యున్నదా? మానవునికి స్వతంత్రశక్తి యున్నదా, లేక కర్మబద్ధుడా? హిరణ్యగర్భుడనువా డొక డున్నయెడల, అత డెందుండివచ్చెను? స్వయంభువు అను మాట వాచామగోచర మైన యెడల, భక్తియనున ద్లెట్లుసంభవించును? ఈ మొదలగు నాధ్యాత్మిక సంబంధమగు ప్రశ్నలు ఆయామతములలో వేరుగా వివరింపబడుచున్నవి ఇవి యన్నియు ఊహాజనిత ములే గాని, ప్రత్యక్షప్రమాణముమీద నాధారపడునవి కావు

గనుకనే యిదమిద్ధమని వీని విషయమై యెవరును నొక్కి వక్కాణించజాలరు ఒండొరులను ఒప్పించజాలరు ఎవరి మనస్సునకు, యేది తృప్తికలిగించునో దానిని వా రంగీకరింతురు మనఆర్యమతములో, ఉపనిషత్తులు, భగవద్గీత, యీవిషయములను గురించి మనకు బోధించుగ్రంథములో ముఖ్యమైనవి భక్తి, జ్ఞాన, కర్మయోగములన్నియు మోక్షమునకు సాధనములై, మనకు పునర్జన్మ లేకుండ చేయగలవని ఆయాగ్రంథములలో భిన్నభిన్నముగా విశదీకరింపబడుచున్నవి

(2) పురాణకథలు –(Mythology) ప్రతిజాతిలోన వారి పూర్వులలో, గొప్పగొప్ప రాజులు, గురువులు, బలశాలురు, ధీమంతులు మొదలగువారిని దైవస్వరూపులుగా నెంచి, వారిని పూజించెదరు వారికి దేవాలయములను కట్టెదరు వారి ప్రతిమల నందులోనుంచి అనేకవిధములుగ వారిని సేవించెదరు వారిరూపములు, దుస్తులు, ఆభరణములు మొదలగునవి, తమరు ధరించిన వానివలెనే, వారి కేర్పరచెదరు వారిని గురించి, అనశృతముగా వచ్చు చరిత్రలో, కల్లబొల్లి కథల నల్లుచు, వారికి అమానుషక్రియల నారోపింతురు పిచ్చిపిచ్చి వర్ణనలతో నిండిన యిట్టి పురాణగాథలు, ప్రతిజాతిలో కూడ నున్నవి వీనిని ఒండొంటితో పోల్చి చూచుకొనజాలని మూఢులు నమ్మవలసినదే కాని, యింగితజ్ఞానము గలవా రెవరును నమ్మజాలరు ఈ పుక్కిటిపురాణములలో, చరిత్రరూపకమై నిజమైన విషయములు, నైతికధర్మబోధనలను క్రోడిక

కించి మనము తెలిసికొని, వాని ప్రకారము మన నడతను సవరించుకొనుటకు కొంత ఉపయోగపడవచ్చును గాని, వీనిలోని పిట్టకథల నన్నిటిని విశ్వసించి, రామకృష్ణాద్యవతారములన్నియు ఆగ[illegible] [illegible]రాధించుట [illegible]న హిందువులలో ఆచారమై పోయినది ఆ పురాణములలో చెప్పబడిన ప్రతి విషయము సత్యమనియు, అది దివ్యదృష్టిగలన కనిపెట్టబడిన దనియు, దానిని నమ్మనివారు నరకమున బడుదురనియు చెప్పనారంభింతురు వీరు రామకృష్ణాద్యవతారములు ఆదర్శపురుషులని గౌరవించెదరు గాక అంతియే గాని, అసలు ఆదిదేవుడొకడున్నను, ఆయనను ప్రార్థించినను దూషించినను కూడ మన ఒడిలో యేమియు పడదని వీరు గుర్తించరు అనాదియగు కర్మయే మనకు సద్గతి దుర్గతుల నిచ్చునను వీరి వేదాంతమును కూడ పాటించరు మన సత్ప్రవర్తన, పరోపకార బుద్ధి, అహింసా, సత్యము మొదలగు ధర్మముల ఆచరణమే మనలను తరింపజేయవచ్చునని వీరు విశ్వసించిన యెడల, వీరితో అనవసరముగ తలపట్లు పట్టుకొన నక్కరలేదు

(ఎ) కర్మకాండ (Dogmatic rituals) ప్రతిమతములోన, హేతుపూర్వకముగాని కొన్ని తంతులు, కర్మకలాపము, ఖండనములు, సిద్ధాంతములు, ఆచారములు, ప్రాయశ్చిత్తములు, నమ్మకములు, పట్టింపులు మొదలైనవి లెక్కకు మిక్కిలిగా నుండును వీని నన్నిటిని మతగురువులు, పురోహితులు, తమ జీవనముకొరకు పెంచినారు స్త్రీలు మిగుల

సులభముగా, వీరి వలలలో చిక్కెదరు ఉపవాసములు, వ్రత
ములు, యజ్ఞములు, యాగములు, బలులు, దానములు, వృద్ధి
యగుచుండెను వేదకాలమునాటి ప్రకృతి యారాధనము,
చెట్లు పుట్టలు, రాళ్లు రప్పలు, పాములు, ఆవులు, పక్షులు
మొదలగువాని యారాధనము క్రిందకు మారిపోయినది ఇక
మన మంత్రతంత్రములు, బ్రాహ్మణములు సంహితలు,
సూత్రములు, స్మృతులు మొదలగునవి, కర్మకాండయంతయు
మనలో క్లిష్టరూపముదాల్చి మనలను బానిసలుగ చేసివైచి
నవి మన వర్ణాశ్రమ ధర్మములన్నియు వీనిలో చేరినవే నిరా
లంకృతమైన వేదకాలమునాటి ఆర్యమతము, బ్రాహ్మణముల
కాలములో పటాటోపమగు కర్మకాండతో నిండిపోయినది
తెల్లవారుఝామున లేచినది మొదలు రాత్రి పరుండువరకు
మనము చేయవలసిన పనులన్నిటికిని, యీ బ్రాహ్మణమతము
నిబంధనల నేర్పరచెను వీనిలోని కొన్ని బాహ్యశుచి, అంత
శ్శుచులకు ఉపయోగపడినను, మొత్తముమీద జనుల నంద
రిని, లనవసరముగ కాళ్ళు చేతులు బంధించి స్వాతంత్ర్యము
లేకుండచేసి, వాని నుల్లంఘించిన వారికి నరకబాధలు,
ప్రాయశ్చిత్తములు మొదలగు వానిని యేర్పాటు చేసినవి,
నాగరికత హెచ్చినకొలది, వర్ణాశ్రమధర్మ కట్టుబాట్లు కొంత
వరకు సడలి, కర్మకాండ క్రమక్రమముగా శిథిలమై గుంజు
లేని డొల్లవలె మనలోకొన్ని యూపరతో కొంతవరకు నిలచి
యున్నది మన సనాతన ధర్మవాదులమని చెప్పుకొనేవారును,

పూర్వాచార పరాయణులును, వీని నింకను నిలవబెట్ట తలచు కొను ప్రయత్నములు మనకు కాలికోలుపు చుండును వీరి దుర్బల కోపమును, దురహంకారము దురభిమానములు మనకా నవ్వు పుట్టించును పాపము! వీరిని మనమెన్నడు తూలనాడక, మన దారిని మనము పోవుచుండుటయే యుక్తపద్ధతి—కాని వీరి యుపదేశములు, మన సంఘపురోభివృద్ధికి ఆటంకములని నమ్మువారు, వానిని కఠినముగ విమర్శించవలసి యుందురు లేనియెడల ప్రజాసామాన్యములోని మూఢవిశ్వాసములు త్యజింపబడవు మన పూర్వపు అలవాటులను బట్టి మనలోని విద్యావంతులగు నవనాగరికులు కూడ, యీశుష్క కర్మకాండకు కొంతవరకు యిప్పటికి కూడ దాసులగు చున్నారు—ఈ కర్మకాండకు తలయు తోకయులేదు ఏల చేయవలెనో హేతువులు కన్పట్టవు పూర్వకాలమందే మనలో ననేకులు, వీని నుల్లంఘించుచుండిరి ఈవర్ణాశ్రమధర్మపరిణామమును గురించి, కళ్ళుపెట్టుకొని పూర్వగ్రంథములను చదువక, మన సనాతనధర్మవాదులు చేయు వాదనలు, చర్చలయం దెవరికి లక్ష్యముండును ఇట్లే ప్రపంచములోని ప్రతిమతము, మూఢవిశ్వాసములతోను, కొన్ని కర్మపటాటోపములతోను నిండియుండి యీ యాధునికయుగములో మారుచున్నది నీతికి పునాదులు, యీమతములు కావనియు, యివి, నైతికమార్గమున, ప్రజలను నడపించుటకు మానవులే, ఆయా దేశకాలములబట్టి యేర్పరచుకొని మార్చుకొనుచుండి

రనియు మనము తెలిసికొనవలెను. ఈ కాలములో మన హైందవమతము, ముఖ్యముగా సర్వమానవసౌభ్రాతృత్వము నకు భంగము కలిగించి, జుట్టుబొట్టు, కట్టులు, భోజనమజ్జన వివాహాదులు మొదలగు నాచారములలో వైషమ్యములు వృద్ధిచేసినది. ఈ పరస్పరభేదములను రూపుమాపుట మాత్ర మునె, మన యాధ్యాత్మికవిషయచర్చ యెప్పటికిని యుండనే యుండును. వేదాంత విషయములలోను, భౌతికశాస్త్రజ్ఞాన ములోను పరిశోధనలు జరుగుచునె యుండును. కాని మానవ కోటిలో అన్యోన్యప్రేమ, హెచ్చుగుట కట్టి సందేహములేదు. సమస్తజాతులలోని మానవశ్రేష్ఠులు, పూర్వులైననేమి ఆధు నికులైననేమి, మనకు గౌరవపాత్రులే. వారిలోని సద్గుణములను సత్యమైన జ్ఞానమును మనమెన్నడు మరువము. వారిచరిత్ర లను మనబాలురచేత చదివించెదము. కాని హేతువులులేని మూఢవిశ్వాసములను ఆచారములను వారిచేత విసర్జింపజేసి, నీతిమార్గమునకు నిజమైనపునాదులను వారికి బోధించవలెను. మానవుడు, తనసౌఖ్యముకొరకే, తానొక సంఘములో చేరి యుండవలెనని కోరుట స్వభావముగనుక, కొన్ని అలవాటులు, సంప్రదాయములు విడువజాలక, వాని నాచరించుచున్నను, వానిని కఠినముగ విమర్శించి తనతోడి మానవులచేత విసర్జిం పచేయుచుండవలెను. ఇట్లు ప్రతిమతమును నిర్భయముగ విమ ర్శించి, ఖండించుట మనవిద్యాధికుల విధియైయున్నది. తానే మతమును విశ్వసించకపోయినను, మానవసేవయే ప్రధానమని

యెంచి, తాను అహింసాసత్యముల నవలంబించి సన్మార్గము త్రొక్కుచుండిన యెడల దుష్టశిక్షణ, శిష్టరక్షణచేయు వాడొకడు పైన యుండినను, తనకెట్టి నష్టమురాదని ప్రతివాడును గట్టిగ నమ్మవచ్చును

## అమానుషక్రియలు—నమ్మకములు



### 7 వ అధ్యాయము

ప్రకృతిసిద్ధమైన పద్ధతులను మించినవియు, మనకెట్టి సహాయకరములైన సమాధానము లీయజాలనివి యగు విషయములు అమానుషక్రియలని మనము వాడెదము భౌతికశాస్త్రజ్ఞానమున కతీతముగ జరుగు అద్భుతాశ్చర్యలను, మనమెట్టి విచారణచేయక అంగీకరించుట గొప్పపొరబాటు. సృష్టివిషయక శాస్త్రములలో ఖగోళశాస్త్రము, భూగర్భశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము మొదలగునవి చేరియుండి, ప్రపంచములో కనపడువిషయము లన్నియు స్వాభావికనియమముల వలననే కలిగినవని నమ్మవలయును. మూఢవిశ్వాసములు, సబబులేని పట్టుదలలు, మానవకోటికి గొప్పవిరోధులుగ నెంచవలెను ప్రకృతిశాస్త్రములు, మన బుద్ధియు మనకు ముఖ్యస్నేహితులు కాబట్టి యీ అమానుషక్రియలందు నమ్మకములను ఖండించుట మనవిధి భౌతిక

శాస్త్రజ్ఞాన మభివృద్ధియైన కొలది, యిట్టి మూఢనమ్మకములు వెనుకకు నెట్టబడుచునే యున్నవి. మానవుడు మొదట ఎప్పుడు సంచార ప్రాయుడుగ నున్నపుడు, తినుట, పిల్లలను కనుటతప్ప మరి యే పనియు వాని కగత్యములేదు. అతడు స్థావరముగా ఒక చోట నుండేవాడు కాడు. ప్రకృతిలో దొరకు పళ్లు, ఆకులు, చేపలు, క్షుద్రజంతువులను పట్టుకొని తినుచు క్షుద్బాధ తీర్చుకొనుచుండెను. తనబుద్ధి నుపయోగించుకొన జాలక, రాళ్లను, చెప్పలను, యెముకలను మొదలగువానిని పూజించుచు, అవి తనకు మంచియో చెడుగునో చేయగలవని నమ్ముచుండెను. ఇట్టి అడవిజాతివారు యిప్పటికిని శింహాళము, అండమానుదీవులు, న్యూగినీ మొదలగు దేశములలో నున్నారు. వీరికంటె కొంచము నాగరికతగల కిరాతులు, భూమిని దున్నకొనుట, పశువులను పెంచుట, భోజనపదార్థములను నిలవచేసికొనుట మొదలగు పనులు నేర్చుటవలన, కొంత సావకాశమేర్పడినది. ప్రాణముగల చెట్లు చేమలను దేవతలుగ నేర్పరుచుకొని పూజించిరి. ఆత్మ, లేక దేవత యేదియో యొకటి వానిలోను తమలోను కూడా ఉన్నదనియు, చచ్చినపుడు అదికూడా శరీరమునుండి లేచిపోవుననియు నమ్ముచుండిరి. నాగరికత వృద్ధియైన కొలది, మానవులు సంఘములుగా యేర్పడి వివిధవృత్తుల నవలంబించి, స్థిరముగా ఒకరాష్ట్రిముసు యేర్పరుచుకొని కళలు, శాస్త్రములు కొంచముగా నేర్వనారంభించిరి. ప్రతిజీవములో నున్న దేవతలకన్నిటికి ఆదిదేవత ఒకటియుండునని నమ్మ మొదలి

డిరి మరి కొంతకాలమునకు, భూమి గుండ్రముగా నున్న ట్లును, అది సూర్యునిచుట్టు తిరుగుచు, దివారాత్రములు, ఋతువులు యేర్పడుచున్నట్లు కనిపెట్టిరి మత విషయములలో, మోసెను, క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు, ఆర్యుల ఋషులు మొదలగువారికి దేవుడు కనపడి వారిచేత అద్భుతకార్యములు చెయించుటయు, వారిద్వారా మానవులకు సందేశములు పంపి వారిచేత ఆయన మతగ్రంథములు వ్రాయించుటయు బయలు దేరినవి నేత్రములులేని వారికి నేత్రములనిచ్చుట, చచ్చినవా నిని బ్రతికించుట, దయ్యములను పారద్రోలుట, మొదలగు అభూతకల్పన లెన్నియో, వారినిగురించి, బయలుదేరినవి. వీనిని ఆయాకాలములలో కొందరు నమ్మినప్పటికి, యీ మత విశ్వాసములలో మార్పులనేకములు కలుగు చున్నప్పటికి, సుమారు మూడువేల సంవత్సరములనుండి యీ మతసాంప్ర దాయములు నేటివరకు నిలచియే యున్నవి ప్రకృతికి భిన్న ముగ ఒకదేవుడను వాడున్నాడనియు, మనలోని ఆత్మనిత్య మనియు, మానవేచ్ఛకు స్వాతంత్ర్యమున్న దనియు యిప్పటి కిని జనబాహుళ్యము నమ్ముచున్నారు ప్రకృతియంతయు దేవునిలోనే యున్నదనియు, దేవుడు ప్రకృతియంతయు నిండి యున్నాడనియు, యీ అద్వైతసిద్ధాంతమును నమ్మినయెడల, ప్రకృతినె దేవుడని పిలువవచ్చును. (Pantheism) ఈ ప్రకృ తికి భిన్నముగా దేవుడుగాని, ఆత్మగాని యున్నదని భౌతికశా స్త్రపరిశోధనల వలన ఋజువుకాలేదు ఒకటే వస్తువునుండి

యీ బ్రహ్మాండమంతయును, దీనిలోని స్థావరజంగమపదార్థము లన్నియును క్రమక్రమముగా ఒకదాని నుండి ఒకటి యుద్భ వించెనని ప్రకృతిపరిణామశాస్త్రము వలన తెలుచున్నది ఇప్ప టి భౌతికశాస్త్రజ్ఞానము లేకపోయినను, పూర్వమునందు మన కాణాదుని ఆరంభవాదమును, కపిలుని గుణపరిణామవాదమును కొంతవరకు యీ నూతన జడాద్వైతవాదమును బలపరచును. శాశ్వతజీవుడనునది, మొదటే తప్పు, వేరుగ నొకటిలేనియు, మానవుడు, తనవంశపారంపర్యముగ వచ్చు గుణవిశేషములు కొంతయున్న, తనచుట్టునుండు పరిస్థితులు, శిక్షణాదులగు నవి కొంతయున్న కలసి, (Natuie and Natuie= Heredity and enviionment) నడచుకొనుచుండును. గాని తానేపని చేయుటకును సంపూర్ణమైన స్వాతంత్ర్యము కలవాడు కాడనియు, జడాద్వైతవాదుల యభిప్రాయము

మనమందరము స్వయముగా భౌతికశాస్త్రములన్నియు సాకల్యముగ చదువజాలకపోయినను, ఆ శాస్త్రజ్ఞుల తుది నిర్ణయములు నేటి కెంతవరకు వచ్చెనో తెలిసికొన్నయెడల, యీ నూతనాద్వైతసిద్ధాంతమును మన మంగీకరింపక తప్పదు ఒకటే పదార్థమునుండి యీ చరాచరసృష్టిక్రమము క్రిందిజీవ రాసులనుండి, మానవుని పుట్టుకయు, బుద్ధివికాసమును మనము గమనించితిమేని, ఆత్మయనునదిగాని, స్వర్గనరకములుగాని, దైవశక్తులుగాని, జన్మపరంపరలుగాని వేరుగానున్నవని నమ్ము టకు మనకెట్టికారణములు కన్పించవు మన కనుభవముగా

వంశపారంపర్యముగా వచ్చుచున్న అలవాటులను వదలలేక నీతినియమముల పునాదులను తెలిసికొనలేక, ఆధ్యాత్మికమైన దేదియో ఒకటియున్నదని లేనిపోని భయములు పెట్టుకొని, అనేకమూఢవిశ్వాసములకును, మతసాంప్రదాయములకును దాసులమగుచున్నాము ప్రతివిషయమునకు కారణకార్యసంబంధము లేకపోలేదు ఈ ప్రకృతికి కారణమేమై యుండునో యెవరును చెప్పలేరుగాని, మొట్టమొదటనున్న యేకపదార్థమునుండి యెట్టిపరిణామము స్వభావసిద్ధముగ కలిగినది కలుగుచున్నది మనము తెలిసికొనుటకు ప్రయత్నించవచ్చును

ఈ అఖిలాండ బ్రహ్మాండకోటియంతయు ఒకటే పదార్థముగాని, వేరుపదార్థసంయోగమువలన కలుగలేదు ఈ పదార్థమే (Substance) రెండు చీలికలైనది వీనిని matter and energy అని యందురు ఈ రెండును ఒకదానినివిడచి ఒకటయుండదు వీనిలో యెన్నిమార్పులు కలిగినను, వీనికి హెచ్చుతగ్గులుండవు జడపదార్థములకు, అనగా జీవములేని పదార్థములకు యింద్రియజ్ఞానము (sensation) చలనము (movement) ఉండవు ఈ జడ ప్రపంచమునుగురించి వివరించుశాస్త్రములు, ఖగోళశాస్త్రము, భూగర్భశాస్త్రము, ఖనిజశాస్త్రము, ఉదకశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము రసాయనశాస్త్రము మొదలగునవి, జీవముగల వస్తువులను గురించి తెలుపుశాస్త్రములు జీవశాస్త్రము, శారీరకశాస్త్రము వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, మొదలగునవి ఈశాస్త్రము

లన్నిటిలో అనేక అంతర్భాగములున్నవి ప్రకృతిపరిణామ మును గ్రహించుటకు, యీ అంతర్భాగశాస్త్రములలో ప్రత్యే కపరిశ్రమచేసి, నూతనపరిశోధనలను కావించుచున్నారు వీని లో ముఖ్యమైనశాస్త్రములు మృతకళేబరములను పరీక్షించి వానియుత్పత్తికాలమును గురించి తెలియజేయుశాస్త్రము, వెనుకటికాలములో చచ్చినజంతువుల యొక్కయు, యిప్పుడు జీవించియున్న జంతువులయొక్కయు అస్థిపంజరములను పోల్చి ఆయాజంతువులకు గల సంబంధమును తెలుపగలశాస్త్రము సమస్తజీవరాసుల పిండోత్పత్తి, వృద్ధులనుగురించి చెప్పుశాస్త్ర ము, మానవునిపుట్టుక, అతనిక్రమాభివృద్ధిని గురించి విశదీక రించుశాస్త్రము మొదలగునవి ప్రత్యక్షప్రమాణములమీాద న ధారపడిన యీ వివిధశాస్త్రములలోని పండితులు, యిప్పటి వరకుచేసిన పరిశోధనలను బట్టి మనమొకడే, ఆత్మయనియు, ప్రత్యేకముగా వేరేదేవు డొకడులేడనియు, సిద్ధాంతీకరణము చేయుచున్నారు

ఏ విషయములో నైనను సత్యాన్వేషణమునకు స్వాను భవమే ప్రమాణము ఏ మతగ్రంథము యెన్నిసారులు చదివి నను, సత్యము బయల్పడనేరదు. అనేక వేల శతాబ్దములనుండి, మానవానుభవము, కొంచము కొంచముగా, భౌతికశాస్త్ర జ్ఞానమును బట్టి యభివృద్ధియగుచున్నది కనికరములేని నిజ స్థితులు మనయింద్రియములకు గోచరమైనకొలది సత్యమును గ్రహించగలుగుచున్నాము అడవిజాతులైన నేమి వేదాంతు

లైన నేమి, వీరుభయులు ఊహించువిషయములు ఋజువుకా నపుడు మనము వేనిని నమ్మవలెను? గొప్పకవీశ్వరులు, స్రష్ట లు, పండితులు, ఋషులు, వేదాంతులు మొదలగు వారనేక మంది మేధావంతులు వారి వారికి తోచినప్రకారము, అనేక వేల సంవత్సరములనుండి, ఆధ్యాత్మికవిషయములలో పరి పరివిధముల నూహలు చేయుచుండిరి వాని నన్నిటిని చదివి చూచుటవలన మనకు ప్రయోజనమేమి? వానిని ఒకదానితో నొకదానిని పోల్చి చూచుకొనుచు, సమన్వయము చేయప్రయ త్నించుచు కాలము గడుపుచుండిన యేమి యుపయోగము? బహుసంఘములలోనియనుభవములను కఠినవిమర్శ న చేసిన గాని మనమంగీకరింపవలసి పడదు ఒకవ్యక్తియొక్క ప్రమా ణమణుమాత్రమే అతడు అనేకపొరబాట్లకులోను కావచ్చును. తనకొక్కనికి తోచినదిగనుక, అందరు దానిని నమ్మవలసినదని యే మానవుడును చెప్పతగడు ఏ విషయములో గాని తనకే సత్యమంతయు గోచరించెనని చెప్పుట మిక్కిలి సాహసము మానవులలో జ్ఞానాభివృద్ధికి మూలబీజము యెవరో ఒకరు చెప్పి నది విచక్షణచేయకుండ నమ్మకుండుటయే అట్టి విచక్షణ జ్ఞానములేనివారు, సంపూర్ణ మనస్స్వాతంత్ర్యముతో వివిధజా తులలోని మేధావంతులే భవించిన భౌతికశాస్త్రపరిశోధనలు మనలను తీసికొనిపోయి నంతవరకే నడువవలెను అమోఘ మైన సత్యమును కనుగొనుట కింతకంటె రాజమార్గము వేరొ కటిలేదు మనమానసికశక్తులన్నియు యీ భౌతికశాస్త్రము

లనుబట్టియే నిరూపింపబడుచున్నవి సత్యాన్వేషణమునకు ప్రకృతిశాస్త్రరహస్యజ్ఞానమే మన కాధారము మానవాభివృద్ధియందు నమ్మకములేనివారు, తమకిష్టమైన యేమత సంప్రదాయమైనను అవలంబించి పూర్వస్మశానవాటికలలో విహరించుచుండవచ్చును కాని, మానవాభివృద్ధిని కోరి దాని యందభిమానము కలవారు మాత్రము, హేతుపూర్వకమైనట్టియు, ప్రత్యక్షప్రమాణములతో కూడుకొన్నట్టియు మేధావంతులైన భౌతికశాస్త్రజ్ఞుల యేకగ్రీవాభిప్రాయములను ఒప్పి నడచుకొనుటయే శ్రేయస్కరము

## మతములు—ప్రకృతిశాస్త్రములు



### 8 వ అధ్యాయము

కొందరు మన పురాణగాథలను, భౌతికశాస్త్రజ్ఞానముతో ముడి పెట్టుటకు ప్రయత్నించుచున్నట్లు, యీ దొరగారు బైబిలులోని పిట్టకథలను సమర్థించుచుందురు ఈయన గొప్ప పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞుడు తక్కిన భౌతికశాస్త్రములలో కూడ కొంతవరకు పరిశ్రమ చేసినవాడు ఈ సృష్టిని గురించి పరిణామ వాదమును పూర్తముగ నంగీకరించుచు బైబిలు గ్రంథములోని సృష్టిక్రమమును యెట్లైనటో సమర్థింప జూచుచుండును ఈయన, ఆరు సంవత్సరములక్రింద వ్రాసిన

"పరిణామము—ఈశ్వరసృష్టి" యను గ్రంథమును నేను కొద్ది కాలము క్రిందటనే చదువుట సంభవించినది. తన యభిమాన విద్యయగు పదార్థ విజ్ఞానశాస్త్రమును బట్టియే గాక, యితర ప్రకృతిశాస్త్రములను బట్టి కూడా యీభూమియొక్క చరిత్ర కనీసము నలుబదికోట్ల సంవత్సరముల పై కాలమునుండి వ్యాపించి యున్నదనియు, క్రింది జంతువులనుండి మానవుడు పుట్టి ఒకలక్ష సంవత్సరములు మాత్రమై యుండవచ్చుననియు, సూర్యరశ్మి నూటికి ఒకభాగము తగ్గవలెనన్న 150 అర్బుదముల సంవత్సరములైనను పట్టుననియు యీాయన ఒప్పుకొనియున్నాడు. భౌతికశాస్త్రజ్ఞుల పరిశోధనల ననుసరించి, దేవుని ప్రత్యేక ప్రత్యేకముగా జడపదార్థములను, స్థావర జంగమాదులను, మనుష్యులను సృజించలేనని యీాయన గట్టిగ నమ్ముచు తనకున్న సందేహములు కొన్నిటిని వివరించెను (1) జడ పదార్థములనుండి జీవమెట్లు యుద్భవమయ్యెను? (2) ప్రకృతిలో యిట్టి క్రమ విలాసపద్ధతి యెట్లేర్పడెను? (3) దాని నెవరేర్పచి యుందురు? ఈప్రశ్నలకు సమాధానములు దొరకలేదని ఒప్పుకొనుచు, దేవుడొక డుండవచ్చుననియు, యీా సృష్టిపరిణామమునకు కూడా ఆయనే కర్త యనియు, యింకను మేధాసంపత్తు కలుగుటకు, మానవునికి పరిపూర్ణమనస్స్వాతంత్ర్యము నిచ్చి తనకు సహకారిగా చేసి కొని అతని బుద్ధిని వికసింప జేయుచుండుననియు యీాయన నమ్మకము. తనతో అనేకమంది భౌతికశాస్త్రజ్ఞు లేకీభవించ

రని తనకు బాగుగా తెలుసుననియు, తన నమ్మకముకూడా ఊహలమీదనే ఆధారపరచు చున్నాననియు, దానికిష్టపడిన వారు తనతో యేకీభవించ వచ్చుననియు, యీయన వ్రాసి నారు ఇదియే కూడదని నావాదన తన భౌతికశాస్త్రజ్ఞానము తన్నెంతవరకు తీసికొనిపోయి విడచెనో అంతవరకే ఆగక, దానిని త్రోసిపుచ్చజాలక, పిట్టకథలతో నిండిన బైబిలు మత గ్రంథములోని సృష్టిక్రమమును అతి పిచ్చిగా సమర్థించ గల చెను. కాని యీ విషయములో యీయన అపజయము గాంచెనని స్పష్టముగ చెప్పవచ్చును తనకును యితర భౌతిక శాస్త్రజ్ఞులకును తెలియని సంగతులు యింకను ననేకము లున్నవని ఒప్పుకొనుచు, మనము చనిపోయిన తరువాతి మన యాత్మలెక్కడికో పోయి యుండుననియు, దేవుడనువా డొక డుండవచ్చుననియు, మన యాత్మలింకను అభివృద్ధి నొందుచు శాశ్వతముగా యెక్కడనో యుండుననియు, భగవంతుని చిత్కళ మనలో నుండుననియు యీయన నమ్ముచుండును, బైబిలు లోని విషయములు పైకి పిచ్చిపిచ్చివిగా కనపడినను, వాని అంతరార్థములలో కొంత సత్యమున్నదని యీయన నమ్మును. ఇట్టి నమ్మకముల కంతెక్కడ? క్రైస్తవుల బైబిలులో గాని, మన మతగ్రంథములలో గాని సృష్టిని గురించి వ్రాయబడిన విషయములు శుద్ధ కల్పనలని, భౌతికశాస్త్రజ్ఞుల వాదము వీరు, తను పరిశోధన లెంతవరకు పోయెనో అంతవరకే యీ మతగ్రంథములను విమర్శించి, అవి తప్పులతడికెలని రుజువు

చేయుచు, తక్కిన విషయములు, ఊహలమీదనే ఆధారపడు చున్నవని చెప్పెదరు ఇదియే సరియైన రాజమార్గము సృష్టి క్రమమంతయు మన పూర్వులకు తెలిసియున్నట్లు వారి గ్రంథములను భౌతికశాస్త్రజ్ఞానముతో సమన్వయపరచుటకు ప్రయత్నించు వారికంటె, గ్రుడ్డినమ్మకమును త్రికరణశుద్ధి గాగలవారే యోగ్యులని తోచుచున్నది మొదటివారు సంఘమునకు యెక్కువ అపకారులు వీరి వాండిత్యము తక్కువను, బహుమందిని మూఢవిశ్వాసములకు దాసులనుగా చేయుటయే గాక, వీరు లోకవంచకులును స్వవంచకులును కూడ నగుచుందురు

మతములు ప్రకృతిశాస్త్రములు రెంటికిని యెన్నటికి సమన్వయము కాదందురు సర్ ఆలివరులాడ్జి మొదలగు భౌతిక శాస్త్రజ్ఞులు కొందరు ఆస్తికులుగా నుండినను ముక్కు చెవులు గల దేవుడొక డున్నాడని గాని, ఆయన సర్వశక్తి కలవాడని గాని నమ్మరు వీరు హేకెల్ నంటి జడాద్వైతులు కాకపోయి నను, వివిధమతములలో ప్రతిపాదింపబడిన అభూత కల్పన లన్నిటిని నిరసింతురు ఇవి యన్నియు ప్రకృతి పరిశోధనలకు వ్యతిరిక్తములును అసంభవములని వారంగీకరింతురు ఆలివరు లాడ్జిగారు, ఆధ్యాత్మిక దృష్టితో హేకెల్‌గారి జడ ద్వైత మును విమర్శనచేసి ఖండించుటకు ప్రయత్నించు చున్నాడు గాని, యీయన విమర్శనలను 1906 వ సంవత్సరములోనే, సర్ రె లంకాస్టరుగారు మిక్కిలి తీవ్రముగను హేతువుల

తోసి ఖండించియున్నారు ఇట్టి భేదాభిప్రాయములు, మన భౌతిక శాస్త్రజ్ఞులలోనే కనపడుచున్నను, వీరందరు మతవిశ్వాసములను యేకగ్రీవముగ త్రోసివేసిరి వీనిని భౌతికశాస్త్ర పరిశోధనలతో సమన్వయము చేయ మొదలుకొనిరి మనలో కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారివంటి కొందరు పెద్దలు, పైన చెప్పిన శాస్త్రజ్ఞలు చేయజాలని పనికి పూనుకొనుచున్నారు వీనిని ఆంగ్లయభాషలో Apologetics అని పిలిచెదరు పూర్వము పురాణములలో నుదహరించిన ఉమానుష క్రియలు, యీ కాలమందు కూడ యేలజరుగవో వీరు తెలుపజాలరు ఈ గ్రంథములలో, యేయొక్క విషయము పొరబాటని ఒప్పుకొన్నను, మన ప్రస్తుతానుభవమునకు విరుద్ధములైనవన్నియు సత్యదూరములనియు, భగవంతుడను వాడు చెప్పిన వేదవాక్యములు కావనియు, ఇవి మానవ కల్పితములే యనియు మనము నమ్మక తప్పదు సృష్టిపరిణామమను ఒక్క విషయమునే తీసికొని, మనపురాణములలో వ్రాసినది ప్రకృతిశాస్త్ర పరిశోధనలకు కేవలము వ్యతిరేకమని ఋజువు చేయుచున్నపుడు, చదువరులు, నామాటలనే నమ్మక, కొంచెము శ్రద్ధతో, ఆ గ్రంథములను పరిశీలించి చూచినయెడల, వారికే సత్యము తేటపడగలదు, ఈ విషయములలో వట్టి బూకరింపులవలన యెట్టి ప్రయోజనము లేదు

భౌతికశాస్త్రము లన్నియు మనము చదువజాలక పోయినను, వానిలోని విషయములను క్రోడీకరించి, మనకు

బోధపడునట్లు ఆంగ్లేయభాషలో వ్రాయబడియున్నవి. వీనిని ఆంధ్రములోని కనువదించినయెడల, మనవారు తమ పురాణములలోని పుక్కిటిగాథలు, మూఢవిశ్వాసములను తప్పక త్యజించి వానిలోని అమూల్యములగు ధర్మబోధనలను మాత్రమే స్వీకరించినను, వానిని పవిత్రమగు మతగ్రంథములుగా నెన్నడు నంగీకరించరు. రామకృష్ణాద్యవతారములు మానవమాత్రులేయనియు, వారికి మనకువలెనే లోపములు చాపల్యతలు లుండెననియు గ్రహించెదరు. డార్విన్, వాలెసు, స్పెన్సరు, హక్స్లి, హెకెల్ మొదలగు భౌతికశాస్త్రజ్ఞులు లందరు సృష్టిపరిణామవిధానమును యేకగ్రీవముగ నొప్పికొన్నారు. ఈ భూమి యనే గ్రహమేగాక, సూర్య చంద్ర నక్షత్రాదులును, పిపీలకము మొదలు మానవునివరకును, యీ మానవుల భాషలు, జాతులు, కళలు, శాస్త్రములు, మతములు, ఆచారములు, నీతి, మనస్సాక్షి, చైతన్యము, సాంఘికరాజకీయసంస్థాపనలు మొదలగు నన్నియును క్రమవికాసము నొందుచు, పరిణామసూత్రఫలములని స్పష్టముగా ఋజువగుచున్నది. మానవుడనువాడు, ప్రకృతిలో, ప్రత్యేకముగా సృజింపబడినవాడు కాడనియు, దానిలో ఒక భాగమై, క్రింది జంతువులనుండి క్రమవికాసముచేత నుద్భవించినవాడనియు, భౌతికశాస్త్రములవలన తేలుచున్న విషయము. ఇది సత్యమని అంగీకరించినచో, మతగ్రంథముల ప్రమాణముమూలపడవలసినదే. అతిపవిత్రములైనవనియు, సత్యములనియు,

మోక్షదాయకములనియు, మనవారు చదువుకొనుచున్న యీ పురాణములలో, చరిత్రవిషయములుతప్ప తక్కిన వన్నియు అభూతకల్పనలని త్రోసివేయకతప్పదు

మొదట, డార్విన్‌గారు, వ్రాసిన "మానవోత్పత్తి" యను గ్రంథములోని ముఖ్యవిషయములు, యిటీవల వెలువడిన నూతన భౌతికశాస్త్రశాఖలలోని పరిశోధనలవలన బలపడుచున్నవి ప్రాచీనయుగములలో జీవించి మృతిజెందిన జంతువుల యెముకలపరిశోధనశాస్త్రము (Paleontology) భూగర్భశాస్త్రము (Geology), జంతుశాస్త్రము (Zoology), జీవశాస్త్రము (Biology), వివిధజంతువుల యెముకలనుపోల్చు శాస్త్రము (Comparative anatomy), శారీరశాస్త్రము (Physiology), రోగలక్షణశాస్త్రము (Pathology), పిండోత్పత్తి వృద్ధులనుగురించిన శాస్త్రము (Embryology), మొదలగు శాస్త్రములలోని ప్రాతిపదికవిషయములైనను చదువుకొన్నయెడల, యీ భూమిమీద మానవుడెట్లు జన్మించినది తెలియనగును నేనుగాని, మన కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు మొదలగు పండితులుగాని, పై శాస్త్రములన్నిటిలో పాండిత్యము సంపాదించలేకపోయినను, ఆయాశాస్త్రజ్ఞులు యేకగ్రీవముగ నొప్పుకొన్నట్టియు, వారి పరిశోధనవలన కలిగిన ఫలములను మనకు కన్నులార కనుపరచుచున్నట్టియు విషయములను తెలిసికొని మన బుద్ధి నుపయోగించి అంగీకరించవచ్చునుకదా! అట్లుగాక, యీ

జ్ఞానమునంతను త్యజించి, మన పూర్వగ్రంథములలో, యీ సృష్టిపరిణామము మొదలగువానినిగురించి వ్రాయబడిన దంతియు సత్యమే యనియు, మన పూర్వులు దివ్యజ్ఞానము కలిగి సర్వజ్ఞులై వానిని వ్రాసిరనియు గ్రుడ్డిగా నమ్మవలసినదే యని చెప్పువారితో వాగ్వాదములు నిష్ప్రయోజనములు—దివ్యజ్ఞాన మనునేమి? మన జ్ఞానమంతియు పంచేంద్రియముల వలనను, వానిగుండ మనోబుద్ధులవలనను కలుగుచుండగా మరి యే యితర సాధనలవలన నూతన వస్తువులను కనిపెట్ట బడవచ్చునో, తెలియచేయు బుజువుభారము దివ్యదృష్టి వాదులపైనున్నది అట్టి దివ్యదృష్టి ఒకటి యున్నదని వారెట్లు నిశ్చయించగలిగిరి? దానివలన తెలిసికొన్నది యే సత్యమని యెట్లు నిర్ణయించగలము? వ్యాసులవారికట్టి దృష్టి యున్నదని యెట్లు మనము భావించవచ్చును? ఆయనకు ఆయనే సాక్షియా? ఈ దివ్యదృష్టి, యిప్పటి కాలములో ఒక్కరికైనను లేకపోవుటకు కారణ మేమి? తమకు గలదని ఒకరు చెప్పుకొన్నంతమాత్రమునను, కొందరు వారికి గలదని ఒప్పుకొన్నంతమాత్రమునను, మనము దాని యునికిని అంగీకరించవలసినదేనా? దివ్యదృష్టి మన పూర్వ ఋషులకు మాత్రమే కలదని నడువువారి కాధారము లెవ్వి మన పూర్వులు వ్రాసినదంతయు, తమ దివ్యదృష్టిని ఆధారముగా చేసికొని వ్రాసిరని చెప్పునంతమాత్రమున యిది హేతువాద మెట్లగును? మన గోపరాజు వైకుంఠరావుగారు మొదలగు

సనాతనధర్మవాదులు, త్రిలింగపత్రికలో, యీ దివ్యదృష్టి వాదనతప్ప మరియొక హేతువాదముతో, పూర్వపురాణము లలో వ్రాయబడిన విషయములను సమర్ధించలేను

నా స్నేహితు డొకడు తిరుపతి వెంకటేశ్వర్లు తన కొండెత్ సహా రాజమహేంద్రవరములోని కోటలింగక్షేత్రము నకు వచ్చి, అక్కడ అఖండగోదావరిలో మునిగి స్నానమాచ రించి, తిరిగి తన యధాస్థానమున ప్రవేశించినట్లు తాను కన్ను లార ప్రతిదినము తన దివ్యదృష్టితో చూచుచున్నానని చెప్పు చున్నాడు. ఇతని కిట్టి దృష్టి కలదని అనేకులు నమ్ము చున్నారు మరియొక స్నేహితుడు కోటిఫలిలోని దేవుడు, అంతర్వేది దేవునియొద్దకుపోయి, ఆయనతో ముచ్చటించి ప్రతిదినము వచ్చుచు పోవుచుండుట తన దివ్యదృష్టితో చూచుచున్నానని ప్రమాణముచేసి చెప్పుచుండును. వీరి మాటల నేలనమ్మకూడదు? అట్టి దృష్టి లేదని యెట్లు నమ్మింపగలము? వీరును, వ్యాసులవారివలె కొన్ని యుద్గ్రంథములను వ్రాసినయెడల కొన్నిశతాబ్దములలో కొందరు మూఢులకవిప్రమాణగ్రంథములుకావచ్చును-ఇట్టి దివ్యదృష్టి యెవరికున్నదో, యెవరికిలేదో నిర్ణయించు టెట్లు? నిర్ణ యించగలవారెవరు? వేదసూత్రములను వ్రాసిన వ్యాసుల వారు యీ పురాణములు వ్రాసిన వ్యాసుడే యని యెట్లు చెప్పగలము? పదునెనిమిది పురాణములను ఒక వ్యాసుడే వ్రాసెనని యెట్లు నిర్ధారణ చేయగలము? వ్యాసులు అన

వేరు అనేక గ్రంథకర్తలు పెట్టికొని యుండవచ్చును ఈ పురాణములన్నియుకూడ, పూర్వము ముద్రణాయంత్రములు లేకపోవుటచే యెన్ని మార్పులు చెందినవో యెవరు చెప్ప గలరు? మన పూర్వ గ్రంథకర్తల యభిప్రాయములలో కొన్ని పొరబాట్లున్నవనగానే "నారికంటె నీ వెక్కువ వాడవా? నీ ప్రత్యక్షప్రమాణముకంటె, వారి దివ్యదృష్టిని నీవలవడజేసికొన్నయెడల, నాకు చెప్పబడంతయు సత్య మనియు, నీ భౌతికశాస్త్రజ్ఞానమంతయు, యింకను వీనిమా లోనేయున్నవనియు నీవు గ్రహించగలుగుదువు" అనే హేతు వాదనతో మన పూర్వాచారపరాయణులు మనలను నిందిం తురు ఇట్టి వారిని మనము ఒప్పించుటెట్లు? పూర్వయుగ ములలో ధర్మదేవత నాలుగువాదములమీాద నడచుచుండె ననియు, రానురాను, యిప్పటికి ఒంటికాలిమీాదనే తిరుగు చున్నదనియు, మనపూర్వులు, యిప్పటి యంత్రసామగ్రితో గాక, తమ దివ్యదృష్టివలననే సమస్తప్రకృతిరహస్యములను కనిపెట్టి మనకు బోధించిరనియు, ఊరక వాకొనుటయేగాని, దాని యునికిని, దాని విధానమును తెలియజెప్పి వీరెవరును నిదర్శన పూర్వకముగ, యెట్టి ఫలములను కనుపరచజాలరు పూర్వపుపురాణములలో వ్రాయబడిన అభూతక్రియలు, యిప్పు డెక్కడను జరుగకపోవుటకు కారణమేమి? దివ్యదృష్టి, మన స్సాక్షి, శాశ్వతధర్మములు, అను పొడిమాటలు కేవలము శుష్కాలాపములు. ప్రపంచములోని మేధావంతులగు వివిధ

నాస్తికశాస్త్రప్రవర్తకులు, తమ పరిశోధన, విమర్శనలమూల
మున మనకు తెలియజేసిరి. అవి కేవలము నమ్మవచ్చునా
గాని, పూర్వుల, మానవశైశవదశలో ఊహాప్రపంచము
మీద నాధారపడి వ్రాసినసంగతులన్నియు సత్యములనియు,
వారి సందేశాలు, శాస్త్రోక్తముగా అనుల్లంఘనీయములనియు
నమ్మకూడదు. ఇట్టి నమ్మకముకంటె, మనోవికాసత్వము
వేరొకటియుండనేరదు. చిన్నపిల్లలకుకూడ, మనకు తెలియ
నిది, తెలిసినట్లు బోధించకూడదు. వారు పెద్దవారైనపుడు,
వారి మెదళ్లలో మనము చిన్నతనములో వేయు అంధవిశ్వాసము
లను పెకిలివేయజాలము. వీరు, తమ భవిష్యజ్జీవనములలో,
స్వతంత్రాలోచన నుపయోగించుకొనజాలక, పెద్దలనమ్మక
ములమీదనే ఆధారపడుచుందురు.

## సనాతన ధర్మవాదులు

### 9వ అధ్యాయము

శ్రుతి స్మృతిపురాణేతిహాసములమీద ఆధారపడిన
మన కర్మకాండయంతయు, దైవనిర్మితమనియు, అనాది
యనియు, అనుల్లంఘనీయమనియు, ఈ కర్మలను విధ్యు
క్తముగ నాచరించనివారు పతితులై నరకమున బడుదురనియు,

లేక నికృష్ట జన్మపరంపరల నెత్తుదురనియు, ను హిందూ సనాతనధర్మవాదుల వాదనయని నాయభిప్రాయమనుచున్నాను ఇటువంటి వారిలో బహుమంది యీ అభిప్రాయము గైకొనుటవలన వారి వారి నెదుర్కొనుటలు యీ సమయమునందు ముఖ్యావసరము పూర్వకాలమునందున్న జాతులలో యున్న మూఢవిశ్వాసములు, మూఢాచారములు, మూఢభయములు మనలో కూడ నంటియుండెను. ఏపలో కాలవశమున కొన్ని బొత్తిగా నశించినవి, కొన్ని మారుచున్నవి కొన్ని యింకను ప్రతిదేశములోను విద్యాగంధములేని పామరజనములో వ్యాపించియున్నవి కాని, వానియందు యిప్పుడున్నశక్తి కలిగి గాని, లేక ప్రజలలో నాస్తికభావము కలుగచేయవలెననిగాని, మరి యే యితరయుద్దేశములతోనో మనపూర్వులు వానిని మతముతో ముడిపెట్టి వానిని సంబంధించి వాటికి దైవిక శిక్షలనేర్పరచి వర్ణాశ్రమధర్మముల నిలబెట్ట ప్రయత్నించిరి వీని మంచి చెడ్డలు ఆవశ్యకతానావశ్యకతలు మన స్వతంత్రాలోచనకు వదలక ధర్మశాస్త్రరూపముగ జనుల నెల్లప్పుడు బంధించునట్లు చేయగ నిట్లు రెండుమూడువేల సంవత్సరములు గడచినవి మనదేశములో బుద్ధదేవుడు, జైనగురువులు, రామమోహనరాయలు, దయానందసరస్వతి మొదలగువారు వివిధమార్గముల సంస్కరణాలకు ప్రయత్నించినను జనసామాన్యమంతయు ధర్మశాస్త్రములకే పరుసకమాత్రము కట్టుపడుచున్నట్లు కనుపడుచుందురు వీనినివిమర్శించి కాలానుసారముగ మార్చుకొనుటకు

అధికారముగల పూర్వాచార్య సభల కీరోజులలో తావు లేక పోవుచుచే వ్యక్తుల యిచ్ఛానుసారముగా వీనిని మార్చుకొనుచు తప్పనిసరి వచ్చుచున్నది కాని యిట్టిస్థితిలో మన మనవనుసముగ సంఘముకొరకు అనేకమూఢాచారముల పట్టుకొని వ్రేలాడవలసి వచ్చుచున్నది

ఈయాచార కర్మకాండలు సృష్ట్యాదినుండి దేవుడు మన కేర్పరచెనని యీసనాతనధర్మవాదులు చెయువారు మన సాంఘికాభివృద్ధికి మిక్కిలి యాటంకము కలిగించుచున్నదే గాక యీ వాదన సత్యమునకు విరుద్ధమయిన సాంఘికపరిణామ శాస్త్రము వేనోళ్ళ ఘోషించుచున్నది మానవకోటిలో ఆయా జనసంఘములలో యెప్పుడెప్పుడు ఎట్టి విధానములు ప్రబలుచుండెనవో, అప్పటప్పటి కాలస్థితులననుసరించి అవి యెట్లు మారుచుండెనవో మన ప్రజాసామాన్యము తెలిసుకొనజాలమిచే కూపస్థమండూకమువలె మన పూర్వధర్మశాస్త్రములలో వ్రాసినవిధులన్నియు నిత్యములు, అనుల్లంఘనీయములుగని నమ్ముటయు, వానిని "యథాశక్తి సహాగమన"ముని నామెనే ప్రకారము ఏదియో నొక విధముగ నంధప్రాయముగ నాచరించుటయు జరుగుచున్నది ఈ శిలారూపములవంటి కట్టుబాట్లు కాలానుసారముగ కొంతవరకు సడలుచున్నను ఈ సనాతన ధర్మవాదులు వానిని తిరిగి నిలబెట్టుటకు కొన్ని భగీరథప్రయత్నములు చేయుచుండుటచే వీరిని డీకొనుట సంఘసంస్కరణవాదుల విధి వీరికి ఇతరుల సువిమర్శనలు తలకెక్కవనియు,

ఈపూర్వాచారములు, సమ్మకములు, శ్రౌతస్మార్తకర్మకాండలు, నిలువనేరవని యెంత వీరికి సహేతుకముగ బోధించినను తమ ప్రయత్నములు విఫలమనియు మావారివారికి తెలిసియున్నను, లోకసంగ్రహార్థము వీరి మాటలుపాటింపకూడదని మేము తరుచుగా ప్రజలకు నచ్చజెప్పకతప్పదు మనలో ప్రబలియున్న ఆచారము లనేకములు, మతముతో సంబంధింపజేయవలసినవి కావు వీనిలో వర్ణాశ్రమధర్మములు ముఖ్యములు ఇవిలేనిచో హైందవమతమె మెక్కలుండదని కొందరడుగవచ్చును ఇది అధ్యాత్మికతత్త్వజ్ఞానములోని యున్నది జ్ఞానభక్తికర్మయోగముల సముచ్చయమే నిజమైన హైందవమతము శ్రౌతస్మార్తకర్మకాండలు, వర్ణాశ్రమ ధర్మములు మొదలగునవి సుమారు మూడువేల సంవత్సరములక్రింద యేర్పడిన బ్రాహ్మణమతము ఈ రెండవదానిని క్రమక్రమముగ వేరుపరచి లేక తగ్గించివైచి, మొదటిదానిని జనసామాన్యములో వ్యాపింపజేసి రాజకీయసాంఘికసంస్కరణలకు మనతోడి యితర సంఘములతో పాటు పడవలెనుగాని పరలోకశిక్షలకు భయపడి యీ పిచ్చిమతాచారములచే అనవసరముగ బంధింపబడుట మనకు తగదు

నిజముగా ఈ మతాచారములె దైవశాస్త్రము లైనచో పరమకరుణామయుడును నిష్పక్షపాతియు నగు దేవుడు ఇన్ని భిన్న మతముల నేర్పరచి వానివిధుల నుల్లంఘించినవారిని, ఆ మతము ననుసరించినవారిని నరకమున బడద్రోయునా? అన్ని

జాతులకును ఒకేవిధమైన ఆచారముల నేల కల్పించలేదు? ఈ యాచారములు కాలానుసారముగ మారుచుండగా ఏల యూరకొనుచున్నాడు? అడవిజాతులకు కూడ ఈ నవనాగరికపు బుద్ధులను ఆచారములను ఏల ప్రసాదింపలేదు? ఏకకాలమందు బహుభార్యాస్వీకరణము, బహుభర్తృస్వీకరణము మొదటనుండియు అనేకజాతులలో నుండగా వానిని లేకుండ అనేకమతములు శాసించుటేల? వివాహములకు వావివరుసల విషయమై కొంచె మాలోచించుడు సమీపబంధువులలోనుండి భార్యను తెచ్చుకొనకూడదను నాచారము అనేకములగు అడవిజాతులలో ఇప్పటికి కలదు అన్యములగు తెగలలోనుండియే వరునిగాని, వధువునిగాని తెచ్చుకొనవలెను కొన్ని జాతులలో అన్నదమ్ముల బిడ్డలు, అప్పచెల్లెండ్ర బిడ్డలు ఒండొరులతో వివాహము చేసికొనకూడదుగాని మేనత్తబిడ్డలు, మేనమామబిడ్డలు వివాహములు చేసికొనవచ్చును నాగరికజాతులగు కొన్ని క్రిష్టియనులలో, మహమ్మదీయులలో అన్నదమ్ముల బిడ్డలు వివాహము చేసికొనెదరు సుమిత్రాదీవిలో మేనత్త కూతురిని వివాహము చేసికొనకూడదుగాని మేనమామ కూతురుని చేసికొనవచ్చును మళయాళదేశములోవలె స్త్రీలకుండా వారసత్వముగల జాతులలో తండ్రి తన కొడుకుయొక్క లాభమునకు తన చెల్లెలికి కాకపోయినను ఆమె కొమార్తెకైనను, తనకూతురియొక్క లాభమునకు ఆమెను తనసహోదరి కొమారునకును ఇచ్చి వివాహము చేయుచుం

డును కన్నడదేశములో కప్పిలియన్ అను జాతివారు చెల్లెలి కొమార్తెను, పినతల్లికొమార్తెను విధిగా వివాహము చేసి కొందురు జింజీకొండలలో ఇరులన్ జాతివారు తమ్ముని కూతురును వివాహము చేసికొందురు గారోలుజాతిలో పినతల్లిని చేసికొనుట ఆచారము పినతల్లిగాని పెదతల్లిగాని లేకపోతే మేనమామకొమార్తెలను చేసికొందురు ఎతంతువు లైన పెదతల్లి పినతల్లులుండగా దూరపు బంధువులను వివాహము చెసికొనుట గొప్ప తప్పుగా భావింప చును వీరు చనిపోతే వీరి కొమార్తెలను తప్పక వివాహము చేసి కొనెదరు కొన్ని జాతులలో రాజవంశమువారు తమలో పరులరక్తము కలియకూడదని తమ అక్కచెల్లెండ్రనె వివాహము చేసికొనెదరు

ప్రపంచములో నెక్కడను తల్లి కొమారుని, తండ్రి కుమార్తెను వివాహము చేసికొను నాచారము కనబడదు ఈక్వడారురాష్ట్రమందలి కొన్ని జాతులలో వితంతువులు తమ కొమాళ్ళనే యుంచుకొనుచున్నట్లును, అమెరికాసంయుక్త రాష్ట్రముల వాయవ్యమూలలనుండు అడవిజాతులలో భార్య చనిపోయినవారు తమ కొమార్తెల నుంచుకొనుచున్నట్లును కనబడుచున్నదటగాని, అట్టి సంపర్కములు హేయముగానే చూడబడుచున్నవని వ్రాయబడియున్నది సాలోమన్ద్వీప ములలో తండ్రి తన కొమార్తెలవలన పిల్లలను కని పెంచు కొనునట. ఇట్టి సంబంధములు మలయామార్షల్ద్వీపముల

యందును, పెరూ, మెడగాస్కర్, సింహళములలో కూడ కనుపడుచున్నవట ఈజిప్టులో పూర్వ రాజులు తమ చెల్లెండ్రను తప్పక వివాహము చేసికొనుచుండిరి బర్మాలోను, సయాములోను రాజులు తమ సవతిచెల్లెండ్రను వివాహము చేసికొనునాచారము కలదు 1900 వ సంవత్సరములో నుండిన సయాము రాజునకు మొదటి యిద్దరుభార్యలు ఆయన సవతిచెల్లెండ్రే. గ్వాటమాలాలో అన్నయు చెల్లెలు తమ తండ్రులు వేరైన యెడలవివాహము చేసికొనవచ్చును నేటికిని అనేక జాతులలో సహోదరునియొక్కయు, సహోదరియొక్కయు కుమార్తెలను, మేనత్తను, పినతల్లిని వివాహమును చేసికొనుట విధ్యుక్తాచారముగ నున్నది బర్మాదేశములో తల్లి, కూతురు, చెల్లెలు, పినతల్లి, అవ్వ, మనుమరాలు తప్ప తక్కిన సమీపబంధువులను వివాహము చేసికొనవచ్చును రష్యా ఆస్ట్రియా హంగెరీ స్పెయిన్ దేశములలో సహోదరులబిడ్డలు సహోదరీలబిడ్డలు ఒండొరులతో వివాహములు చేసికొనకూడదు కొన్ని యడవిజాతులలో తమ తెగలలో చేరని దూరపుజాతుల నుండియే సంబంధములు కుదుర్చుకొని మన నవనాగరికులకు మార్గదర్శకులుగ నున్నారు

ఈ విధముగానే వివాహములకు తల్లిదండ్రుల యంగీకారావశ్యకత, గాంధర్వవివాహములు, వివాహచ్ఛేదనము, బహుభార్యాత్వము, వివాహకర్మలు మొదలగువానిలో, యెన్నియో భేదము లున్నవి వీని నన్నిటిని దేవుడు సృజిం

చెనా ? వీనిని మార్చుకొనచున్న పాతిత్యమా ? వినిలో ఉత్తమమని తోచినవానిని గ్రహించుచు, తక్కినవానిని విసర్జించుచు అనావశ్యకశృంఖములను త్రెంచివైచి సంఘములు ముందుకు పోవుచుండును మనలో ముఖ్యముగా మంచి, చెడుదినములు, వారములు, వర్జ్యములు, తద్దినములు మొదలగు కర్మలు, జ్యోతిషము, సాముద్రికము, అస్పృశ్యత మొదలగు విషయములందు గలుగుచున్న మూఢవిశ్వాసము లను తొలగించవలెను కాని యీ సనాతనధర్మవాదులు విశాలదృష్టితో విమర్శించుట మాని తమ పూర్వాచార పరాయణత్వమును నిలబెట్టుటకు బుద్ధిశాలి విచారకరము

## గౌతమ ధర్మసూత్రములు



### 10 వ అధ్యాయము

ఈ సంస్కృత గ్రంథమును హరిదత్తుని మితాక్షర మను వ్యాఖ్యానముతో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు తెనిగించిరి ఈ గ్రంథము సుమారు 2500 సంవత్సరముల క్రిందట రచింపబడినది ఇది ఆకాలమునాటి సాంఘిక పరిస్థితులను తెలియచేయును సూత్రకారులలో గౌతముడు మొదటివాడై యుండవచ్చును ఈ పుస్తకమును, ఆద్యంత

ము. చదివినవారు దీనిలో నుదహరింపబడిన అనేకవిషయములు ప్రస్తుతికాలమునకు వర్తించవనియు, వానిప్రకారము నడచుకొను బ్రాహ్మణులే మిక్కిలి అరుదుగా నున్నారనియు దీనిలో వివరింపబడిన ధర్మములు గ్రంథరూపకముగ నుండ వలసినవే కాని, పునరుద్ధరింప బడుటకు వీలులేదనియు స్పష్టపడును. ఈ గ్రంథములో మొదటిప్రశ్న వర్ణాశ్రమధర్మములను బోధించును. కాలానుసారముగ వీనిలో యెట్టి మార్పులు కలిగినవో, చదువరులకు తెలియగలవు. సనాతనధర్మవాదులమని చెప్పుకొను బ్రాహ్మణులు, బ్రాహ్మణ ధర్మపథమునుండి యెంతవరకు జారిపడిరో స్పష్టపడును. సృష్ట్యాదినే, మనవర్ణాశ్రమ ధర్మములను భగవంతు డేర్పరచి యుంచినాడనియు, వానిని మార్చకూడదనియు, అవి నిత్యములనియు, వానిని నల్లంఘించిన పాపము కలుగునని పిడివాదముచేయు యీకాలపు బ్రాహ్మణుల నేత్రములను యిట్టి ధర్మశాస్త్రములు తప్పక తెరిపించగలవు.

ఈ గ్రంథములోని రెండవ మూడవ ప్రశ్నలలో దండవిధానము, రాజధర్మములు, అశౌచము, వేదాధ్యయన కాలములు, భక్ష్యాభక్ష్యములు, శ్రాద్ధములు, స్త్రీధర్మములు, ప్రాయశ్చిత్తములు, దాయవిభాగము మొదలగునవి వివరింపబడినవి. ఇవియన్నియు, యీ నవయుగములో ఆచరణయోగ్యములు కావేమో. నశించిపోయి చాలాకాలమైనది తిరిగి వీనిని నిలబెట్టుటకు ప్రయత్నించిన లాభమేమియు లేదు

కాని, యిట్టి గ్రంథములు, ఆంధ్రములో అనువదించిన యెడల ప్రస్తుత మనమతవిశ్వాసములు, కర్మకాండ, మూఢాచారములు, పామరజనులకు కూడ వెల్లడియై మన మతాచార్యులలనుదినమున్లంఘనములను ఒట్టియే, వానిని మార్చుకొనవచ్చునని స్పష్టపడుచుండును బ్రాహ్మణులు సుమారు రెండు మూడు వేల సంవత్సరముల క్రిందట లిఖించిన విషయములు నేడు రెందుకును కొరగావని స్పష్టపడుటయేగాక, మతము మీ నాధారపడక, హేతువాదసమ్మితమై, మనయాధునికులు ఆధారపడవలసియుండునని స్పష్టపడును సాంఘికవిషయములలో మతములుకూడ అనేకవిధములుగ వివిధదేశములలో పరిణామమును పొందుచున్నట్లే యీ దేశములోకూడ జరుగుచున్నవి ఇంకను జరుగగలవు వేదకాలమునాటి ఆర్యమతములోని సామాన్యమైన కర్మలను మిక్కిలి క్లిష్టపరచి, పెంచి అగ్రవర్ణమువారు బ్రాహ్మణమతముగ మార్చివేసిరి. ఏదుద్దేశ్యముతోనే యీమతోత్పత్తికి మనపూర్వులు చేసియుందురు ఇప్పుడా కట్టడమంతయు యిట్లు కూలుచున్నదియు యెట్లు శిథిలమై అనుపయోగమగుచున్నదియు, యిట్టి ఆంధ్రానువాదములవలనగాని జనసామాన్యమునకు బోధపడదు కాబట్టి మనగ్రంథకర్తగారికి మనము కృతజ్ఞులమై యుండుటయేగాక వారిక చేయూతనొసగి, ఇట్టిగ్రంథముల నింకను తెనిగించునట్లు మనము పురికొల్పవలెను లోకములో తనమత మేమో తెలియనివాడు ఒక్క హిందువుడే మాత్ర

భాషయైన సంస్కృతములో అనేకమంది ధర్మశాస్త్రజ్ఞులు వారికి యుచితమని తోచిన దెల్లను లిఖించి యుండుటచేత మన మతసాంప్రదాయములు యిట్టివనిగాని, ఇవి యాచరణ యోగ్యము లని గాని జనబాహుళ్యమునకు తెలియకపోవు టకు కారణము వీనిలో ప్రవేశము లేకపోవుటయే విమర్శన కూడ కొఱవడుచున్నది విప్రున్న చెప్పినదే వేదమని, గ్రుడ్డెద్దు చేనపడ్డట్టు మనవిద్యాధికులు కూడ అజ్ఞానులగు పురోహితులకు దాసులై తాము నోటితో ఉచ్చరించునది తమకే తెలియక లోకవంచకులు స్వవంచకులు నగుచున్నారు మహాత్మగాంధిగారు శెలవిచ్చినట్లు సత్యమే దేవుడు గనుక దానిని నిష్కపటముగను, నిష్పాక్షికముగను, సంపూర్ణ మనో న్యాయత్త్వముతో విమర్శన చేసి నిర్ధారణచేయవలయును అన్య మతములలో వలెగాక మనమతములో వేదాంతులు, జడా ద్వైతవాదులు, నిరీశ్వరవాదులు చార్వాకులు ఆరంభవాదులు ఉత్క్రాంతివాదులు మొదలగువారందరికిని ఆత్మోపలబ్ధియు మోక్షమును చేకూరగలవని కనపడుచున్నది

ఈ గ్రంథములో నుదహరింపబడిన యాచారములు, మన సనాతనధర్మవాదుల మని చెప్పుకొనువారు శిరసావ హించవలసి యుందురు- వారి నీక్రింది ప్రశ్నలు వేయు చున్నాను

1 వీరు ధర్మసూత్రములలో చెప్పిన ప్రకారము బ్రహ్మచర్యగార్హస్థ్యధర్మములను ఆచరణలో నుంచు

మిన్నారా? వీరును వీరి పిల్లలు వేదాధ్యయనము అర్థము తెలిసికొని చేయుచున్నారా? నిత్యనైమిత్తికకర్మలు అగ్న్యింధనాదులు మొదలగునవి పవిత్రశాస్త్రములు చెప్పినరీతులలో జరిగించుచున్నారా?

2. అనులోమ వివాహముల నంగీకరించెదరా? వీరు వీరి పిల్లలు క్షత్రియ, వైశ్య, శూద్రకన్యకలను వివాహములు చేసికొనుటకు ఒప్పెదరా? వారివలన కలిగిన సంతానమునకు తమ యాస్తిని సంక్రమింపజేసెదరా? వారికి పుట్టినవారిని కొన్నిదేశములందైనను బ్రాహ్మణులలో చేర్చుకొనెదరా? ఈ లోపుగా వారిని జ్ఞాతులుగా నెంచి మృతాశౌచములను పట్టెదరా?

3 వీరు నిత్యము పంచయజ్ఞములు చేయుచున్నారా? నలువది సంస్కారములను కలిగియున్నారా? వీరు షట్కర్మ నిరతులా?

4 వీరిలో జ్యోతిష్కులు సంగీతపాఠకులు నటులు, వైద్యులు, న్యాయము నమ్ముకొను లాయర్లు మొదలగు వారిని అపాంక్తేయులుగ నెంచుకొని వారి సాంగత్యమును వదలెదరా?

5. ఔరసదత్తపుత్రులుగాక తక్కిన గూఢజులు, క్షేత్రజ్ఞులు, కృత్రిమములు, అపవిద్ధులు మొదలగువారిని దాయార్హులుగ నంగీకరించెదరా?

6 కొన్ని జంతువులయొక్కయు పక్షులయొక్కయు

మాంసముక గ్రామములలోను, అతిథులకుపెట్టుట కంగీక రించరా? తాము వానిని దైవనివేదనచేసి భక్షించరా?

7 పిల్లలులేని విధవంతువు, భర్త సోదరునివలనగాని జ్ఞాతులవలనగాని సమాన్యము కనవచ్చునా?

పైని చెప్పిన ఆచారములన్నియు దరిమిలాను మారిన వని ఒప్పుకొన్నయెడల యిప్పుడేల బాల్యవివాహాచారమును మార్పకూడదు? మన మత సమాయములోనికి శారదా చట్టమువలన వచ్చుచున్నదని వీరేల గగ్గోలుపెట్టెదరు? అపూర్వమాగ్రంథమైనను యువతీవివాహములు ఒప్పుకొన్న యెడల దానినేల స్వీకరింపకూడదు? సనాతనవాదుల మని చెప్పుకొను బ్రాహ్మణులు మీటింగుచేసి చేతులెత్తి శారదా చట్టమునకు వ్యతిరేకముగ వోటువేసినంతమాత్రమున వీరి తీర్మానములకు ఎలువయేమి? వీరు ప్రజలకు నగుబాట్లకు గురి యగుచున్నారని తెలిసికొనలేకపోవుటకు చింతించుచున్నాను

## ఆంగ్లేయ మతగురువుల యుపదేశము

### 11 వ అధ్యాయము

ఇంగ్లాండు దేశములోని మతగురువులలో కొందరైనను తమ క్రైస్తుమతబోధలకు వ్యతిరేకముగా పాశ్చాత్యదేశీయు

లంగి పడచుకొనుచున్నారనియు ఒకజాతి మరియొకజాతిని తన స్వార్థముకొరకు, పడేంచి, బానిసలుగా వేయుచున్నదనియు, ప్రపంచములో పశుబలముచేత బలహీనులను, బలవంతులు దాస్యములో నుంచి స్వాధీనమందచుకొనుచున్నారనియు, త్రికరణశుద్ధిగ నమ్ముచున్నారనియో మనము భావించెదము కానుక మనము కలసి, మన దేశము పూర్ణ రాజకీయ స్వాతంత్ర్యమును బడయుటకు, గజేంద్రునివలె "నీవే తప్ప నితః పరంబెరుగ" యని స్తోత్రప్రార్థన చేయుటయే తప్పనిసరియే సాధనము మిగులలేని విరసలహా వీరి దేశచరిత్రలో, ఏనాడూమార్గము వీరి పూర్వులుగాని, వీరుగాని యిట్టివి అనుసరించి, స్వాతంత్ర్యములను బడయలేదు స్వార్థత్యాగముతో పోరుసల్పి వానిని సంపాదించుకొన్నారుగాని గుడిలో ప్రార్థనలుచేసికాదు అట్టి యీ మతగురువులు, ఒకానొకప్పుడు జరిగిననే, వీరి విధానము, మన నవగ్రహజపములవలెన కాటకములు తప్పనట్లే యుద్ధములును తప్పించలేక, అపజయము కాంచినది ఇట్టి సలహాను, ఉగ్గుపాలతో నేర్చుకొని, అస్థిగతమైన వైరాగ్యముగల మా హిందూజాతికి బోధచేయుట మిక్కిలి హాస్యాస్పదము ఇదిగాక, మా మతబోధకులు, తమజాతియు, మతమును, యెట్టి పురుగులవలె శాశ్వతముగా, యీ ప్రపంచములో జీవింపటయే ముఖ్యాదర్శముగపెట్టుకొని, మన దేశములోని

సాంఘికరాజకీయవ్యవహారములను నడపఁగలిగిరి. వీరి మత బోధఫలములను నేఁటికిని అనుభవించుచునే యున్నాము. ఇప్పుడైనను, ఇతర జాతులతో పాటు స్వాతంత్ర్యము ననుభవించవలెనని మనము ప్రయత్నము చేయుచుండగా, అట్టి మానవ ప్రయత్నములు వ్యర్థములని చెప్పి వీరు మనల నందరిని వెలికట్టవలెనవేదాంతములు కల్పించిరా? దైవభక్తిపారవశ్యతతో, మద్దెల, తాళములు, పుచ్చుకొని హరిభజనచేయుచు కూర్చుండ మనెదరా?

దైవప్రార్థనయే మన కష్టపరంపరలను తొలగించుజాలినయెడల మన మందిరము పనులు మానుకొని మన గృహములలోను, దేవాలయములలోను పూజితములలోను కూర్చుండి దేవునిమొఱలు పెట్టుకొనుచు నుండవలసినదేగాని, యేల యీ కారాగారపుబాధలు, యీ లాఠీదెబ్బలు, యీ తన్నులాటలు? అహింసాసత్యములను ప్రధానముగా చేసికొని కర్మవీరులుకండని, ఉద్బోధించుచు, తాను జయిలుకు పోవుచున్నను, దైవప్రార్థనకూడ ఒక సాధనము మాత్రమేయని మహాత్మాగాంధిగారుకూడ ఉపదేశించుచుండగా, యీ యాంగ్లేయన గురువులు మనకు కాలములో క్రొత్త సందేశములను పంపుచున్నారు. భగవంతుడనువాడొకడున్న యెడల, స్వభావసిద్ధముగ పంచభూతాత్మకమగు ప్రకృతిలోజరుగు అన్ని కలవరములవలెనే, మానవుల సాంఘికరాజకీయవ్యావహారములలో విప్లవములు జరుగుచున్నపుడు వాటి పరిణామ

మునకు, మన ప్రార్థనలమీాలమున, ఉండుండి ఆయన అస్త పడుచు, యీా సృష్టిక్రమములో తాను వ్రేలుపెట్టుచున్నాడ నుట గాని, అట్లు పెట్టుమని మనము కోరుటగాని, కేవలము అవ్యక్తము అనాలోచన యని నేను నమ్ముచున్నాను మన ప్రార్థనలనే యేల ఆయన యంగీకరించవలెను? మన విరోధులు కూడ నట్లె ఆయనను ప్రార్థించుచుండిన ఉభయులను జయము చేకూర్చగలడా? లేక ప్రతి విషయములో న్యాయపక్షమునకు పూనుకొని తీర్పు చెప్పుచుండునా?

ఇట్టి విచిత్రనమ్మకములతో యీా మేధావంతులు గుర్తించిరి, వివేకమును నడగొట్టుచున్నవి లోకములో, మన ప్రార్థనల వలన యేమియు జరగలేదని తెలిసియుండియు, యీ బలహీ నమ్మట వీరి తెలివితక్కువ యగునా? లేక ఆ దేశీయు లను వంచించుటకా? వీరు ప్రపంచమెరుగని వారా? లేక పసివంటి వారలైన పామరులైన మొరటజనులయ్యు, యీా మహాత్మాగాంధిగారు తాము సత్యవదని, ప్రజాక్షేమమునకు, నీతిమార్గమునకును ఉపకరించునని త్రికరణశుద్ధిగా నమ్మినను, వీరు హేతుపూర్వకముగ ప్రత్యక్షప్రమాణముమీాద నాధార పడక పరోక్షజ్ఞానము ఊహాప్రపంచములమీాద నాధారపడి, స్వప్నములతో కాలము వృధ పుచ్చుచుండియు, పిచ్చివారనియు, మనోకల్పితములైన యోచనలు చేయువారనియు మనము నమ్మవలెను సర్వవ్యాపియు సర్వసాక్షియగు నీశ్వరుడుండిన యెడల, ఆయన కేమియు తెలియనట్లు మన మనవులు . వివే

వనలేల? ఆయన పరమదయాళువుగ, సర్వశక్తుడుగ, న్యాయ
కర్తయునైనయెడల, మన విన్నపములు, జాలిపలుకులు, యిచ్ఛ
కములు, ప్రార్థనల, పొగడ్తలు, దూషణలను నిర్లక్ష్యముచేసి,
ప్రపంచములో దుర్మార్గములనన్నిటిని నడవనీకూడదా?
ఇంతయేల? తన యిచ్ఛామాత్రముననే, సమస్త చరాచర
ములను సంతోషపెట్టజాలడా? ఇంతేగాక యెమవుచున్న యీ
మతగురువులు యింతవరకు చెడ్రోవనే యుండుటకు కారణము,
వీరి మతవిశ్వాసమే యిది వీరిని అంధులుగ చేయుచుండవలెను
లేదా, వీరు కపటులుగానైనను యుండవలెను.

ప్రకృతిలో యెట్లు క్రమక్రమమైన, మార్పులును, ఒకా
నొకప్పుడు భూకంపములు, ప్రళయములు, క్షామములు, సాం
క్రామిక వ్యాధులు మొదలగు విప్లవములును సంభవించునట్లు,
మానవసంఘములలోకూడ, రాజకీయసాంఘికార్థికవిషయము
లలో, అట్టిమార్పులు యిచ్ఛాపూర్వకముగగాని, ఆయాకాలపు
పరిస్థితులనుబట్టిగాని లనేక మార్గములుగ సంఘములో
చొప్పించబడుచుండును ఇవియన్నియు, కొన్ని పరిణామశాస్త్ర
సూత్రములమీదనె యాధారపడుచుండును కావున యిప్పుడు
మన దేశములో జరుగుచున్న సౌమ్యయుద్ధమునకు కూడ
ఆలోచించుకొన్నయెడల, కారణములు తెలియకపోవు దీని
వలన యెట్టిఫలము చేకూడునో తుదకుకాని తెలియకపో
వచ్చును అపజయము కలుగునేమో యని నిస్పృహచెంది
యిరుకక్షులవారను ముక్కుమూసికొని కూర్చుండి, దీనిని

# ఈశ్వర భావ పరిణామము



## 12 వ అధ్యాయము

## I

మానవుడు, తన క్రింది జీవరాసులవలెనే, క్రమక్రమముగా పరిణామ విధాన మూలమున ఉత్పన్నుడై, మనోవికాసము కొంతవరకు వృద్ధికాగానే తన చుట్టునున్న ప్రకృతి-చిత్రమ్ములను గాంచి వెఱగొందుచు భయపడుచు ప్రస్తుతకాలములో అక్కడక్కడ నిలచియున్న అడవిజాతుల మతవిశ్వాసములను బట్టి, వేల శతాబ్దములక్రిందట మన పూర్వులు కూడ అట్టి వానినే కలిగియుండిరని మనము నమ్మవచ్చును. ఈ యడవి జాతులకు, దేవతలను గురించి యెట్టి యభిప్రాయము లున్నవి తెలిసికొనుటకు ముందు, మృతులైన వారిని గురించి వీరూహించుకొనుచుండెనది మనము గ్రహించవలెను. ఏలయన దయ్యములు, భూతములు, పిశాచములనుండియే దేవుళ్ళ విషయమై కొన్ని భావములు ఏర్పడినవి. ప్రతిదేవత, ఒక చనిపోయిన మనిషియొక్క దయ్యమని ప్రథమమున భావించుట తటస్థించకపోయినను, ఆదిని కొన్ని దేవతలైనను, మృతినొందిన పూర్వులేయని కొందరు నమ్మజొచ్చిరి. అటు తరువాత క్రొత్త దేవుళ్ళను, ప్రకృతిలో జరుగు అద్భుత చర్యలనుబట్టి మానవుడు సృజించుకొనియుండ వచ్చును. మన ఋగ్వేదము

యీ దిశలోనే యుద్భవమై యుండవచ్చును. అనేక జాతులు తమ పూర్వులలో ప్రముఖులను, తమ రాజులను, దైవసమానులుగ నెంచి పూజించియుండవచ్చును కాని మొట్టమొదట, మృతుడైనవాడు, నయ్యమై యీ ప్రపంచములోనె మరియొక రూపమును నుండుననియు, గనుక తమ పూర్వులను తాము పూజించుచుండవలెననియు, యభిప్రాయములను కలిగియుండురు ఈ నయ్యములు, పితృపూజలు, యీ లోకములోని సమస్త మతములకు పునాదులు వీనికి క్రమక్రమముగా, అనశ్రుతము, కథల నల్లినకొలది మత గ్రంథము లేర్పడి, జీవించి యుండిన స్త్రీ పురుషులకు కూడ దేవత్వము నారోపించ మొదలిడిరి

ప్రత్యేక దేవతలు కలరను జ్ఞానోదయించక మునుపు మృతులైన బంధువుల విషయమై జను లాలోచించుకొనుటకు మొదలుపెట్టి యుందురు మొదట, మానవుడు నిజముగా మృతుడయ్యెనని కూడ వారు తలచి యుండరు మృత్యువు తప్పదని అనేకవేల సంవత్సరముల యనుభవమును బట్టి మనకు స్పష్టమైనను, మొదట మానవుల కీ సూత్రమెట్లు తెలియగలదు? మృతులైనవారు యింకను జీవించియే యున్నారనియు, వారి ప్రాణములు మృతకళేబరమును కనిపెట్టుకొని యెల్లప్పుడు నుండుననియు నమ్మియుందురు స్వప్నములలో వారిని కనుగొనుట, మూర్ఛ, అపస్మారము, పారవశ్యము, మతివిభ్రమము మొదలగు నవస్థలలో, మృతినొంది

నిద్రించి తిరిగి లేచుట మూలమున మానవుని శ్వాసము ఎక్కడికో పోయి తిరిగి వచ్చుచుండునని వారనుకొనుచుందురు. మృతులైనవారును, బ్రతికియున్న వారును, తమ స్వప్నములలో కనబడుచుండుటచేతను, నిద్రలో తమరు ఎక్కడెక్కడికో పోయి, అనేక కార్యములనుచేసి తామెప్పటియట్లె నిద్రనుండి మేల్కాంచుటచేతను, మృతకళేబరములో సహితము జీవమున్నదని వారు స్థిరపరచుకొనుటలో ఆశ్చర్యమేమి? దెబ్బలుతగిలిగాని, జాడ్యమువలనగాని, స్పృహదప్పి మూర్ఛలో పడియున్నపుడు ఆ మనిషిని తిరిగి రావలసినదని ప్రార్థించుట కొన్ని యడవిజాతులలో యిప్పటికిని కనుపడుచున్నది. ఆమనిషికి తిరిగి స్పృహరాగానే తమ ప్రార్థనలవలననే, ఆతడు వచ్చెనని విశ్వసించెదరు. ఒకవేళ పోయినప్రాణము రాని యెడల ఆ మనిషి తిరిగి వచ్చుటకు యిష్టపడలేదు గాన తమతమ ప్రార్థనలు లాభించలేదని వారి తలంపు. ఇట్టి విశ్వాసమునబట్టియే ఆ చనిపోయినవాని శరీరమును ఖనన దహనములు చేయక జాగ్రతపెట్టెదరు. మొదట ఆ శవమును వాని గుడిసెలోనే యుంచి దానిని యెండబెట్టి యుంచుకొనెదరు. న్యూగినీ యను ద్వీపములో నేటికిని కొందరు స్త్రీలు తమ పెనిమిటుల కళేబరములను జాగ్రతపరచుకొని, వానిని ముద్దుపెట్టుకొనుచు, వానికి ప్రతిదినము ఆహారపానీయముల నిచ్చుచుందురు. కొన్నిచోట్ల ఆ మృతకళేబరములను తమ సమీపములో నుంచుకొనుట కిష్టపడక, బయట ఒక చెట్టుమీద

గాని, యెత్తైన ఒక మంచెమీదగాని నిలుపచేయుదురు. ఇట్లు ఆస్ట్రేలియా అండమాను దీవులలో నేటికిని జరుగు చున్నది చనిపోయినమనిషి యిక రాడని నిశ్చయించు కొన్నప్పుడు ఉష్ణదేశములలో శీఘ్రముగ మృతకళేబరము కుళ్ళి కంపెత్తుగ గాన, దానిపై చర్మమును తీసివేసి, అస్థి పంజరమును మాత్రము దాచుకొనెదరు ఇ ా యీజిప్టు పెరూ దేశములలో మొన్నమొన్నటివరక ండెను ఒకానొకప్పుడు, దాని తలపుగాని, చేతినిగాని, మరియొక అవయవమును గాని తాము ధరించుకొనెదరు అండమాను దీవులలో వితంతువులు తమ భర్తల పుర్రెలను, ఎ ఎ మెడ లలో వ్రేలాడు గట్టుకొందురు వారి సూక్ష్మ శరీరములు, తమయొద్దనే యున్నవని వారు నమ్ముచున్నారు తక్కిన భాగ మును, పాతివేసినను, తగులబెట్టినను, యీ పుర్రెలను తమతో నుంచుకొన్న యెడల అవి తమకు భవిష్యత్తు చెప్పగలవని వారి నమ్మకము అన్న పానీయముల నిచ్చి వీనిని పూజించు చుందురు ఇవి జీవించి యున్నవనియు తామిచ్చినవి స్వీక రించుచునే యుండుననియు, వీరి నిశ్చితాభిప్రాయము నర మాంస భక్షకులు, ఆ కళేబరములలోని మాంసము, క్రొవ్వు, మెదడు తినివేసి, యెముకలను గాని, వానిమీద తోలు కప్పి గాని జాగ్రతగ దాచుకొనెదరు కొన్ని అడవి జాతులలో మృతకళేబరములో కొంత భాగమును మాత్రము సమీప బంధువులు మహాప్రసాదముగ ఆరగించెదరు ఈ

మొదటి దశ మారి రెండవ దశకు వచ్చినపుడు, తాము తినగా మిగిలిన కళేబరమును, పాతివేయుట ప్రారంభించిరి పర్వత గుహాలలో నుండు వెడ్డాలు మొదలగు హిందూదేశము లోని యడవిజాతులు, మృతకళేబరములను ఆ గుహాలలో వదలివేసి, తాము మరియొక గుహను చూచుకొందురు దక్షిణ అమెరికాలో సాధారణముగా యిదియే యాచారము పెరూదేశములోను యీజిప్టు దేశములోను నాగరికత వృద్ధియైన కొలది యీ మృత కళేబరములను బాగుగా కడిగి శుభ్రపరచి, యెండిన పీనుగులవలె చేసి వానిని నూనె మొదలగువానిలో నింపి అనేక వందల సంవత్సరముల వరకు నిలువ చేయుదురు గుహలు లేనిచోట గుహాలను నిర్మించిరి ఇట్టివి యిటలీ, యేషియా మైనరు మొదలగు ప్రదేశములలో ననేకములున్నవి

మొదటిదశలో, చనిపోయిన వానిమీద దయయు గౌరవమును కలిగి వానిమృతకళేబరమును యింటిలోనే యుంచుకొని దానికి భోజన పనీయములు నిచ్చి దాని పుత్త్రుని ప్రియమిత్రునివలె తమతో యెల్లపుడు నుంచుకొనే వారు రెండవ దశలో, మృతకళేబరము తిరిగి లేచి వచ్చునేమో యను భయముచేత దానిని ప్రత్యేక స్థానములో నుంచి అధియెక్కడకు కదలకుండ దానిని పాతివేయుటకు మొదలిడిరి ఇవియే శరీర పునరుద్ధారణమత సూత్రము నకు (Resurrection of the lead) మూలకారణము శరీరము తిరిగిరాకుండ చేసినను దాని

లోని యూపిరి దయ్యమై పీడించ వచ్చునని యూహించుట మూడవ కళ ఇట్లు శరీర పునరుద్ధారణమునకును ఆత్మవినాశ రాహిత్యమునకును (Immortality of the Soul) గల భావ పరిణామమును మనము ముందుగా గ్రహించవలెను మొదటిది శరీర ఖననముతోను రెండవది శరీర దహనము తోను సంభవించినది పూర్వమానవుల చరిత్రలను పరిశోధిం చిన యెడల మొదట భయముచేత శరీర దహనము ఆచార ములో నుండి క్రమక్రమముగా పాశ్చాత్య దేశములలో శరీర ఖననము ధైర్యముతో అవలంబించబడినట్లు కనిపించుచున్నది శరీర పునరుద్ధారణను నమ్ముట చేనే వారి యేసుక్రీస్తు చంపబడినను తిరిగి లేచి వచ్చినట్లు బైబిలు గ్రంథములో వ్రాయబడినది కాని ప్లేటో కాలము నుండియు వీరు ఆత్మవినాశ రాహిత్యమును కూడ నమ్ముచుండిరి

## II

ఇప్పుడు మృతకళేబరములను దహనముచేయుచున్నా రము, ఒకప్పుడు దానిని ఖననము చేయుచుండినట్లు దృష్టాం తములు కలవు యిట్రూరి, లాటియన్ మొదలగు పాశ్చాత్య దేశములలో యిప్పుడున్న దిబ్బలనుబట్టి యీవిషయము కన గొనవచ్చును ఋగ్వేదములో ఖననముకూడ చెప్పబడియు న్నది క్రీస్తుపుట్టకపూర్వము 1400 సంవత్సరముల నాటికే, ఖననమే ప్రాధాన్యముగ నున్నట్లు రాజేంద్రమిత్రగారు

వ్రాసియున్నారు. అటుతరువాతనే, శవములను దహనముచేసి బూడిదను నదులలో కలుపుట ఆచారమైనది. ఈఖననాచారమునకు కారణము చనిపోయినవారు లేచివచ్చి జీవించియున్నవారిని బాధింతురను భయమే. ఈ భయము వలననే, పాతిబడినశవము మీద, పెద్దమంటికుప్ప వేసి, దాని మీద పెద్దపెద్ద రాళ్ళను కప్పుచుండిరి. అమెరికాదేశములో, మన వీరశైవులవలెనే, చనిపోయినవారి కాళ్ళుచేతులు కట్టివేయు జాతులున్నవి.

చనిపోయిన మనిషి యేదియో నొకవిధమైన గాలిరూపముగా జీవించియుండునను నభిప్రాయము అనాగరికపు అడవి మనుష్యులలోనే మొదట కలిగి, ఆ యభిప్రాయమే క్రమక్రమముగా ఆత్మానాత్మవిచారణలోనికి దిగినది. కొందరడవి జాతులు, మృతకళేబరమును పాతివేసిన చోట, తిండిపదార్థములు, వారు ధరించుచుండిన వస్తువులు ఆయుధములు, వారుపయోగించిన గిన్నెలు క్రొత్తగృహమునకు వెళ్ళునపుడు కావలసిన సామానులన్నియు పంపెదరు. వారితోకూడ వారిభార్యలను, దాసీజనమును పంపుచుండిరి. వారిని, మొదట వారి స్వంతగుడిసెలలోన, తరువాత వారిపూర్వులను పాతినచోట్లను, పాతివేయుచుండిరి. వారు తిరిగివత్తురేమో యను భయముచేత, తుదకు దహనముకూడ ప్రారంభించబడినను, వారిలోనిగాలి, లేక దయ్యము యెల్లపుడు తిరుగుచుండునని నమ్మకము విడువలేదు. ఈ యభిప్రాయ

...బట్టియే, ఆత్మవస్తువును గురించి విచారణబయలుదేరినది కొంతకాలమైన తరువాత యీ చనిపోయిన ... కి వేరుగా ఒక ప్రపంచము సృష్టింపబడినట్లును (Purgatory) ప్రళయకాలమందు (Doomsday-Day of Judgment) మంచివారు స్వర్గములోను, చెడ్డవారు నరకములోను శాశ్వతముగా నుందురని యూహించ మొదలుపెట్టిరి హైందవబౌద్ధమతములలో, అట్లు స్వర్గసౌఖ్యము, నరకబాధలను కొంతకాలము అనుభవించిన తరువాత తిరిగి వారికి పునర్జన్మలు కలుగుచుండునని ఒకసిద్ధాంతమున్నది

కాబట్టి మొట్టమొదట శవములను పూజించుచున్నపుడు, దేవతలనువారు ప్రత్యేకముగా లేరు ... చనిపోయినవారి తలలను మాత్రము ఖండించి, వానిని పూజించుచుండిరి కళేబరమును పాతివేసిన చోట తెలిసియుండుటకు ఒక కొయ్యనుగాని, రాతినిగాని పాతుటయు చేసి అక్కడ ఒకగుడిసెను వేయుటయు, ఆచారమై క్రమేణా ... రాయి దేవుళ్ళుగాను, ఆ గుడిసె దేవాలయముగాను మారి ... కొందరడవిజాతులలో శవముల వ్రేళ్ళనుగాని, కేశములను గాని, మరియేయితర అవయవములను గాని ఖండించి దాచుకొనుటయు కలదు ఈకాలములోకూడ అనేకయడవిజాతులలో, శవముల వివిధశరీరభాగములను దాచుకొని పూజించుట ఆచారమైయున్నది బుద్ధుని గోళ్ళు, వెంట్రుకలు, ఎముకలు, దంతములు మొదలగునవి దాచబడిన పెట్టెలు దొరకుచున్నవి

చనిపోయినవారి కళేబరములను పూజించుట యిప్పటి మన పితృపూజకు మూలాధారము ఈ పితృదేవారాధనము ప్రపంచములోనున్న అన్ని నాగరిక జాతులలోను కనపడుచున్నది

చనిపోయినవానిలో రాజ్యాధిపతికి యెక్కువగౌరవము నొసంగి, వానిని గొప్పదేవునిగ యెంచుట స్వభావము ఈ యన్న ప్రకృతియుండగానే, దేవునియంశ వీరికున్నదను భావము తరువాత కలిగెను ఈ పరిణామావస్థలో దేవుళ్ళసంఖ్యకు మితిలేకపోయెను భూమి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, గాలి, వర్షము, మొదలగు ప్రకృతిలో నున్న శక్తులన్నియు గొప్పదేవతలుగా భావించుట సహజమైనది ఇవియన్నియు, మొదట మనుష్యులే యనియు, తరువాత దేవతలైరనియు తలచడము కలదు కాని యీ ప్రకృతిస్వరూపములు కొన్ని కట్టుబాట్లలో నున్నట్లు కనపడగానె, ఒక ఆదిదేవుడు యాజమానిగా నుండి వీనిని నడపించుచున్నట్లు తలపవచ్చిరి

మన దేవాలయ కట్టడములన్నియు, పూర్వమొకానొకప్పుడు, మనపూర్వుల సమాధులనుండియే పరిణామము నొందినవి మొదట మృతకళేబరములను కొండగుహలలో నుంచుచూ, అట్టిగుహాలను లేనిచోట్ల కట్టడములను నిర్మించిరి ఈ గుహాలలో బలులు, ఉపాహారములు, నైవేద్యములు జరుగుచుండెను ఎల్లోరా గుహాలిట్టివే కొన్నిచోట్ల చనిపోయినవాని గుడిసెయే దేవాలయముగ మారినది న్యూగినీద్వీపములో, చనిపోయినవానిని గుడిసెమధ్య పాతివేసి, ఆ పాతిన

చోటుమీద, చూడవచ్చిన పెద్దమనుష్యులను కూర్చుండబెట్టి, వానిబంధువులందరు, యేడ్వమొదల పెట్టెదరు పానీయములు, పండ్లు మొదలగు అనుబండారములు అక్కడకు తెచ్చి నైవేద్యము సమర్పించెదరు. ఇట్లు క్రమక్రమముగా. యీ గుడిసెయే, దేవాలయముగా మారి యుండెను. కొన్ని అడవి జాతులలో చనిపోయినవారు, తనశవమును యెక్కడ గడచెనో, అక్కడ అతని పేరుమీద ఒకరాయి పాతెదరు.

ఇట్టి స్వల్పదేవాలయములే క్రమముగా యీ మొదలగు దేశములలో, పెద్దగా కట్టబడి, వివిధాలంకారములతో నలంకరింపబడి, ప్రతిదేవునకు నొకదేవాలయ మేర్పడజొచ్చెను. ఈ దేవాలయము మొదట [illegible] మనుష్యుల పూజించుటకేర్పడినదని గ్రహించక, తరతరములు జరిగినకొలది ఆ మానవులే, దేవుళ్లని విశ్వసించుటలో ఆశ్చర్యమేమున్నది? అట్టి మానవులు, వారికాలములలో రాజ్యపరిపాలకులైన యెడల వారు తప్పక దైవస్వరూపులేయని ప్రజలు నమ్మెదరు. మన రామకృష్ణాద్యవతారములట్టివే. మన ప్రస్తుత దేవాలయములలోనివిగ్రహములన్నియు యిట్టి పరిణామజన్యములే. మొదట చనిపోయినవారి కళేబరములనే జాగ్రత్తపరచి, వానిని పూజించమొదలిడిరి. ఈజిప్టు పెరూదేశములలో వీనిని “మమ్మీ”లని వాడెదరు. ఈ మమ్మీలను మొదట వస్త్రములతో కప్పుట, తరువాత కొయ్యలతో కప్పి, వానిమీద చనిపోయినవాని విగ్రహములను

చిత్రించుట జరుగుచుండెను. వాని అవయవములు శిథిలము కాగానె నూతనావయవములు, నేత్రములు మొదలగునవి చేసి తగిలించుచుండిరి. ఈవిధమే ఆచారముగా అన్ని దేశములలో రాతితోగాని, కొయ్యతోగాని చనిపోయినవాని విగ్రహమును చేసి నిలబెట్టి, వానికి గొప్ప దేవాలయమును కట్టుచుండిరి.

ప్రపంచములో నన్ని చోట్లను, చరిత్రాత్మకములగు నన్ని కాలములలోను ప్రజలు, రాళ్ళను, కొయ్యలను చెట్లను దేవుళ్ళుగా భావించి పూజించుచుండెడు వారు. మొదట మానవకళేబరములను దహనము చేసిన చోట పాతుచుండిరి. ఇక్కడనే, పూజ, అర్చన, నైవేద్యములు చనిపోయినవారి కర్పించుచుండిరి. మనుష్యులను, జంతువులను బలియిచ్చుట, వారి రక్తమును, ఆ రాళ్ళు మొదలగువానికి పూయుట ఆచారముగా నుండెడిది. తరువాత, యీ రాళ్ళు మొదలగు వానిని యితర చోట్లకు తీసికొనిపోయి పాతుచుండుటయు, వానికి గృహములు కట్టించుటయు పరిపాటియైనది. ఈజిప్టులోని పిరమిడ్లు, భారతదేశములోని దేవాలయములు, యూరపుఖండములో వారి గుళ్ళు, మహమ్మదీయరాష్ట్రములలో మసీదులు, బౌద్ధుల యారామములు, యివి వెలసినవే ఇప్పటికి గూడ, వీరందరిలో విగ్రహారాధన కొద్దిగనో గొప్పగనో యుంటూనేయున్నది. క్రమక్రమముగా ప్రేతమే, దయ్యమై దయ్యమే పితరుడై, తుదకు అతనే దేవుడై యుండి, అడవిజాతుల నుండి నాగరికజాతులవరకు పరిణమించెను. ఈ దేవుళ్ళనే, ప్రతి

మలరూపమున ఆరాధించుచుండిరి. ఈరాళ్లు, రప్పలకే, ప్రాణ ప్రతిష్ఠచేసి, ఆగమశాస్త్రములను కల్పనజేసి, వానిని యిప్పటి హిందువులు పూజించుటాచారమైనది. నిలబెట్టిన రాతి లింగము, వానిగొట్టములుగ భావించి ప్రకృతిలోనిఉత్పాదక శక్తిని పూజించుట కొన్ని జాతులలో, వాడుకలోనికి వచ్చినది. మనలో శివపూజయిదియే యనిరి (Phallic worship)

రాళ్ళు మనుష్యులుగాను, మనుష్యులు రాళ్ళుగాను ప్రతిదేశపురాణములలోను మారినట్లు వర్ణింపబడెను. ప్రతి రాతిదేవునికి పురాణకథ నొకటి కల్పించి, స్థలమహాత్మ్యము లను వ్రాసిరి. దానిని గురించి, పెద్దగాథలు, పురాణము లు అంతటా యున్నవి. నానావిధమైన ఆకారములు, అలం కారములు, దినాలు ఆయాదేశాచారసాంప్రదాయములు బట్టి, యీ రాళ్ళకును, చెట్లపుట్టలకును, కొయ్యగోణత ములకు కల్పించెదరు. కొన్ని కొన్ని దేశములలో, కొన్ని కొన్ని చెట్లను పవిత్రములుగా యెంచి పూజించెదరు. స్మశా నములయొద్ద పాతిబడిన చెట్లు పెద్దవైనకొలది చనిపోయిన వారి ఆత్మలు వికాసము నొందుచున్నవని కొన్ని అడవిజాతు లిప్పటికిని నమ్ముచున్నారు. అశ్వత్థవృక్షము, తులసిమొక్క కంచెయాకు, మారేడు, వేపరావిమొక్క మొదలగునవి అతి పవిత్రములని యిప్పటికిని మనవారు భావించెదరు. కొన్నివన ములు, సరస్సులు, నదులు, కొండలు, బావులు, మొదలగునవి అత్యంతపావనములుగ యెంచి వానిసమీపమున దేవాలయ

డుడువాడు, ప్రత్యేకప్రత్యేకముగ చరాచర సృష్టినంతయు భిన్నభిన్న సమయములలో చేసెననియు, మనుష్యునికి మాత్రము మనస్సు, బుద్ధి, ఆత్మ యనునవి యేర్పాటు చేసె ననియు కొన్నిమతములు ప్రతిపాదించును ప్రకృతిశాస్త్ర ములు పరిశోధనలవలన, యీ భిన్నసృష్టి అసత్యమని స్పష్ట మొనది మత మత కర్తలు, పురాణగ్రంథకర్తల యభిప్రాయ ములు భౌతికశాస్త్రజ్ఞ నముతో సమన్వయముచేయుట, కేవ లము అసాధ్యము—వీనిలో యేదియో ఒకటి సత్యమై యుండవలెను

ఈ అఖిలాండకోటి బ్రహ్మాండములన్నియు యేకపదార్థ జన్యమని సృష్టివిషయకశాస్త్రమువలనను (Cosmology) ఒక చిన్నగ్రహమగు మనభూమియొక్క పుట్టుకయు, దానిలో జడపదార్థవికాసమును, భూగర్భశాస్త్రమువలనను (Geology), జీవపదార్థవికాసము జీవశాస్త్రమువలనను (Biology), మానవుని యుత్పత్తి, వానిశరీరజ్ఞానవృద్ధులు మనుష్యవర్తన శాస్త్రమువలనను (Anthropology), మన కన్నులకు కాన రాని ఆత్మ యను వస్తువు మానసికశాస్త్రమువలనను (Psychology) మనకు తెలియబడుచున్నవి సృష్టివిష యికశాస్త్రమునుబట్టి, భగవంతుడను వాడొకడుండినను ఆయన ఒకేసారి ప్రకృతి నిబంధనలు నేర్పరచి తాను బ్రహ్మ గారి ద్వారాగాని, మరి యే యితరుల ద్వారాగాని, యీ సృష్టిక్రమములో, తాను మధ్యమధ్య తన వ్రేలుపెట్టి నడిపిం

[illegible] కోట్లసూర్యులు, చంద్రులు, నక్షత్ర ములు, గ్రహములు అనాదనము పుట్టుచు గిట్టుచుండుట మొద లగు ప్రకృతిసిద్ధాంతములను గ్రహించవలెనన్న కొద్దిగనో గొప్పగనో పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics), భూగర్భ శాస్త్రము (Geology), ఖగోళశాస్త్రము (Astronomy), తెలిసికొనవలెను ఈ భూమియను ఒక చిన్నగ్రహముమీది పర్వతములు, సముద్రములు, దీవులు, యెల్లు యేర్పడి, యెట్లు మారుచున్నవో యనము గ్రహించినపుడు, కులపర్వత ములు, సప్తసముద్రములు, సప్తద్వీపములు మొదలగు వానిని గురించిన మన పురాణవర్ణనము అసత్యమని మనము విసర్జించి తీరుదుము

ఈ భూమిమీద చెట్లు, జీవరాసులు మొదలు పుట్టి ప్రస్తుత పరిణామమును పొందుటకే యిరువదికోట్ల సంవత్స రములైనను పట్టియుండునని భూమియొక్క పొరలను లెక్కించి, ధాతిక శాస్త్రజ్ఞులభిప్రాయ పడుచున్నారు ఇక జీవరాసుల క్రమోత్పత్తిని గురించి తెలియచేయు శాస్త్రములు వృక్ష శాస్త్రము (Botany) పిండోత్పత్తిశాస్త్రము (Embryo- ology) కొంతవరకైనను చదివినయెడల, ఒక విత్తునుండియు ఒక గ్రుడ్డునుండియు, నానావిధములైన పెద్ద వృక్షములు గొప్ప జంతువులు క్రమముగా వానిలో ఒక జాతినుండి మ, యొక జాతి యెట్లుద్భవమైనది మనము గ్రహించగలము,

ఈ సత్తులు, గ్రుడ్లు కూడ, కొన్ని ఉపాంగవుల కూడిక వలననే, విడిపోవు పిండములవలనను కలుగుచున్నవని యిట్టి పరిశోధనలవలన తెలియుచున్నది మానవుని దేహము కూడ పై భౌతికసూత్రముల ననుసరించి గ్రుడ్డునుండి పెరుగుననియు, తక్కిన పాలిచ్చు చతుష్పాద జంతువుల వలెనే, క్రమవికాసము, మానవశరీరములో యేర్పడుననియు స్పష్టమైనది ఇది గాక, భేదరూపములుగా కనపడు జీవరాసులకు వంశావరోహణము, స్వభావసిద్ధముగ మేలైనదానిని యేరుకొనుట యను సూత్రములు (Theory of Descent of Man and Theory of Natural Selection) వర్తించునని డార్విన్ మొదలగు మేధావంతులు, తమ జీవిత మంతయు యీవిమర్శనలో గడపి, మనకు ప్రత్యక్ష ప్రమాణములతో కనపరచుచున్నారు ఈ జీవనాధార పదార్థము (Protoplasm) ప్రకృతిలోనున్న జడపదార్థ సంయోగము వలననే యేర్పడి యుండుననిగాని, బ్రహ్మగారు, ఆత్మ యను నొక వస్తువును మన కళేబరములో, పుట్టుకతో ఊదుచున్నాడను విషయము నిరాధారము ఇది సూక్ష్మపరిశోధనల వలన మున్ముందు తెలియ గలదు.

పై పరిణామ వాదమున అంగీకరించిన కొందరు భౌతిక శాస్త్రజ్ఞులు కూడ, మన పూర్వులు తోకలేని కోతులజాతి వారే యని (Anthropoid apes) ఒప్పుకొనుటకు సందేహించుచున్నారు. ఒకవేళ, మనుష్యులు అట్లు జనించినను

వీరికి ప్రత్యేకముగ ఒక యాత్మను క్రొత్తగా సృజించి గాని, తానే ఆ యాత్మయై గాని, బ్రహ్మగారు యేర్పరచి యుండ వచ్చునని నమ్మెదరు ఇట్టివారిలో సర్ ఆలివరులాడ్జిగారు ఒకరు. వీరి యభిప్రాయములకెట్టియాధారములేదు వెన్నెము కలుగల జంతువులలో మనుష్యునకు మిక్కిలి సమీపముగ నున్నవి తోకలేని కోతులు వీనిలో, ఆఫ్రికాఖండమందు చింపాంజి, గోరిల్లాయును, ఆసియాఖండములో గిబ్బన్ ఒరాంగొటాంగులును, నేటికిని కనబడుచున్నవి వీనికిని, మన అడవి మనుష్యులకును యెట్టిభేదములేదు కొన్ని రెండుకాళ్ళ మీదనే నడచునట్టివిక్కడ యీమధ్య జవాద్వీపములో కను పడినవి (Pithecanthropus erectus) తారతమ్య శారీ రక శాస్త్రములును (Comparative anatomy and physiology) చేపలు నీళ్ళలోను భూమిమీద నడిచే జంతువులు, సరీసృపములు, పక్షులు, చతుష్పాదులు, స్తనజాతి జంతువులు క్రమ క్రమముగా ఒక జాతినుండి మరియొక జాతి యుద్భ వించినవి

స్తనజాతి జంతువులు (పిల్లలకు పాలిచ్చునవి) ప్రపంచ ములో నుద్భవించక పూర్వము వానిక్రింది జంతువుల సృష్టి కాలము రెండుకోట్ల సంవత్సరములై ఉండవచ్చును ఈ స్తనజంతువులన్నిటికిని వెన్నెముకలు, మాంసగ్రంధులు, స్తన ములు, క్రిందిపెదవులు, చెవిగ్గెర, పుర్రెలోనుగల యెముకలు మోకాలిచిప్పలు, రొమ్ముయొక్క విభాజకము మొద

లగునవి ఒకే విధముగ నున్నవి వీనిలో, మానవుల యొక్క-
యు, తోకలేని కోతుల యొక్కయు అస్థిపంజరములను పరి
శీలించినచో, యీ రెండు జాతులకు, రెండునండలు ఒకే
మాదిరి యెముకలు, ఒకేమాదిరి వెండ్రుకలు, ఒకేమాదిరి
స్తనములు, నాలుగు గదులుగల ఒకేమాదిరి గుండెకాయ,
ఒకేమాదిరి మెదడు, ఒకేమాదిరి మూడువందల కండరములు,
ఒకేమాదిరి ముప్పదిరెండు పళ్లు, యిట్లు అన్ని విషయములలో
యీరెండు శరీరములు ఒకేవిధముగ నున్నవి ఈ వివిధభాగ
ములలో, పరిమాణములో భేదముండవచ్చును గాని, స్వభా
వములో భేదమేమియు లేదు ఇట్టి భేదములు, ప్రస్తుత నవనా
గరిక మానవులలోకూడ కనపడుచున్నవి చేతులు, కాళ్ళు,
పాదము, కన్నులు, తలవెండ్రుకలు మొదలగు వానిలో
యెన్నియో వ్యత్యాసములు కనపడుచున్నవి తోకలేని కోతికి
మనుష్యుని రక్తము యెక్కించిన యెడల, దాని కేట్టి అపాయము
లేదు కాని, దానికి తోకగల కోతి రక్తమును యెక్కించిన
యెడల అది విషమై దానిని చంపివేయును కావున మనకును,
తోకలేని కోతులకున్న పోలికకంటె, వీనికిని తక్కిన తోకలు
గల కోతిజాతులకుగల వ్యత్యాసము అనేక యిడుంగులు
కలదు గనుక తోకలేని కోతియు, మానవుడును రక్తసంబంధ
మైన అతి సమీపబంధువులు

ఇక ఆత్మానాత్మ విచారణకు వత్తము మన మనో
వృత్తులను గురించి తెలుపుడుచేయు శాస్త్రము మానసిక

శాస్త్రము, (Psychology) ప్రపంచములోనుండు ముఖ్యమైన మతములన్నియు మూడు విషయములను ప్రతిపాదించుచున్నవి (1) పరిపూర్ణమనస్స్వాతంత్ర్యము, (2) ఆత్మయను దాని ఉనికి, నిత్యత్వము, (3) భగవంతుడు మానవుని సంకల్పములు, చేష్టలు, అతని పుట్టుకలోనే, అతని పూర్వులలో నొకరి గుణములు, వంశ పారంపర్యమువలన కలిగినవానిని బట్టియు (Heredity), తరువాత అతని జీవితకాలములో అతనిని పరివేష్టించిన పరిస్థితులవలన కలిగిన జ్ఞానము, గుణములను బట్టియు (Environment) ఉండునని ప్రకృతిశాస్త్రజ్ఞుల వాదన. దేవుడనువాడొకడు, అతని నొదుటిమీద యేమేమియో వ్రాసి అతనిని సృజించలేదని వారు నమ్మెదరు. పైన చెప్పిన రెండింటిని బట్టియే అతని మనస్సు పురికొల్పబడును గాని, అతనికి మరియొక విధమైన మనస్స్వాతంత్ర్యమును దేవుడనువాడు కలిగించలేదని ప్రకృతిశాస్త్రజ్ఞులు నమ్ముచున్నారు. మన హైందవ వేదాంతులు, అతని గుణములకును, చేష్టలకును, అతని పూర్వజన్మకర్మయే పునాదియనియు, తన పూర్వజన్మలో చేసిన సంచిత కర్మఫలము ననుభవించి తీరవలెననియు, పురుషప్రయత్నము అవసరమైనను దైవానుగ్రహము లేనిది (అదృష్టము, కనపడనిది) యేపనియు జయప్రదముగ జరుగనేరదనియు, ఒక హేతువును చెప్పవచ్చును గాని, యూజెనిక్సను సూత్రమునకు, వంశపారంపర్యముగ పుట్టుకతోనే వచ్చిన కొన్ని గుణములను యేమియు

చెప్పుకొన్ననే తప్ప, దాని యునికికి మనకెట్టి ప్రత్యక్ష ప్రమాణము దొరకలేదు లోకములో, కొందరికి పుట్టుకనుండియు కలిగియున్న దారిద్ర్యములు, దుర్మార్గుల కైశ్వర్యము, నిరపరాధులకును, జ్ఞానులకును, అకాలమృత్యువు, భీతవములు— యీ మొదలైన విపరీతములు, అన్యాయములు ప్రతిదినము జరుగుచుండుట వలన, వీనిని గురించి భగవంతుని దూషించక, ప్రకృతిలో యివి సహజములేయని తృప్తిపడక పూర్వులు కర్మసూత్రమును దానిమీద మన వేదాంతులాధారపడి యుండిరేగాని, యీకర్మ అనునది మొదట యెట్లుపుట్టినది యని యడుగగా, అదియు అనాదియే యని వీరు బదులు చెప్పెదరు ఈ కర్మసూత్రము కంటె, ప్రతిమానవునికి, వాని శరీరమునకెనే, వంశానుక్రమముగ పుట్టుకతోడనే, తన పూర్వులలో నొక్కరి గుణములు వచ్చుచుండుననియు, తన జీవిత కాలములో తన్ను పరివేష్టించు పరిస్థితులు, శిక్ష, విద్యాభ్యాసము, స్నేహితుల సహవాసము మొదలగునవి తన పుట్టుకతో కలిగిన గుణములను కొంతవరకు మార్చవచ్చునని యు, భౌతికశాస్త్రజ్ఞుల వాదన యెక్కుడు సహేతుకరముగ నున్నదని నా యభిప్రాయము

ఆత్మయనునది మన మెదడుకంటె వేరుగా లేదనియే నా నమ్మకము శరీరములో, ఆత్మయను నొక ప్రత్యేకవస్తువు, ప్రత్యక్షప్రమాణమును బట్టి లేదని శారీరకశాస్త్రము, మానసికశాస్త్రము నిర్ధారణచేయుచున్నవి మన మెదడు నశించ

గాన, మనస్సు, బుద్ధి, జ్ఞానము, మొదలగు దాని గుణములు కూడ నశించునని. ఇక ఆత్మయనునది వేరుగా మానవులకును, మరికొన్ని జంతువులకును, భగవంతుడు సృష్టించెనా? ఈ జీవరాసులన్నియు సృష్టియగుచుండిన యెడల, వానిని ఆత్మలు పుట్టించుచుండునా? సృజించిన జీవరాసుల యాత్మలు, పుట్టుచున్నవానిలో, ఆయనయే ప్రవేశింపజేయునా? ఈప్రశ్నలకు సమాధానము, శాస్త్రములు, ఏవి వేదాంతములు పరిపరివిధముల చెప్పినవాక్యములే సమాధానపడవు. భౌతిక శాస్త్రజ్ఞులగా చూచినచో, యీ కంటకము లేవియు కన్పట్టవు రోగలక్షణశాస్త్ర పరిశోధనలవలన (Pathology of the brain) మన మస్తిష్కములో ఒక్కొక్క భాగమును తీసివేసి క్రమముగాను, ఒకటి రెండు గాని కొన్ని మానసికశక్తులు పోవునని స్పష్టపడినది. జీవజంతువులయొక్క. మస్తిష్కముల యొక్క పరిణామము, వికాసము, గుణము, నిర్మాణము, ఆకారముల పోల్చి చూచినయెడల మానవునిబుద్ధి, జ్ఞానములు, యెంత యుత్కృష్టదశకు వచ్చినవి మనకు బోధపడగలదు. క్రిందనుండి పైకిజీవరాసుల మెదడును పరీక్షించుకొనుచుపోగా వాని వాని మెదడునుబట్టియే జ్ఞానము యెక్కుడగుచున్నదని స్పష్టము

మన హైందవ వేదాంతులలో కొందరు ఒకయుక్తిని పట్టి, ఆత్మనిత్యత్వమును, భగవంతుని యునికిని సాధింపప్రయత్నించిరి చరాచరసృష్టి యంతలోను, యిట్టియాత్మలున్న

వనియు, యివి యన్నియు, భిన్నముగా నుండక, పరమాత్మ యొక్క రూపులేయనియు, కాబట్టి దేవుడనువాడు, ప్రకృతియంతయు నిండియే యున్నాడనియు, ప్రకృతియంతయు అతనిలోనే యున్నదనియు ఊహించిరి. దీనినే Pantheism అని ఆంగ్లేయభాషలో వాడెదరు. ఇది సత్యమైనచో, ఇట్టి రూపులుగల దేవునిలేను సరికదా, అట్టివానిని ప్రార్థించుటయు అసాధ్యము, అనవసరము. రూపములేని వానిని ప్రార్థించుటకు, ఒకనాటి పిడివంటి బొమ్మను చేసికొనవలసి వచ్చుచున్నది. దీనికంటె చెట్లు, పుట్టలు, రాళ్ళను, రప్పలను ప్రకృతిలోనున్న వానిని ప్రార్థించుటకై అడవిజాతుల పూజయే మేలని తోచుచున్నది. నాకు, దేవుని ప్రకృతిలో ప్రతిష్టించిరని మనమనుకొనవచ్చును. ఇట్లుగాక, మనపూర్వజన్మ కర్మలఫలములను మనమనుభవించవలసి యున్నపుడు, యిక దేవుడను వానినొకని ప్రార్థించవలసిన పనియేమి? మనకతనితో యేమి సంబంధము? అతడెట్లు మన సంచితకర్మలను, వానిలో నిప్పుడనుభవించు ప్రారబ్ధకర్మలను నశింపజేయగలడు? వానిని తప్పక మన మనుభవించవలసినదే గదా? అట్లగుచో, పురుషప్రయత్నమునకు తావేది? ప్రపంచములో మనవేదాంతములే యుత్కృష్టమని చెప్పుటకు ఈ ప్రశ్నలను హేతువాదముమీద నిలబెట్టి పరిష్కరించు ప్రయత్నములే కాని యివి యన్నియు కేవలము ఊహాగానములైనవి. ఇట్టివానినట్లు, మనకు అనుదినము కలుగు కష్టసుఖములలో, మనస్స్వాతంత్ర్య స్థి

కిని, ధైర్యమునకును వైరాగ్యబుద్ధికిని కల్పింపబడినవి కాని వీనిని తప్పక అంగీకరించుటకు మనకెట్టి ప్రత్యక్షప్రమాణ ములు లేవు భక్తి, జ్ఞాన, కర్మ, ధ్యానయోగమార్గములన్ని యు, ఆధ్యాత్మికపథములక సోపానములుగ కొందరకుండవచ్చును గాని, ప్రకృతిశాస్త్రజ్ఞానము గలిగినకొలది వీనిని త్యజించి, ఈ పరిణామవాదముగ, నీతినియమముల కూడ వర్తింపజేసికొని, భగవంతుడు, ఆత్మ పరలోకము మొదలగువాని యందెట్టి విశ్వా సముగాని భయముగాని యుండక, సన్మార్గవర్తనములో ఆస క్తిప్రాయముగ నడచుకొను విధానము, ఎన్నటికైనను ఉండి, బాలురకు పాఠశాలల్లో కూడ బోధచేయుచుండవలెనుగాని, మనకు తెలియనివిషయములలోని పుట్టియూహాలను, సత్య ములని వారిని నమ్మింపజూచుట శుద్ధపొరపాటు మనము నమ్మ ని పుక్కిటిపురాణకథలను వారిచే నభ్యసింపజేయుట అంత కంటె పొరబాటు సృష్టిపరిణామవాదమును యేమాత్రముగ నొప్పుకొన్నను, యీవిషయములో పురాణములలో చెప్పినదే గాక,ఆత్మయొక్క అస్తిత్వనిత్యత్వములు విసర్జింపక తప్పదు

## హిందూజాతి—హిందూమతము



### 14 వ అధ్యాయము

పారిశ్రులు (అస్పృశ్యులనువారు), హిందూజాతిలో చేరినవారనియు, కాని వారు హిందూమతస్థులు కారనియు,

శ్రీ రామచంద్రయ్యరుగారు, సెలవిచ్చిరి ఈజాతికిని, ఏ జాతికిని యెట్టిభేదభావ మున్నదీ వీరు తెలియజాలరు. బాగుగనుండేడిది ఈపదముల నిర్వచనము నిర్ధారణ చేయుటలో, యీభారత దేశముయొక్క సాంఘికపరిణామచరిత్ర విమర్శనము ప్రధానమైన విషయము దీనిలో ఇంకను పరిశోధనలు జరుగుచున్నవి మంత్రములన్నియు బ్రాహ్మణమతమని వాడుచున్నారు ఋగ్వేదకాలములో ఆర్యమతమును నదియొక కాలము అది యీబ్రాహ్మణములు బయలుదేరిన కాలమునుండే సంక్లిష్టమైన నానావిధ కర్మకాండలతో నిండినది ఇది బ్రాహ్మణమతము కాదు. ఆవేదము తరువాత, కొన్ని వేల సంవత్సరములకు పుట్టిన యజుర్వేదములోని కొద్ది కర్మకలాపములును విస్తరింపజేసి, మంత్రబ్రాహ్మణ గ్రంథములు వ్రాయబడినవి తరువాత, కొన్ని వేల సంవత్సరములకు సూత్రములు, స్మృతులు, ఆయా కాలపరిస్థితులను ఆచారవ్యవహారములను సాంప్రదాయములను బట్టి అనేకవిధములయిన మార్పులను సూచించుచు వ్రాయబడినవి ఈవివిధ గ్రంథముల కాలనిర్ణయములచేసి, మనమత సాంఘికాచార చరిత్రను పరిశోధించినయెడల, యెట్లు యీహిందూజాతి హిందూమతములు పరిణామము నొందినవి తెలియగలదు. ఋగ్వేదకాలమందు ఆర్యులు సప్తసింధుదేశములో నున్నప్పుడు, వారిలో దాసులు, దస్యులు, అసురులు, ప్రవాహ్యులు, యదులు, తుర్వాసులు, పురులు, తృత్సులు, కృపులు, పాంచా

[illegible]లు, శకు[illegible], సేమా[illegible], [illegible], యాత్రుల, [illegible], పర శాలు, పృథులు, వ్రాత్యులు, విశాఖలు మొదలగు సనేక జాతు లుండెను [illegible], మంగోలియనులు, తురేనియనులు, సతి యనులు, పార్థియనులు, గ్రీకులు, యవనులు, బాహ్లీకులు మొదలగువారి రక్తము, ఆర్యులలో కలసిపోయి అనేకమిశ్ర జాతు లేర్పడినవి

యిప్పుడయినను యీ హైందవ మిశ్రజాతిలో యేవిదే శీయుడయినను సులభముగా కలియవచ్చును వృత్తులనుబట్టి లక్షలకొలది వర్గములు, భారతదేశములోని నానాభాగము లలో వ్యాపించియుండుటచేత, యేవృత్తినవలంబించు సంఘ ములో చేరినను, అతడు హిందువుగానే పరిగణింపబడును ఏ రాష్ట్రములోగాని, సాలి, మంగలి, కుమ్మరి, సద్రంగి, కం సాలి, గవండ్ల, సాలి, మొదలగు వృత్తులలో, దేనినో యవలం బించి అక్కడ కట్టుబాట్లు, భాష, ఆచారములు, జుట్టుబొట్టు కట్లు అవలంబించగానే ఆసంఘములో చేరిపోవును ఈ హైందవ జాతికి ఒక ప్రత్యేకమతసాంప్రదాయము లేదు దేవుడు, స్వర్గ నరకములు, నైతిక ధర్మములు, ప్రపంచములోని అన్ని మత ములలోను కలవు పునర్జన్మయందు నమ్మకము, మన హిందు వులలోనే గాక, మన భారతదేశములో నుండి వెడలగొట్టబడిన బౌద్ధమతములో కూడ నున్నది మనదేశములో, వివిధవర్ణ ములు, వృత్తులు వేనకువేలుండుటవలన, గ్రీన్లెండు దేశములోని యెస్కిమోజాతివాడైనను సరే, మన సంఘములలో దేనిలో

(బ్రహ్మసామాజికుల మొదలగు నవీన సంఘములు, క్రైస్తవు
లు, ముస్లిములగు దేశములో కల యితరమతస్థులు మొదలగువా
యీ మతములు కూడ ప్రథమముగా ఒకే దేశములో అనేకులకు
వ్యాపించినాయి సందర్భము

కాబట్టి హిందూమతమునకు వేరుగా ఒకేయొక వ్యక్తి
యుండలేదు. సనాతనధర్మావలంబులని చెప్పుకొను వారికైనను
ఒక సామాన్యమైన నాయకుడు లేడు. వీరిలోవీరికి చేరిక విషయ
ములలో పరస్పర భేదాభిప్రాయములు సంఘసంస్కరణాభి
లాషులకు నవనాగరికులలో కలిగినే గాని, శ్రీ స్వామి
దయానంద సరస్వతీస్వాములవారు శ్రుతులను మాత్రము ప్రమా
ణముగా గైకొని, స్మృతి, పురాణేతిహాసములను భిన్నాగా
తృణీకరించి, వివిధవర్ణాశ్రమములను, వారివారి యోగ్యతలను
బట్టి అవలంబించవచ్చుననియు, ఒకపి జన్మమును బట్టి రాద
నియు, ఆర్యసమాజమనుదానిని నెలకొల్పిరి. శ్రీ రాజారామ
మోహన్‌రాయలవారు, శ్రుతులను కూడ పౌరుషేయములనే
యెంచి, వానిలోని యేకేశ్వరోపాసనకు వర్తించు భాగములను
తీసికొని, వర్ణములను బొత్తిగా విసర్జించి, బ్రహ్మసమాజమును
నెలకొల్పిరి. బుద్ధభగవానుడు అసలే యీశ్వరుడొకడు
లేడనియు, మోక్షమునకు పూర్వకర్మసంచయమును బోగొట్టు
కొని, నిర్వాణమును పొంది పునర్జన్మరాహిత్యమును బడయ
వలసినదనియు, వర్ణభేదములను పాటింపవలదనియు, నైతిక
మార్గము నవలంబించి, జితేంద్రియత్వము సంపాదించి, నిర్వా

దలగు సాముదాయికాచారములు బట్టి వేరుపరచబడుచు కొన్ని యెడల హిందువులని అంగీకరింపబడు వారందరు వానిని ఒకే విధముగ అవలంబించుచున్నారా? ఇక మన దేశములో మనతో పాటు పుట్టి పెరుగుచు మన దేవుళ్లనందరిని కొలుచుచు మన పురోహితులచేతనే మంత్రములు చెప్పించుకొనుచున్న మాల మాదిగలు మొదలగు అస్పృశ్యులని చెప్పబడువారు హిందూ మతస్థులేల కారో దురూహ్యము

## ధర్మజిజ్ఞాస

### 15 వ అధ్యాయము

ఈశ్వరధర్మమేమో మనపూర్వులు గుర్తించిరని చావలి వెంకటరమణశర్మగారి యభిప్రాయము ఇంతవరకు పరిచ్ఛిన్నమైన యేమానవుడును, అపరిచ్ఛిన్నమైన ప్రకృతినిగాని దానిని సృజించినట్లు చెప్పువానిని గాని గ్రహించలేడనియు, గ్రహించ జాలడనియు నానమ్మకము ఋగ్వేదము, ఉపనిషత్తులే దీనికి నాకాధారములు. ఈవిషయమై మన యూహల నటుండనిచ్చి, ఈశ్వరధర్మములనగనవి కొన్ని యున్నవనియు, అవి మార్చబడకూడనివనియు ఈయన శలవిచ్చిరి అవి యెవ్వి? సనాతన ధర్మవాదులమని చెప్పుకొనేవారి వర్ణాశ్రమ ధర్మములు నేడు భారతదేశములో మాత్రమున్న వర్ణాశ్రమధర్మములా? అవి,

నైనచో, యేకాలమునాటికి అభియన్నియు పరిణామము లనుపొంది మారిపోవుచుండెనా ? లేదా ?

భగవంతుడు ఆత్మ మొదలగు నాధ్యాత్మికవిషయములు ఊహాలపైననే ఆధారపడినయెడల మన కెట్టి ప్రమాదము కలదు? నైతిక సూత్రములు పై యూహాలమీద కట్టబడ లేవనియు, సాంఘికజీవనమునకు, మానవాభివృద్ధికిని అను కూలమగునట్లు ముప్పదివేల సంవత్సరముల పై కాలమునుండి అనుభవములు బట్టి మారుచుండెననియు నా వాదన మానవ ధర్మములను గురించి నాన శర్మగారు, నేను వ్రాసినదానితో యేకభవించినను, యిక వీరి ఈశ్వరధర్మములు ప్రత్యేక ముగా నున్న వేవియో వ్రాయకోరెదను. ఆధ్యాత్మికవిషయ ములను గురించి వేరువేరు ఊహలు, ఆయూహసంఘములలోను వానిలోని వ్యక్తులలోను ప్రబలుచున్న నేమిముప్పు వాటిల్లును?

ఇక అశ్పృశ్యులను మనలో కలుపుకొను విషయమును గురించి నాకు, శర్మగారికిని కొద్దిగా అభిప్రాయభేదమున్నది. నాతోపాటు ఆయనయు గుణకర్మలనుబట్టియే జాతి యేర్పడి నదనియు కేవలము జన్మచేత కాదనియు నమ్మినపుడు, వారి వారి గుణకర్మలనుబట్టియే మానవులు ఒండొరులతో కలి యుట సంభవించుచుండును. ప్రతిమానవునికి, వంశపారం పర్యపుగుణములును, పుట్టినతరువాత తానార్జించిన గుణము లును కలసి అతని స్వభావమేర్పడుచుండును కాని ప్రతి మానవుడును స్వేచ్ఛగల జంతువుగనుక, యేదియో

నొక సంఘములో చేరినగాని, సౌఖ్యమనుభవించలేడు గనుక, తనకు దానిలోని కొన్ని సాంప్రదాయములు ఆచారములు యిష్టములేకున్నను, వాని నవలంబించుచు తాను ఆసంఘము త్రోసివేయనంతవరకు, దానిలోని కొన్ని కట్టుబాట్ల నుల్లంఘించుచు వానిని మార్చుటకు ప్రయత్నించుచుండును. ఇట్లే మన భారతదేశసంఘములలో వివిధవృత్తులకు వివిధసాంప్రదాయములేర్పడి ప్రతి అంతర్వర్ణములుగ చీలికలై శిలారూపములను దాల్చియున్నవి. వానిని సాధ్యమైనంతవరకు మనము కలిపి ఐకమత్యము కలిగించుటకు ప్రయత్నించవలెను కదా! ప్రకృతిలో యెక్కడ చూచినను చరాచరములలో నానార్థమున్నట్లే మానవులలోకూడ నుండును కాని వీరిలో యేజాతి గాని యేవర్ణము గాని ఒకదానికంటె ఒకటి యెక్కువనియు, తక్కువనియు, భావించజనదు. సుజనులు, దుర్మార్గులు, దరిద్రులు, ధనవంతులు, శాకాహారులు, మాంసాహారులను భేదములు స్వాభావికములైనవే. ఒండొరులతో వియ్యములుగాని భోజనప్రతిభోజనములుగాని జరిగించకపోవచ్చును. వివిధ వృత్తులవారు తమతమ వృత్తులనవలంబించిన వారితోనే సంబంధము బాంధవ్యములు కలిగి వారితోనే కలసియుండుట కిచ్ఛగింతురు. ఇట్టి భిన్నభావములు వివిధవ్యక్తులయెడల అన్యోన్య గౌరవమున కెట్టి యాటంకములు కలుగజేయకూడదు. దీని కుదాహరణము. ఒక పాకీవాడు తన వృత్తిని తాను చేసికొని తరువాత స్నానముచేసి శుభ్రవస్త్రములు కట్టుకొని మన

యింటికివచ్చినపుడు, అతనితో వివాహసంబంధము పంక్తిభోజ
నము చేయుటకు కొందరంగీకరించక పోవచ్చునుగాని అతనిని
మనతో సరిసమానునిగ అతని విద్యనుబట్టిగాని, సుగుణము
లనుబట్టిగాని, యేల యెంచకూడదు ? అతను గౌరవభాజను
డేలకాడు ? అతను ధనవంతుడై మఱియొక వృత్తిలో ఉండగ
గానే మన సవర్ణసోదరులు అతని యడుగులకు మడుగులొత్తె
దరుగదా ! గవర్నమెంటు ఉద్యోగియైనయెడల, యిక చెప్ప
వలసినదేమి ?

గుణకర్మలే ప్రధానమైనపుడు, అతనికర్మ కెట్టి లోప
మున్నది ? సంఘములో వివిధ మానవుల కలయికకు సామా
న్యముగ స్థితిభేదములు తప్ప మరియేవి యడ్డుపడుచున్నవి ?
అస్పృశ్యులకు వారి గుణము, నడత, ధనము, విద్య మొద
లగువానినిబట్టియే సంఘములో అతని అంతస్థు యేర్పడవలసి
నదిగాని, జన్మవలన కాదని మన శాస్త్రిగారును, మన పూర్వు
లును అంగీకరించియున్న యెడల యీయనకు అస్పృశ్యతా
నివారణమునకు సందేహములేల ? కట్టుబాట్లేల ? ఈయన
ప్రకృతినుండి తీసికొన్న ఉపమానములు, స్థిరపదార్థములవలె
గాక, దినదినము మారుచున్న వ్యక్తుల కెట్లు వర్తించును ?
మన మాలలు, మాదిగలు మొదలగు ఆరుకోట్ల అస్పృశ్యు
లను రావిన గింధకములుగా శుద్ధిగాసిచ్చే మనవారేల చేయు
టకు ప్రయత్నించకూడదు ? ఇట్టి సాంఘికసంఘటనలో మనము
కట్టుబాట్లె తప్ప నరమాంసభక్షకుల మెట్లగుదుము ? రాజ

కీయ సాంఘికశిక్షలు ప్రజలను నైతికమార్గములో నెప్పుడును పెట్టుచునేయున్నవి నాగరికత హెచ్చుచునేయున్నది సన్మార్గదుర్మార్గములు ప్రబలుచునేయున్నవి ఇవి ప్రకృతి స్వభావము పరిపూర్ణత యెప్పుడును కలుగదు

మన పూర్వులను, మన పూర్వుల జ్ఞానవిజ్ఞానములను యెన్నటికి తృణీకరించరు లన్ని సంఘములలోను ప్రస్తుత నాగరికతకు వానిలోని పూర్వులదే పునాది దాని నెట్లు మానవులు మరువగలరు? కాని కొందరి పూర్వాచారపరాయణుల వలె మన పూర్వుల జ్ఞానమే పరిపూర్ణత వహించినట్లును దానికి మనము చేర్చవలసినదేమియు లేనట్లును ప్రతివిషయము లోను మన డప్పునే మనము వాయించుకొనుచు తృప్తినొంది యుండక మానవసౌభ్రాతృత్వమునకు కావలసిన యుద్యమములకు తోడ్పడుచు విశ్వమానవకోటినంతను సోదరులవలె చూచుట మన విధి దీనికి యేపూర్వధర్మశాస్త్రముగాని అడ్డు తగులకూడదు అంతర్వర్ణములలోనేగాక అంతర్జాతులలో కూడ Eugenics శాస్త్రసూత్రముల ననుసరించి సమ్మేళనలు జరుగుచుండవలెను. ఇట్లు మిశ్రమము ప్రపంచకళ్యాణమునకు తప్పక తోడ్పడును

చావలి వేంకట రమణశర్మగారు, పైవిషయమై వ్రాసిన దీర్ఘవ్యాసమును సాకల్యముగ చదివితిని ఈయన బాగుగావివిధవాదములచర్చించి, ఏదుద్దేశ్యముతోనే, కొన్ని ప్రశ్నలను సనాతనధర్మవాదులను, మరికొన్ని ప్రశ్నలను నవ

నాగరికులను అడిగిరి ఎట్టి జవాబుల నొసంగినను, కొందరకు సందేహనివృత్తి యిట్టి విషయములలో కానేరదని నేననమ్మినను, నా యభిప్రాయములు, హైందవసంఘములో ముప్పాతికిముందికి రుచింపకున్నను, నాకు తోచిన జవాబులు నే నిచ్చుచున్నాను (1) ఈశ్వరధర్మమును గురించి, శర్మగారే భిన్నాభిప్రాయములు, హైందవమత సాంప్రదాయములలో కలవని యంగీకరించినప్పుడు, ప్రపంచములోని యితర మానవసంఘములలో యివి యెన్నియుండునో వీరు గ్రహించగలరు పరిమితి శక్తిగల మానవులు అనంతమైన యీప్రకృతియొక్క ఆద్యంతము లెట్లు తెలిసికొనగలరు? కావున, దేవుడు, మోక్షము, పునర్జన్మ, ఆత్మ, స్వర్గనరకములు మొదలగు ఆధ్యాత్మిక విషయములలో మనస్సుకి నచ్చిన సూత్రాలను వారవలంబించవలసిందే గాని యిదమిత్థమని ఋజువుచేసి ఒండొరుల నొప్పించజాలరు ఈవిషయములు వ్యక్తుల మనస్స్వాతంత్ర్యమునకు వదలవలసినదే గాని, వానిని ఋజువుపరచగలవారెవరు? ఇవి యన్నియు ఊహాప్రపంచము మీద ఆధారపడవలసినవే (2) మానవధర్మములు, ప్రపంచమంతయు యీ యాధునిక యుగములో కొంచ మెచ్చుతక్కువుగ ఒకరీతినే నడచుచున్నవి దీనికి కారణము సంఘశ్రేయమునకును, స్థిరత్వమునకును కొన్ని నైతికధర్మములు, చిరకాలానుభవముచేత ప్రచారములోనికి వచ్చుటయే సత్యము అహింస అస్తేయము మొదలగునవి ప్రపంచములోని అన్నిజాతులలోను వ్యాప్తినొంది అంగీకరించ

బడి యనుష్ఠింపబడుచున్నవి. ఈమానవధర్మములే, నీతి ధర్మములనిగాని సామాజిక ధర్మములనిగాని సనాతన ధర్మములనిగాని వాడబడుచున్నవి. స్వార్థము వలనగాని, మరియే యితర కారణములవలనగాని, సంఘములోని ఒకవ్యక్తి వాని నుల్లంఘించినప్పుడు, అతడు రాజకీయసాంఘిక శిక్షలకు లోనగుచుండును. మతములన్నియు, యీ నీతుల నుపదేశించెను, వానిలోని దైవశిక్షలకు, యీకాలములో నెంచువా రరుదుగ నున్నారు. ఈనీతులు మతములు, పరిణామమును పొందుచుండెనేగాని, దేవుడను వాడొకడు, ఒక్కసారిగా, మానవుని సృష్టించి, అతనికి బోధించెనని సాంఘికశాస్త్రజ్ఞు లెవరును ఒప్పుకొనరు. వివిధసంఘముల చరిత్రలు, పై సూత్రమును ద్రోసివేయుచున్నవి (3) సదాచారము ఒక నిర్దిష్టమైన మార్గమేర్పడియుండలేదని శర్మగారంగీకరించియేయున్నారు. వీనికి ఒక త్రోవయు డొంకయు లేదు. వీనినిగురించి చర్చించుట నిరుపయోగము. యోగ్యులందరయినను ఒక సమాజములోనివారు యేకగ్రీవముగ నంగీకరించువారు కనపడరు. ప్రస్తుతము హిందువులనందరిని కలవరపరచుచున్న అస్పృశ్యతా నివారణమును గురించి, నవనాగరికులను యీయన కొన్ని ప్రశ్నల నడిగిరి. అస్పృశ్యులను మన సంఘములో చేర్చుకొన్నయెడల జాతిమతవిచక్షణయే నశించునుగదాయని వీరి సందేహము. అటులైన నేమి? మిన్ను విరిగి మీఁదపడునా? ఈ విచక్షణ క్రమక్రమముగా నశించుటయే మన పరమావధిగనుండవలెను.

సర్వమానవ సౌభ్రాతృత్వమునకు యిట్టి మతిసాంప్రదాయములే గొప్ప యాటంకములగుచున్నవి. సర్వభక్షకురాలైన కాలదేవతయే వీనిని తుదముట్టించును.

ప్రతివ్యక్తియు తన స్వాతంత్ర్యమునకు, తన సౌఖ్య సంతోషములకును దేనియో నొక మానవసంఘములో చేరి ఆసంఘ కట్టుబాట్లలోనే యుండవలసి వచ్చుచుండుటకు అలవాటు పడెను. తన సంఘమే తక్కిన సంఘములకంటె మంచిదని దురభిమానము యేర్పరచుకొనును గాని ప్రత్యేకముగా నాలోచించడు. వానిలో కొన్ని కూర్పులు ఇష్టపడక యట్టి గోడలు కట్టుకొని వానిమధ్య కాపురముండును. వెలుపలవారిని లోనికి రానీయడు. తన సంఘములో వారిని బయటకు పోనీయడు. ఇట్టి కట్టుబాట్లు యెంతకాల మూడగిలవు? వర్ణసంకరము, జాతిసంకరములకు భయపడవలసిన పనిలేదు. భయపడి లాభములేదు. ఒక సంఘమునుండి మరియొక సంఘమునకు మార్చుకొన్నందున యెట్టి పాతిత్యములేదు.

ముప్పదివేలసంవత్సరములక్రింద ఋగ్వేదకాలమునాటి నాగరికతకు మన హిందువులము గర్వపడవలసినదే. మన సప్తసింధులోని ఆర్యుల జ్ఞానవిజ్ఞానములు, అస్సీరియా, చాల్డియా, బాబిలోనియా, ఈజిప్టు, ఫినీషియన్, సూమేరియన్, నాగరికతలకు మాతృకలని చెప్పదగును కాని, మన తాతలు పూర్వము ఒక గుంటలో ప్రవేశము చేసికొనిరి గనుక మన మందరము అక్కడికిపోయి ప్రవేశము చేసి

కొన్నిగాని పవిత్రములు కావని చెప్పుట యెంత అసంబద్ధమో మన పూర్వులు ఒకానొకప్పుడు అంబలము త్రాగిరని మన ఉప్పు మనము త్రాగుచుకొని తృప్తినొందియుండుట అంత యుక్తము. ఈ ప్రయోగము ఆధునికయుగములోని వివిధసంఘపరిస్థితులకు వాని యభివృద్ధిమార్గములకు మనము నిరసించుటకు పరాపద్గండాకములవలె వెనుకటి యాచారములనే పట్టుకొని వ్రేలాడుచుండుట మన యాత్మహత్యయే యని నమ్మవలెను. ప్రపంచములో కీడు మేళ్లు రెండును వృద్ధియగుచుండుట సహజము కాని కీడుగ చూచి నిస్పృహనొంది, వెనుకటి యుగములే మంచివనియు, కావున వెనకకు పోవుదమనియు ఉవ్విళులూరుచు వాదించుటవలన యెట్టి ప్రయోజనము లేదు. సామాజికవ్యవస్థలో యెన్నియో మార్పులు రానైయున్నవి. వీనికి వగచిన లాభమావంతయులేదు. మొత్తము మీద సంఘశ్రేయాభివృద్ధికి మానవకోటికంతకును అవశ్యకరమగు నైతికపథములును ప్రతిసంఘము త్రొక్కుచుండును. ఏమత విశ్వాసముగాని స్థిరముగ జనబాహుళ్యము చేత సర్వదా యంగీకరింపబడుట యెన్నటికిని పొసగదు. మానవకల్పితములగు యీ మతములు ఆచారములు, ఆయా దేశములలోని సాంఘిక పరిస్థితులను బట్టి పరిణామము నొందుచునే యుండును. ఒకప్పుడు మేలుచేసినవి గాబోరాను కీడు చేయవచ్చును. మనమందరము పూర్వసాంప్రదాయములలో కొన్నింటిని యింకను వదలలేక సంఘములోని మార్పులకు

విముఖులమైయుండుట స్వాభావికము. కాని సర్వజన సమత్వ బుద్ధి, ఒండొరులయెడల సానుభూతి, విశాలదృష్టి, స్వార్థత్యాగము, ప్రేమ, మొదలగునవి మానవసౌభ్రాతృత్వమునకు, అంతర్జాతీయవివాహములు, సహపంక్తిభోజనములు మొదలగునానిగుండా దోహద మొసంగగలవు క్రమక్రమముగా ఆయా సంఘములలోని మూఢవిశ్వాసములతో కూడిన యాచార సాంప్రదాయములన్నియు నశించును

## మానవకృష్ణ

### 16 వ అధ్యాయము

చిట్టా సుందరరామయ్యగారు, శ్రీకృష్ణుని మానవుని గానే భావించి, ఆయన జీవితము ను కడువ్యాఖ్యముగా వర్ణించి నందుకు మిక్కిలి సంతోష భరితుడనైతిని ఇది పూర్వాచార పరాయణులకు వెగటుగ తోచును కాని నేను భారత భాగవతములను చదువునపుడు, శ్రీకృష్ణుడు నా సోదరునిగానే భావించి, ఆయన లోపము లను, సద్గుణములను కూడ గుర్తెరుంగుచు, యీయనకుగల రాజకీయ జ్ఞానము (Political diplomacy) యీయన గీతలలోని వేదాంత జ్ఞానముతో (Monistic philosophy) నెట్లు, సమర్థించ గలనని నాకు కలిగిన సందేహము నేటికిని నన్ను వదలలేదు. భౌతిక విషయములలో, తన పుట్టుక నుండి, చనిపోవువరకు, తనజీవితము

యీ కాలపు మానవులలో నొక మహనీయుఁడుగా పరిగణింపఁగా ఘా
సిని పిలుచుచుంటే, యీ మహా గుణము నిజమైన యాతనిముఖ్య క
పఱచి యున్నారు. గ్రంథసమ్మతముగ నాతనియందున్న దోషములన్నియు
పొగడువారు హాస్యాస్పదులును, తర్కవాదములకనర్హులై
యున్నారు. ఈయన యౌవనములో పదివేల గోపికా స్త్రీలతో
జారత్వము, సూర్యుని తన బాణములతో కప్పి, సైంధవుని
వంచించి చంపించుట, పాండవులను విడదీసి ఉపపాండవులను
అశ్వత్థామచేత చంపించుట, అర్జునుని విడతీసి అభిమన్యుని
అన్యాయముగ చంపించుట, యీ మొదలగునవి ఆయన నడ
తలో కళంకములే. నిజముగా యీయన పరమదయామయు
డును, సర్వశక్తియుతుడు నగు భగవంతుడే యైనయెడల,
యిచ్ఛామాత్రముననే దుష్టప్రభువులు వారి పాన్పులమీద
నుండగానే చనిపోయియుందురు. నిరపరాధులగు రాజులు
నశించకనేయుందురు. దుర్యోధనుని హృదయములోనే
మార్పు కలిగియుండును. తాను పౌండ్రకుడు, జరాసంధుడు
మొదలగు వారి బారినుండి, పారిపోకుండగనే యుండును. ఇది
యంతయు భగవన్మాయ లీల యనియు, లోక సంగ్రహార్థము
జనులలో భక్తి పెరుగుటకు యిట్టి యావతారమెత్తి మాను
ష్యులలో మనుష్యుడుగా నుండి సంచరించుట సంభవించిన
దనియు వాదించెదరు గాని, యితరులను సన్మార్గపథము
త్రొక్కించుటకు, యిట్టి పనులు ఆదర్శప్రాయములు కావు
ఆకాలమునాటి నీతినిబట్టి యీయనను విమర్శించినను,

యీ సభలో లోపములు కనబడుచున్నవి కాని, సూత్రము మీద నగనంతుని కన్న కొంచెం ఆయన యుంపున్న జ్ఞానము కద్దనవచ్చు. ఆ కాస లోపములను మనము మరచి ఆయ నను మన మానవసోదరులలో ఒకనిగా భావించి, ఆగాన యుపస్థాపిస్తినములను, ఒనర్చిన కార్యములను ఉపదేశిం చిన జ్ఞానమును మనమెన్నడు మనవజాలము. అట్టి వానిని దైవ సంభూతునిగ యెంచుటలో ఆశ్చర్య మేమియు లేదు

ఈ విషయ మటుండనిండు. బ్రహ్మ సూత్రములు ఉపనిషత్తులు పుట్టిన చాలా కాలమునకు భారతము, దాని లోని గీతలును వెలువడినవి. చాందోగ్యోపనిషత్తునందు దేవకీ నందన శబ్దమున్నదని మన సుందరరామయ్యగారు వ్రాసిరి దీనిని బట్టి ఉపనిషత్తులలో, కాలానుసారముగ మార్పులు కలుగుచు యిట్టి వాక్యములు చొప్పింపబడి యుండవచ్చునని నా యభిప్రాయము అయినను యీ విషయము యింకను విమర్శనీయము. బ్రహ్మసూత్ర ఉపనిషత్తులలోని అధ్యాత్మిక జ్ఞాన సారమునేగాక, భక్తి యోగమును, సృష్టి క్రమమును కలిపి బోధ చేయుటకు మహాభారత గ్రంధకర్త గీతలను వ్రాసెనని యెంచ వలయును. అదివరకెన్నడో ప్రతిపాదింప బడియున్న వేదసంహితబ్రాహ్మణములలోని మీమాంసక మార్గము, వివిధోపనిషత్తులు, బ్రహ్మ సూత్రములలోని జ్ఞాన మార్గము, కాపిల సాంఖ్య మార్గము, చిత్త నిరోధమును ప్రవక రించు పాతంజలి యోగమార్గము, ఫలరాహిత్య కర్మమా

ర్గము, భక్తిమార్గము, వీనినన్నిటిని ఉపదేశించుటకే గీతాభారతము లో చెప్పబడి యున్నది ఈ ప్రస్తుత భారతము క్రీస్తు పుట్టక పూర్వము 1400 సంవత్సరముల క్రిందటనే రచింపబడి యుండెనని అనేక పరిశోధక మండలులవారు నిశ్చయించిరి ఋగ్వేదము, వేద శాస్త్రగ్రంధము ఇది ఎనుబదివేల సంవత్సరము ల క్రిందనే యుండ వచ్చునని నిర్ధారణ చేయుచున్నారు ఎట్లుతైనను, ఉపనిషత్తులు అయిదువేల సంవత్సరము ల క్రిందట నైనను పుట్టి యుండవలెను ఇప్పటి భారతము, బుద్ధుడు పుట్టిన తరువాత వెలువడెనని [illegible] రాజుగారి యూహ

• గాంధీ అంబేద్కర్లు



## 17 వ అధ్యాయము

వీరిద్దరు, హిందూ సంఘములో నుండు అస్పృశ్యతాచారమును నివారించదలచినవారే మహాత్మాగాంధిగారు, అస్పృశ్యులతో భోజనము చేయుటయేగాక, ఆజాతిపిల్లను పెంచుకొనెను డాక్టరు అంబేద్కరుగారు అస్పృశ్యజాతివారే ఈ అస్పృశ్యుల సంఘాభివృద్ధికి అనేక విధములుగ కృషిచేసి పాటు పడుచుండుటయేగాక, వారిని చాతుర్వర్ణ్యములలో కలిపవేయ వీరుభయులుగ సమకట్టిరి కాని వీరిద్దరిలో కొంచము భేదాభిప్రాయములున్నవి అస్పృశ్యులకు దేవాలయప్రవేశము అంగీక

కి గాంధిగారు [illegible], [illegible] [illegible] చెప్పి సహాయనిరా
కరణము చేయుదుమనియు, [illegible] సభలో ప్రవేశ
బడ [illegible] యెట్టి ప్రయోజనము లేదనియు వీరివలన
హరిజనులకు దక్కిన వర్ణములవారితో సమాన ప్రతిపత్తి
యేర్పడదనియు, యీ ప్రతిపత్తిని గాంధిగారు యిప్పుడే
నిర్ణయించిన యెడల, దేవాలయప్రవేశము చాతుర్వర్ణ్య నిర్మూ
లమునకు ప్రథమసోపానముగా తా నంగీకరించగలననియు,
అంబేడ్కరుగారు చెప్పుచున్నారు. బ్రాహ్మణక్షత్రియ,
వైశ్య, శూద్రు లనెడు వర్ణములు యథావిధిగానే యుండి,
వానిలో [illegible]యైన తారతమ్యతలుకూడ యిప్పటివలెనే యుండిన
యెడల, అస్పృశ్యులకు సమాన ప్రతిపత్తి కలగిక వారు
విడిగానే యుండబడుదురనియు, వారికి యీ హిందూసంఘ
ములో, సమానస్థానముండదనియు, గనుక వర్ణాశ్రమధర్మ
ములే అంతరించవలెననియు అంబేడ్కరుగారు వాదించు
చున్నారు. చాతుర్వర్ణ్యవిభేదనిర్మూలమునకు గాంధిగారును,
వారి యనుచరులును అంగీకరింపజేయ సిద్ధులైనయెడల
తానును, తనజాతివారందరును దేవాలయప్రవేశబిల్లులను
ఆమోదించెదమని వాగ్దానముచేయుచున్నారు. వీరిసవాలునకు
మహాత్ములవారిట్లు జవాబు చెప్పుచున్నారు. హిందూ
శాస్త్రములు, అస్పృశ్యతను యెంతమాత్రము పాటించ
వనియు, అట్లు పాటించినచో, తానట్టి హిందూమతమును
త్యజించెదననియు, కాని చాతుర్వర్ణ్యవ్యవస్థ హిందూధర్మము

నకు ప్రధానము గనుక దానిని నిర్మూలించకూడదనియు, మహాత్ములవారి వాదము ప్రస్తుతకాలములో, మనమందరము శూద్ర ధర్మమునే యవలంబించియున్నామనియు, పూర్వములలో ఉచ్చనీచతలను మాత్రము నిర్మూలించి, బ్రాహ్మణోచితమగు ధర్మరక్షణకు జ్ఞానమును సంపాదించవలచుకొను వారు బ్రాహ్మణులనియు, క్షత్రియోచితమగు ధర్మరక్షణలో మగ్నులైనవారు క్షత్రియులనియు, పశురక్షణ, వాణిజ్యము, ధనసంపాదనములలో కాలముగడపువారు వైశ్యులనియు, సేవాధర్మమును ఆచరించువారు శూద్రులనియు పిలువబడవలెనట! కాని యీ కాలములో మనమందరము సేవాధర్మమునే అవలంబించి, దానిమూలముననే జ్ఞానము, క్షాత్రము, వాణిజ్యము పశురక్షణ, ధనసంపాదనము, చేసికొనుచున్నామట! కాబట్టి, పైవానిని వ్యర్థమునకైగాక, ప్రజసేవకే యుపయోగింపబడవలసియున్నదని మహాత్ములవారు శలవిచ్చుచు, వీనిలో యెక్కువతక్కువ యను భావములు లేవనియు, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులను నాలుగుజాతులు సంఘమున కవసరము, కాబట్టి ఆయావర్ణములకు చెందినవారు తమకు నిర్ణయింపబడిన పనులను చేయుచు, వానికి సంబంధించిన హక్కులు, విధులు కలిగియుందురనియు, శూద్రధర్మమెంత మాత్రము న్యూనతకలదని యెంచకూడదనియు ఆయన స్పష్టముగ చెప్పివేసిరి దీనివలన తలిన పర్యవసానమేమి?

ఈ జన్మములోనే, వారివారి యోగ్యతలనుబట్టి పాకీ

వాడు బ్రాహ్మణుడు కావచ్చును. బ్రాహ్మణుడు పాకీ వాడుగా నుండవచ్చును. ఈ ఉభయులమధ్యను యెక్కువ తక్కువలు లేవు. సంఘములో యీ యుభయులకు సమాన గౌరవమే యీయవలెను. ఆచరణలో, యీఅంతస్తుభేదము లను యితర దేశములవారు పాటించుట స్వాభావికమైనట్లే మనలో కూడనుండవచ్చును గాని, మానవకోటికి కలుగుచు, యీ సమానత్వము ఆదర్శముగా నుండుట యుచితమని గాంధిగారి యభిప్రాయము. ఏమైననో, యిది ఋగ్వేదము నాటి ఆర్యులమతము కావచ్చునుగాని, బ్రాహ్మణమతముకాదు. ప్రస్తుత హైందవమతము కాదు. మహాత్ములవారి నిర్వచనమునుబట్టి, యీయన స్వామి దయానందులవారివలెనే, సూత్రములను, స్మృతులను పురాణములను ప్రమాణములుగా నంగీకరించనట్లు తేలుచున్నది. ఇక, హిందూసంఘముయొక్క ప్రత్యేకత దేనిలో నున్నది? ఈయన చాతుర్వర్ణ్యవ్యవస్థకు పునాది యెక్కడ నిలచినది? ప్రతిదేశములోను, వీరుచెప్పిన వృత్తులన్నియు నున్నవి. అక్కడ కసాయివాడు మహారాజు కావచ్చును లేక మతగురువు కావచ్చును. వారివారి యోగ్యతలనుబట్టియే, వృత్తుల నవలంబించుచున్నారు. ఇది డాక్టరు అంబేడ్కరు కోరిన వర్ణభేదనిర్మూలనము కాదా! ఎట్టి వృత్తి నవలంబించినను, మానవసేవకొరకు పనిచేయుచున్నట్లెంచి, వారికి సమానగౌరవమే యిచ్చుచుండుటచేత, అంబేడ్కరు గారి వాదనను, గాంధిగా రంగీకరించినట్లే యగును. మన

ఉపనిషత్తులు, జ్ఞానకాండమే, హైందవమతసాంఘిక ప్రత్యేకత నిలవబెట్టగలదేమో! బౌద్ధులు, ఆర్యసమాజీకులు, బ్రహ్మసమాజికులు, హిందువులుగానే భావించబడుచు, తుదకు, ప్రపంచములో సర్వమానవసౌభ్రాతృత్వమునకు, మన హిందువులే మార్గదర్శకులు కావచ్చునేమో! కాని, మహాత్ములవారి వాక్యములు, సవర్ణులందరికి కర్ణకఠోరముగా నుండుటయే గాక, సనాతనధర్మవాదులు, యీయన వర్ణభ్రష్టతచేసి, సంఘవిప్లవము తెచ్చిపెడుచున్నాడనేభయ, నిందారోపణలు చేయుటకు కారణములు స్పష్టమగుచున్నవి "కాంద్రిమధ్వాచారి తనయుడారాధ్యుండు" అను పద్యములో నుదహరింపబడిన మతసాంకర్యమువలెనే, ఒక కుటుంబములోనే, బ్రాహ్మణుడు, చెప్పులుకుట్టువాడు, మంగలి, వర్తకుడు మొదలగువా రుండవచ్చును. వీరందరు యేయేవృత్తుల నవలంబించినను సమానగౌరవమున కర్హులే గనుక, భోజన ప్రతిభోజనములు అన్యోన్యవివాహముల కెట్టి యాటంకములేదు. మాంసాహార, శాకాహారములు అడ్డు కలుగజేయవు ఇప్పుడున్న లక్షలకొలది వర్ణములు, అంతర్వర్ణములు నశించగలవు. మహాత్ములవారు కోరుచున్న, భగవద్గీతా ప్రతిపాదితమైన మతము మాత్రము మిగులవచ్చును. ఇట్టి విప్లవము ప్రస్తుత సంఘములో చొప్పించుటకు యెన్ని శతాబ్దములు పట్టునో యెవరు చెప్పగలరు? కాని యిది వాంఛనీయమే ఇట్టి వర్ణసాంకర్యము త్వరలో సంభవించకపోయినను, యీ వర్ణాశ్రమ

ధర్మములు వానంతట నిలవే నశించుచున్నవి. మహాత్ముల వారు కలిపిచ్చినట్లు మనమందరము శూద్రధర్మమునే అవలంబించవలసినచో, అందరము శూద్రులమే యగుదుము. ఇప్పుడు నిజ వైశ్య క్షత్రియ ధర్మములను, శాస్త్రప్రకారము ఆచరించువారు అరుదుగ నున్నారు. దానిని నిలబెట్టుటకు గాంధిగారి ప్రయత్నములు లాభములేదు. జ్ఞానసంపాదనము చేయువారే బ్రాహ్మణులైనచో గాంధిగారు, అనీబెసెంటుగారు, మొదలగువారందరు బ్రాహ్మణులే ఏమతీయ మతములని విశ్వసించి, ఒక వేదాంతమతము నంగీకరించువారందరు హిందువులుగానే యేల పరిగణింపబడకూడదు? ఇక కర్మకాండతో అగత్యమేమి? ఇప్పటికే శిథిలమైపోయినదానిని నిలవబెట్టు టెందులకు? కావున గాంధి అంబేడ్కరుగార్ల విధానముల ఫలితము లెక్కచేయని మనవిచేయుచున్నాను.

## సంఘసంస్కరణవిధానములు



### 18 వ అధ్యాయము

సంఘమందు అవసరమని తోచిన సంస్కరణలను చొప్పించుటలో రెండు కక్ష లున్నవి. ఒక పక్షమువారు, సంఘములోనుండి బలాత్కారముగ విడివడినను, తమకు న్యాయమని తోచిన వానిని ధైర్యముతో నవలంబించి, తమ

మనస్సాక్షి కనుకూలముగ ప్రవర్తించి, వేరొక సంఘమును స్థాపించుటకు ప్రయత్నించుచు, కార్యాచరణలో దిగవలెనను వారు రెండవపక్షమువారు, తమ సంఘమును వీడక, తమ సోదరులచేత ఒప్పించి, క్రమ క్రమముగా సంస్కారాలను, కాలానుసారముగ ప్రవేశపెట్టుటకు ప్రయత్నించవలెనను వారు. ఈ యిరుపక్షములు రెండు శతాబ్దములనుండి, మన దేశములో ప్రబలుచునే యున్నవి మొదటి పక్షములో రాజా రామమోహన్ రాయులు, కేశవచంద్రసేను, యీశ్వరచంద్ర విద్యాసాగరు, దయానంద సరస్వతిస్వామి, వీరేశలింగం పంతులు మొదలగు నాయకులున్నారు రెండవ పక్షములో రెనడే, గోఖ్లే, మాలవ్య, రఘునాథరావు, మాధవరావు, మొదలగు వారు కలరు ఈ రెండు విధానములలో కూడ కొంత సత్యమున్నది. మొదటి విధానము నవలంబించిన వారు, ఆచరణలో పెట్టజాలని ఉపదేశకుల వాక్కులయందెట్టి విలువయు నుండదు గనుక, కష్టపరంపరల నన్నిటిని యెదుర్కొని, ఒక చిన్న సంఘమునే తాము స్థాపించగలిగినను, అదియే పెద్దదై, తన ప్రత్యేకతను వీడి తుదకు అది కూడ హిందూ సంఘములో లీనము కావచ్చునని యెంచెదరు ఇట్టి విధానములో నాయకత్వము వహించి నిర్మలహృదయముతో, తమ పూర్వ సంఘము త్యజించి కష్టముల పాలగువారు బహు కొద్ది మంది ఇదిగాక, వీరైనను, పూర్వమతసూత్రముల నాధారము చేసికొని తమరు కోరిన సంస్కారణలకు ప్రయత్నించిరే కాని

తాము సనాతన మతకర్తలమని చెప్పుకొనలేదు వీరిలో వీరికే అనేక విషయములలో భేదాభిప్రాయములున్నవి వితంతు వివాహములు, రజస్వలానంతర వివాహములు, వర్ణాశ్రమ ధర్మములు, వేదముల ప్రమాణము, స్త్రీల సంపూర్ణ స్వాతంత్ర్యము, వారి స్వయంవరము, వివాహచ్ఛేదనము మొదలగు విషయములలో బ్రహ్మ సమాజము వారికిని, ఆర్య సమాజము వారికిని, యింకను బయలుదేరిన యితర సమాజములకును భిన్నాభిప్రాయము లున్నవి బ్రహ్మ సమాజమువారు, వేదములను దైవదత్తము లని ఒప్పుకొనక, వానిలోని కొన్ని కారికలను తీసికొని యేకేశ్వరోపాసనమును మాత్ర మంగీకరింతురు. ఆర్య సమాజమువారు, వేదములు మాత్రము అపౌరుషేయములని నమ్మి, దానిలోని కర్మకాండను శిరసావహించి వర్ణాశ్రమధర్మములు, ప్రపంచములోనున్న అన్నిజాతులవారికి వర్తింపించి, తమ సమాజములో వారిని చేర్చుకొందురు.

మన యాంధ్రనాయకులు, వారి యనుచరులలో, పై వానిలో యే కక్షలోను చేరక, తమ సంఘములోనే యుండి పూర్వపు ధర్మశాస్త్రములలో యేమూల ఒక కారిక దొరకినను, దానిని పట్టుకొని వ్రేలాడుచు, సంఘ సంస్కరణముల ననేకము సమర్థించుచు, ప్రజలచేత వానిని యాచరణలో పెట్టించుటకు ప్రయత్నించుచున్నారు. తుదకు ముందంజవైచి, శాసనసభలలో తమ ప్రతినిధుల ద్వారా, వానిని బలాత్కారముగ కూడ సంఘములో దొప్పించ దలచు

చున్నారు. ఈ విధానమునకు మన సనాతన ధర్మవాదులమని చెప్పుకొనువారు అడ్డుతగులుచు, యీ సంఘ సంస్కరణ ప్రియులు తమ సంఘమును వీడక గాదె క్రింద పందికొక్కుల వలె హిందూ సంఘ సాంప్రదాయములను లోలోన గుద్దలించుట యేల? న్యాయమనియు, యిష్టమున్న యెడల, సంఘములో నుండి తరలిపోవలె ననియు వాదించెదరు కాని ప్రజాసామాన్యము యీ నూతన పద్ధతినే అవలంబించ తలచుకొన్నది జాతీయతకు భంగము లేకుండ, సంఘమును విడనాడుటచే తమ పలుకుబడి తగ్గును గనుక అట్లు త్యజించక, ప్రజా బాహుళ్యమునకు యెబ్బెట్టు లేనట్లు పనులనే చేయుచు, వితంతూద్వాహములు, రజస్వలానంతర వివాహములు, కర్మకాండ విసర్జనము, వర్ణసమిష్టి భోజనములు, అంతఃశాఖా వివాహములు యథేచ్ఛగా జరిగించుకొనుచు, తమ వర్ణములో యెట్టి బహిష్కారమును పొందక సౌఖ్యముగనే బ్రతుకుచున్నారు. వీరు సహేతుకమైన కారణములతో, తమ విధానమునంతయు సమర్థించజాలకపోయినను, పూర్వ ధర్మ శాస్త్ర ములనే యాధారపరచుకొని సాంఘిక యిబ్బందులను తొలగించుకొనుచుండుటచే, యెక్కడనో పూర్వాచార పరాయణులు తప్ప, తక్కిన జనసామాన్యము వీరి యెడల సానుభూతిని చూపుచునే యున్నారు. నేను మొదట వ్రాసిన ప్రథమ పక్షము వారు, ధీరులగుటచే, మన కెల్లప్పుడు వందనీయులే వారే మార్గదర్శకులు కాని మన యాంధ్రులు, రెండవపక్షము

వారిలో నొకరి సంఘమును వదలక, ప్రజలలో కొందరి యామోదమును పొందగ ఒకయు ముఖ్య సంస్కరణాలను సంఘములో నొప్పించు చుండుట కూడ శ్లాఘాపాత్రమే కాలము గ, సాంఘిక శాస్త్రము వీరి వాదమును బలపరచు చున్నది

అనేక వేల శతాబ్దముల నాటి నుండియు, మానవుడు గుంపులు గుంపులుగా జీవించు సంఘములలో జేరి, సంఘాభివృద్ధికి తోడ్పడుచు దానిలో కాలానుసారముగ సంస్కరణలను చేసికొనుచుండెను ఒకసంఘములో చేరకుండ యేవ్యక్తిగాని సుఖము ననుభవించజాలడు ఇతరుల సానుభూతిని తన కష్టసమయములలో కోరువాడును, అన్యోన్యప్రేమను స్నేహమును సంపాదించుకొనుచు గృహస్తుగా నుండదలచిన వాడును, యేదియో నొకసంఘములో చేరక తప్పదు తనసంఘము తన నూతనాభిప్రాయములు యెంతవర కంగీకరించి తన్ను దానిలోనుండి వెడలగొట్టకుండునో అంతవరకు దానిని ముందుకు లాగుకొని పోవుటకు ప్రయత్నించును ఆసంఘములోని కొంతమంది ప్రజలైనను తన సంస్కరణను ఆమోదించిన యెడల ఆ సంస్కరణను సులభముగా ప్రవేశపెట్టుటయేగాక తాను మరియొక ప్రత్యేక ఉపసంఘమునకు నాయకుడై దీనిని పెద్దసంఘములో లీనమగునట్లు చేయుటకు ప్రయత్నించును. తాను సంఘమునుండి వెలియై యేకాకిగా నుండుటెన్నడు ఒప్పుకొనడు. తన కెంతమాత్రము నమ్మకము లేని మూఢా

చారములను కూడ నామక౦ అనుసరించుచుగాని సంఘమును త్యజించకుండానే లిఖితవాఙ్మూలకముగ వానిని విమర్శించుచు ప్రజలకు తాము కోరిన మార్పులను నచ్చచెప్పుచు కాలాను సారముగ ప్రజోపయోగకరములగు సంస్కరణలను మెల్లగా చొప్పించుచుండుట సాంఘికాచారములన్నియు యిట్లే పరిణామమును పొందుచున్నవి ఇట్లు మనలో అనేకవిధము లైన సాంప్రదాయములు మన భారతదేశములో వృద్ధి యగుచువచ్చినవి

మన హైందవ మతమనునది ఒకటి లేనేలేదు ఖురాన్ బైబిల్ జెండుఅవస్థా మొదలగు మతగ్రంథములవలెనే పూర్వము ఆర్యమతము దానికి వేదములు ప్రధానములు. ఈవేదము లనంతములనియు వీని తరువాత వచ్చిన మంత్ర ములు బ్రాహ్మణములు సంహితలు, సూత్రములు, స్మృతులు, పురాణములు మొదలగు వానిలో నుదహరించబడిన ధర్మము లన్నిటికి పునాదులు సూక్ష్మముగ యీవేదములలోనే కల వనియు, మనవారి యభిప్రాయము నిజమేనుగా సుమారు నాలుగువేల యేండ్లనుండియు, అగ్రవర్ణములోచేరి విద్యలను నేర్చుకొన్న బ్రాహ్మణులు, తమ ఔన్నత్యమును నిల్పుకొను టకును, సంఘమును కొన్ని కట్టుబాటులలో నుంచుటకును, అతి క్లిష్టమైన కర్మకాండను పెంచుకొని, బ్రాహ్మణ మతమను దానిని విరాలంకృతమై సామాన్యమైన ఆర్యమతమునకు బదులు స్థాపించిరి హైందవ మతమను మహావృక్షము అనేక

శృతి స్మృతి పురాణేతిహాస శాఖలతో, ఆవేద విస్తీర్ణము నంగీయే పెరిగినవని ప్రజలను నమ్మించిరి కాని యీ జ్ఞాన కర్మకాండ శాఖలన్నియు, కాలానుసారముగ, అప్పటప్పటి సాంఘిక పరిస్థితులను బట్టి వివిధరూపములను దాల్చి, ఒక దాని నొకటి పెనవేసికొని పోయినవి ప్రతి సూత్రకారుడు తాను వేదము మీదనే నాధారపడితినని ధర్మబోధలను చేయని యెడ, జనులు వానిని లక్ష్యపెట్టక పోవచ్చునని, యేది యో నొక విధముగ వేదములతో సమన్వయింప జేయుచుండిన వేదములే అన్ని మత, నైతిక ధర్మములకును పునాది. ఎవరికేది చావలెనన్నను, వేదములోని ఋక్కులకు పెడర్ధములుచేసి, సమర్ధించుకొనవచ్చును భక్తి జ్ఞాన కర్మయోగములే గాక, సకల మానవ సాంప్రదాయములు, నీతి నియమములు సాంఘికాచారములు మొదలగువాని కన్నిటికిని వేదములే ప్రమాణములు సంఘసంస్కరణవాదులు కూడ వీనినే ఆధారపరుచుకొని, తమ వాదములను సమర్ధించుకొనుచున్నారు. మన పూర్వ ఋషులే తమకు సృష్టి యుత్పత్తి క్రమమును గురించి నిజస్థితులు తెలియవనియు, హిరణ్యగర్భుడొకడుండినను, ఆయనకు కూడ తెలుసునో తెలియదో యనియు సందేహము వెలిబుచ్చిరి. కేవలము ఊహా ప్రపంచము మీదనే, మన ఉపనిషత్తులలో నిమిడియున్న జ్ఞాన కాండమంతయు నిలచినది ఇక సామాన్య సాంఘికాచారముల పుట్టుకను గురించి వేరుగ చెప్పనేల?

ప్రపంచములోని తక్కిన మతములకంటె, మన ఆర్య మతమే మన మనోస్వాతంత్ర్యమును పూర్తిగా నంగీకరించి, ఆముష్మికవిషయములలో స్వానుభవముతప్ప మరి యొక కొలగొబద్ద యేదియు నద్ద కూడ దొరకదని చెప్పియున్నది ఆర్య సమాజ బ్రహ్మసమాజములు మొదలగునవి సంఘ సంస్కరణలకే యేర్పడినవి గాని, నూతనమతములను ప్రత్యేకముగ స్థాపించలేదు మొదటి దానిలో వేదములు ప్రామాణ్యములు గను రెండవ దానిలో దేవుడు (Personal anthropomorphic God) ప్రధానుడుగను యేర్పరుచుకొనిరి మన మతములో యీ రెండు నియమములను కూడ పాటించని మహాఋషులనేకమందియున్నారు అద్వైతులు,జడాద్వైతులు (Spiritual and material monism) ఆరంభవాదులు (Atomic theory) ఉత్క్రాంతివాదులు (Theory of Evolution) భగవద్భక్తులు (Theists) చార్వాకులు (Atheism and agnosticism) మొదలగు వారెందరో మహాఋషులున్నారు కాబట్టి మనస్స్వాతంత్ర్యమును పూర్తిగా ఒప్పుకొన్నది మన మతమే అసలు, ఒక ప్రత్యేక మతమును దానిని మన మెడలకు తగిలించుకొన నక్కరలేదు అది నీతికి పునాదిగా యేర్పడనక్కరలేదు ఏ గ్రంథముగాని, యేశక్తిగాని, దైవముతో సంబంధము కుదుర్చి, అదిగాని వాడుగాని ఆమోఘముగ ఆజ్ఞలనిచ్చుచుండుననియు పొరబాట్లుండవనియు మనమేల నమ్మవలెను? అట్లు మన పూర్వ

లించెదు ఎన్నడులేదు. పంచేంద్రియములకు కనపడని వస్తువును గురించి దీర్ఘ విచారణచేసి, స్వానుభవమునకు వదలి వేసిరి. ఒక మనుష్యమాత్రులచే యేర్పరుచుకొన్న కట్టుబాట్లు శాశ్వతము లనుటలో అర్థమే లేదు. వాని నుల్లంఘించుట వలన పాపమున్నదని యిటీవల మన ధర్మశాస్త్రజ్ఞులు వ్రాయుట యంతయు ఒట్టి కల్ల.

కొన్ని కట్టుబాట్లు లేనిచో, అరాజకము సంఘములో వచ్చును, వానిని నాశనము చేయునని కొందరనవచ్చును. సంఘము యెన్నడో విప్లవసమయములలో తప్ప కొందరు వ్యక్తులచేత నడుపబడదు. దానియంతటది మామూలు మార్గమున పోవుచు, కాలానుసారముగ మార్పులు చెందుచునే యుండును. ఈ మార్పులలో ప్రజాక్షేమమునకుపకరించు వానిని, మన ప్రయత్నముతో శీఘ్రకాలములో ప్రవేశ పెట్టుటకు పాటుపడుచుందుము. కాలము పక్వమైన కొలది నూతన సంస్కరణలను ప్రతి సంఘము తనలో చేర్చుకొనుచునే యుండును. ఈ లోపుగా సంఘసంస్కరణ ప్రియులు ఓపికతో కృషి సల్పి ప్రజ సామాన్యములో మనస్స్వాతంత్ర్యము పురికొల్పి, వారి మూఢాచారములను విమర్శించుచునే యుండవలె. తుదకు సత్యము జయించి తీరును. సంఘము తాను జీవించుటకైనను నూతనపథమున త్రొక్కక తప్పదు. అట్లు కానియెడల యితర సంఘముల సంఘట్టణలో, నిలువనేరదు. పూర్వాచారపరాయణులు మూలమూలలకు త్రోసివేయబడుదురు. ఇట్టి విపరీత

ము[illegible] [illegible]కాలములో వచ్చునని తమ పెద్దలే చెప్పిరని తృప్తి నొందెద, [illegible]ప్పలములవలె పూర్వాచారములను పట్టుకొని ప్రేలా డుచుంపి[illegible] ఈనాటి సంఘసంస్కరణ వాదులు, రాబోవు [illegible] సం[illegible], పూర్వాచార పరాయణులుగ యెంచబడుదురు [illegible] [illegible]ప్రకృతి స్వభావము [illegible] ఓరిమితో కృషి సల్పుచు [illegible] కో[illegible] ఫలములు యీనాడు రాలేదని నిస్పృహ చెంద[illegible] అన్యమ[illegible]లు [illegible]కున స్వాతంత్ర్యములను, న్యాయమును కలుగజేయ [illegible]న్నవని, వారిలో కలియవలదని ప్రార్థన

[illegible] మనము మహాసముద్రములో ప్రపంచ ములో [illegible] [illegible] మతములు సారమంతయు కలదు మనలో కింతటి పరమత సహనము యితర మతములలో లేదు గనుకనే, యితర మతస్థులను మనలో కలుపుకొనవలెనని ప్రయత్నించము వారికిని మోక్షము కలిగితీరునని మనము భావించెదము సాంఘికాచారములు యెంత భిన్నమైనను, విశ్వమానవకోటి నైతిక పథమును త్రొక్కుచు, అభివృద్ధి నొందుచునే యున్నది కాబట్టి మన సాంఘిక వ్యవస్థలను మార్చుకొనుటచేత, యెట్టి పాపము మనకు సంభవించదు బుద్ధుడే భగవంతుని యవతారమని మనవారు పరిగణించి నపుడు యిక చెప్పవలసిన పనియేమి? ఆ మహానుభావుడు చెప్పిన త్రోవను మన సాంఘిక విషయములలో మనమేల నడువరాదు? కృష్ణుడు తన్ను భజించుచున్నయెడల, తన్నే పొందుదువనియు, సర్వ ధర్మములను వదలి, తనొక్కనినే శరణు

నొందుదుమనియు, తాను సర్వపాపములనుండి ముక్తిని చేయుదు ననియు అర్జునున కుపదేశించెను. బుద్ధదేవుడు, బ్రాహ్మణుల కర్మకాండమునంతయు త్రోసివేసి, వర్ణభేదములను సడలగొట్టివేసి, సమస్త భూతములయందు ప్రేమను బోధించి నైతిక పథమును త్రొక్కుటవలన, జన్మరాహిత్యమును కలుగజేసిన ప్రతిమానవుడును నిర్వాణపథమునకు రాగలుగునని బోధించెను. ఈయిరువురి ఉపదేశములలో సంఘసంస్కరణల కవకాశమున్నదేమియు లేదు. ప్రజలలో సత్యమైన జ్ఞానాంకురములు వెలసిన నాడు, యీ ప్రస్తుతకర్మకాండ, ఆచారకాండ, వర్ణాశ్రమ ధర్మములు, మూఢాచారములు, అలవాట్లు, సాంప్రదాయములు, పట్టింపులు, మొదలగునవి యన్నియు పటాపంచలై పోవును

## అస్పృశ్యతా నివారణము

### 19వ అధ్యాయము

అస్పృశ్యతను నివారించవలసినదని కొద్దిమంది పూర్వాచారపరాయణులు తప్ప అన్నివర్ణములవారు అంగీకరించిన విషయమే. కాని దానివలన కలుగు ఫలితములను వీరిలో కూడ బహుమంది గ్రహించినట్లు కనుపడదు. అస్పృశ్యత నివారించుట యనగా మాలమాదిగలనుకూడ బ్రాహ్మణులతో కూడి సమానముగ ప్రవర్తింపచేయవలెనన్నమాట. వీరికి

కూడ వేదశాస్త్ర పఠనము, తక్కిన వర్ణములతో భోజన ప్రతిభోజనము, వారిండ్లలో వంటలు చేయుట, వారితో వివాహములు జరిపించుకొనుట, మొదలగునవి యీ అస్పృశ్యతా నివారణలో చేరియున్నవి ఇదియే స్వామి దయానందులవారి బోధన ఆయన స్థాపించిన ఆర్యసమాజికుల మతము వేదమే వీరికి ప్రామాణ్యము మంత్రసూత్ర స్మృతిపురాణేతి హాసములు సత్యములుకావు ఇవియన్నియు పౌరుషేయములు వేదము ఒక్కటియే అపౌరుషేయము మొదటివానినికూడ మనము ప్రమాణములుగా ఒప్పుకొన్నయెడల వానిలో విధించిన వర్ణాశ్రమ ధర్మములను ఆయావర్ణములవారికి చెప్పిన విధులను మనము ఒప్పుకొని తీరవలెను వీని ప్రమాణమును ఒప్పుకొననపుడు ప్రపంచములో యేమానవునిగాని మాల మాదిగల మాటయేల "నీవింతవరకే పోవలెను ఆపైన నీకు పోవుటకు అధికారములేదు" అని యనవచ్చునా? అట్లు అనుటకు వేదములో యెట్టి ఆధారములేదు గనుకనే స్వామిదయానందులవారు మాలలనే గాక క్రైస్తవులను, మస్లిములను, పార్శీలను, మొదలగు జాతులవారినందరిని ఆర్యమతములో కలుపుకొనుటకు నిశ్చయించెను అట్లే యీసమాజికులు అనేక వర్ణములకును జాతులకును సిద్ధినిచ్చుచున్నారు ఎవరికి తగినట్టియు యిష్టమున్నట్టియు ఆశ్రమములో వారినుండవచ్చుననిరి కాబట్టి మాలమాదిగలుకూడ సత్వగుణ ప్రధానులై అంతః శ్శుచి బాహ్యాశ్శుచి కలిగియున్నపుడు బ్రాహ్మణులే యగుచు

న్నారు. కొంపలు చేయుటలో బ్రాహ్మణులను శూద్రులు గనె, ఆయన సిద్ధయింటారు.

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు శలవిచ్చిరి. "సాంఘిక బెడదము లంతరించనిదె స్వరాజ్యమున కర్హులముకాజాలము" అను గాంధిమహాత్ముని వాక్యమును జ్ఞాపకము చేసిరి. "కులభేదములవలన భారతదేశము బహుభంగుల పీడించబడుచున్న" దని" వారునడివిరి. సర్వమానవకోటిని, సౌభ్రాతృత్వముతో సేవింపుమని చెప్పిన సనాయే ప్రశ్న. కొవ్వూరులోని ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము లో కమ్మవారికి వ్యాకరణశాస్త్రముకూడ నేర్పకూడదని ఒక ఉపాధ్యాయుడు లేచిపోయెను. ఇక వారికే వేదశాస్త్రపఠనము కూడనప్పుడు, మాలమాదిగలకు వేదము చెప్పుచు, దేవాలయములలోకి మరవారు రానిచ్చెదరా? న్యాయమూర్తి రామేశంగారి తీర్పుప్రకారము దానికి అర్హతకూడ వచ్చినది. ఆచారము ప్రధానము గనుక, కావలసియుంటే, యీ మాలమాదిగెలను వేరుగ దేవాలయములను కట్టుకొమ్మనిరి. మహాత్మ గాంధిగారు మనవర్ణాశ్రమధర్మములను గురించి యిట్లు శలవిచ్చిరి. "బ్రాహ్మణత్వమును మనము సంస్కరించవలెనుగాని, దానిని పడద్రోయకూడదు. బ్రాహ్మణుడు ధనసంపాదనకును, స్వలాభమునకును యెప్పుడు పాల్పడునో, అప్పుడే అతను పదచ్యుతుడైనాడు. అతని విద్యలుమాత్రము నేను నిరసించను. కాని అతనివిద్యవలన తాను, అధికుడనని చెప్పుకొనకూడదు. విద్యకు అతనిని గౌరవించవచ్చునుగాని, నావర్ణముకంటె అతనివర్ణ మెక్కు-

వదని నేను ఒప్పుకొనను* దీనినిబట్టి మాలవాడైనను విద్యా వినయములవలనను, సదాచార సంపన్నుడైనపుడును అతని కేల బ్రాహ్మణత్వము రాకూడదు? ఇది ప్రతిశూద్రునికిని కూడ యేలవర్తించదు? ఈమాటలు సనాతనధర్మవాదులకు కర్ణకఠోరములని నేనెరుగుదును. వీరు అనేక వేలసంవత్సరముల క్రిందట చనిపోయిన వారితోనే గాక, సుమారు ఒక వేయి సంవత్సరముల క్రింద మృతులైన మతగ్రంథకర్తలతో సహవాసము చేయుచు, వారిశ్మశాన వాటికలలో, యెముకలను యేరికొని, వానిని మహాప్రసాదమని యంగీకరించు మహానుభావులు.

మన అస్పృశ్యతానివారణ వాదులు బాగుగా యోచించుకొన్నచో, దయానంద సరస్వతి స్వాములవారి ఒక్క శ్రుతి మాత్రమే అపౌరుషేయమను వాదమునుకూడ త్రోసిపుచ్చి, ప్రపంచములోని మతములన్నియు, మనుష్యులవలెనే, పరిణామమును పొందినవనియు, భగవంతుడీన్ని భిన్నమతములను, మనలో తగవులు పెట్టుటకు సృజించడనియు యెంచినగాని, మన నాగేశ్వరరావు పంతులుగారి మానవసౌభ్రాతృధర్మము గగనకుసుమము. నా వంటయింటిలోకి వచ్చి నాతోకలసి భుజించుటకు యేమానవసోదరునైనను ఆహ్వానించజాలని యెడల అతనికి నాకు సౌభ్రాతృత్వమెక్కడ? అతనికిని నాకును ఆహారనియమములలో శౌచాశౌచములలో కొంత భేదముండును గాక! అన్యోన్యవివాహములకును, భోజన ప్రతిభోజనములకును

ఆటంకము లేనప్పుడే నిజమైన మానవసౌభ్రాతృత్వ మేర్పడును వేరా విషయములలో పరస్పరభేదము లుండుగాక ప్రకృతిలో వలెనె యేయిద్దరు మనుష్యులు అన్ని విషయములలోను యేకాభిప్రాయులు కారు కాని ఒకదేశములోని ప్రజలు సాంఘికార్థిక రాజకీయవిషయములలో పలువిధముల భేదాభిప్రాయములు కలవారైనను మతమను పేరున ఒండొరులతో కలియకుండ దృష్టిదోష, అంటుదోష, పంక్తిదోష, వాయుదోషములను పాటించునపుడు వారికి ముక్తి యెక్కడ? మానవసౌభ్రాతృత్వ మెక్కడ? ఇట్టి పట్టింపులు యీ భారతదేశములో ప్రతివర్ణములోన, దాని వివిధశాఖలలోను పెచ్చుపెరిగిపోయి అన్యోన్యవివాహములకును భోజన ప్రతిభోజనములకును అనుల్లంఘనీయమైన ఆటంకములు కలుగజేయుచున్నవి ఈ విషయములో ప్రపంచ మంతటిలోను మనభారతదేశము అగ్రస్థానము వహించినది దీనికి కారణము బ్రాహ్మణమతములోని వర్ణాశ్రమ ధర్మసూత్రములే అసలు ఆర్యమతము, లేక వేదమతములో యిట్టి పిచ్చిభేదములు లేవు అస్పృశ్యతానివారణను కోరువారందరు యిట్టి భేదములను లేకుండ చేయుటకు సిద్ధపడవలెను ఇతరదేశములలో కూడ కొన్ని సాంఘికపట్టింపులు లేకపోలేదు కాని, మనలోవలె శిలారూపము దాల్చిన విభాగములు లేవు ఇక నన్యమతముల వారిమీాది ద్వేషము నశించి మానవసౌభ్రాతృత్వము పూర్తిగా నెలకొల్పవలెనన్న ఈ వివిధమతములన్నియు పౌరుషేయము

లని యెంచి వీనిలోని మూఢనమ్మకములను, అతిశయోక్తులను పిట్టకథలను అభూతకల్పనలను, నిరర్థకాచారకాండలను కఠినముగ విమర్శించుటయే దీనికి సిద్ధపడనివారు, అస్పృశ్యతా నివారణమను మాటయెత్తనే కూడదు వారు ప్రతిపాదించు సూత్రమునకు యిప్పటివర్ణాశ్రమధర్మముల నిరాకరణమే ఫలముగనుక, ఈ విషయమును గమనించి మాట్లాడవలయునని ప్రార్థించుచున్నాను మాలవానిని ముట్టుకొనవచ్చుననియు తరువాత జందెములు తెంపుకొని స్నానము చేయనక్కరలేదనియు దీనియర్థము కాదు నీకుగల విద్యయు నీకుగల సాంఘిక హక్కులు అతనికిని కలుగజేయవలెనవట మన బ్రాహ్మణమతము దానికి దాసులై, దీనికి యేసర్వమువారును, ప్రస్తుతము ఒప్పుకొనకుండలేము దీని కంతకును ఈ హైందవమతమే కారణము కాబట్టి మానవసౌభ్రాతృత్వమునకు, వివిధమత నిర్మూలనమే ప్రధానము

మహాత్మా గాంధీగారు తలపెట్టిన కార్యమువలన, యిప్పుడు కొనయూపిరితో నున్న స్మృతులలో వివరింపబడ్డ వర్ణాశ్రమధర్మములు, యింకను యెక్కువగ సడలిపోయి నశించుట నిశ్చయము భరతఖండములో దక్షిణదేశములో యే కొద్దిమంది వైశ్యబ్రాహ్మణులలో తప్ప ప్రస్తుతము వాడుకలో లేనట్టియు పునరుద్ధరింపజాల బడనట్టియు పూర్వపు వర్ణాశ్రమధర్మము లన్నియు యీ కాలములో మృగ్యము లగుచున్నందుకు మనము చింతింప నవసరములేదు. మహాత్ములవారు

నెలవిచ్చినన్ని నూతనము లన్నియు ఆయా జాతుల విశ్వాసములను బట్టి వేరుగా కనబడుచున్నవి. దాని యొక్క మహావృక్షము యొక్క శాఖలవంటివి. ప్రతిశాఖయు మొలకలు చిగుర్చుచు, దాని అనుకూలానుకూలవాతావరణములను బట్టి వృద్ధిక్షయములు మార్పులు గాంచుచుండును. కాని, వీని కన్నిటికి పునాదులైన నీతిధర్మములే సనాతనధర్మములని నాకనిపించును. ఇవియు పరిణామమును పొందె, వివిధమతములవారిచే అంగీకరింపబడుచున్నవి. ఈ నైతికధర్మములు గాక, వేరుగా కొన్ని సామాజిక ధర్మములు, ఆయాసంఘములలోని ఆచారవ్యవహారములను బట్టి కొంతకాలము ప్రచారములో నుంటూ అవి కాలక్రమమున దేశకాలపాత్రానుసారముగ మారుచుండును. సనాతనధర్మవాదుల మని చెప్పుకొనేవారు యీ పై భేదమును పాటింపక రెండుమూడు వేల యేండ్లక్రిందట నాచరణలో నున్న స్మృతులలోని సామాజిక ధర్మములను, హైందవ మతముతో సంపుటీకరణముచేసి వాని నెల్లప్పుడు, యెట్టి మార్పులను చేయక ఆచరింపబడవలసినదే యని వాదించెదరు. కాని వీరివాగ్దౌర్బల్యము వీరిదినచర్యవలననే స్పష్టమగుచు, వీరి వాదనల కెట్టి విలువయు ప్రజలీయడలచలేదు. కాబట్టి యీ కొద్దిమంది సనాతనధర్మవాదులు, గుంజు పోగొట్టుకొని, వట్టి డొల్లలను చెప్పుకొని పదలుకొనజాలరు గనుక వీరితో మనము వాగ్వాదము, శాస్త్రచర్చ, చేయుట నిష్ఫలము.

అస్పృశ్యత యను పూర్వపు సామాజికధర్మము పశ్చా

స్త్రములు ప్రమాణమైన నొకకాలమందు విధిగా ఆచరింపబడుచున్నను, దాని నీకాలములో బాలించుటకు మన కధికారమున్నది కాని, యీ యుద్యమములోని నాయకులు, ప్రచారకులు, తమ గృహములలో యీపంచములను ప్రవేశపెట్టనెప్పుడైన ఒకమారైన పిలుచుటకు ప్రయత్నించెదరు? తమ యిండ్లకు బయట పేద పంచములను తాకెదరా వారితో కలసి భుజించెదరు వారిని పల్లె దేవాలయములలోనికి చొరబెట్టెదరు. చెరువులు, బావులు, పాఠశాలలు, స్కూళ్లు మొదలగు చోట్లకు రానిచ్చెదరు? అంగీకరించుట గ్రుడ్డిలో మెల్లయైనను యీప్రచారకులు, పంచములను, తమ శూద్ర సేవకులవలెనైనను, వంటగది లోనికి తప్ప మిగిలిన గృహాంగణములలో రానిచ్చుటకు యేర్పాటు చేయగలిగిరా? అక్కడ శూద్రాదులవలె తమ్మును చూచుచున్న యెడల పంచములు తృప్తినొంది, తాముకూడా హైందవ సంఘములో ఒక గౌరవార్హమగల భాగమని యెంచెదరుగాని, అంబేద్కరుగారు చెప్పినట్లు యీపై మెరుగులకు పంచములెన్నటికి ఉబ్బి తబ్బిబ్బులుకారు. ఈనాయకులు ముందుగా తమ స్త్రీలనే యీసంస్కరణమున కొప్పించజాలనపుడు యితరుల నొప్పింపగలరా? మన స్త్రీపురుషులు వారి యెడల యిట్టి అసహనము ప్రతిదినము కనబరచుచున్నపుడు వారు అన్యమతస్వీకారమునకు గడంగిన తప్పేమి? వారికి అన్నము, బట్ట, విద్య, ఆరోగ్యము, గౌరవము మొదలగునవి కావలెనుగాని, గుళ్లలో రాళ్ల దర్శనముకాదు. క్రైస్తవమి

పనరీలవలె మనము వారికి బంజరు భూములు సేద్యమున కిప్పించితిమా? సెటిల్మెంటుల నేర్పాటుచేసి, పాఠశాలలు, ఆసుపత్రులు కట్టించితిమా? తక్కిన శూద్రులతో పాటైనను వారియెడల దయాదాక్షిణ్యములు చూపించితిమా? గవర్నమెంటు ఉద్యోగీయులకు శిఫారసుచేసి మనకుగల పలుకబడితో వారికి న్యాయమైన సౌకర్యములను చేసితిమా? మన హైందవులు ఆధ్యాత్మికసాంప్రదాయకులమని విర్రవీగుటయేగాని, ఆధిభౌతికపాశ్చాత్య జాతులవలె కోట్లకొలదిధనము ఖర్చుపెట్టి వారికొరకు లోకోపకారసంస్థల నేవి యేర్పాటుచేసితిమి? భగవద్గీతలోని యుపదేశములు వారి నెట్లు ఉద్ధరించగలవు? వీరిని బానిసలుగ బ్రాహ్మణుల కంటె. బ్రాహ్మణేతరులే చూచుచున్నారు బ్రాహ్మణుడు దూరముగనుండి వీరిని బ్రతిమాలును. బ్రాహ్మణేతరవ్యవసాయకుడు, వీరు సరిగా పనిపాటలు చేయలేదని కొట్టును ప్రతిగ్రామములో యీ పంచము పాలెమ్లను ప్రశ్నించిన నిజము బోధపడగలదు

## శాస్త్రచర్చ—అస్పృశ్యత

మన స్నేహితులు కొతా సూర్యనారాయణ రావుగారు అస్పృశ్యత విషయమై యేర్పరచిన పండిత సమావేశములోని శాస్త్రచర్చను చదివితిని ఇట్టి శాస్త్రచర్చలవలన సత్యము తేలకపోగా, జనసామాన్యములో సందేహములు కెడమిచ్చుచున్నవి దీనికి ముఖ్యకారణములు (1) శాస్త్రములు సంస్కృతభాషలో నుండుట, (2) వానిలో ఆయాకాలములనుబట్టి

పరస్పర విరుద్ధములుండుట, (3) అర్ధవాదములకు తావుండుట, (4) ఇట్టి చర్చలో పాల్గొనువారు తమ పట్టినపట్టు విడువక తమ వాదనయందే సత్యమున్నదని నమ్ముట, (5) కాలానుసారముగ సంఘములో మార్పులు చేసికొనుటకు సనాతన ధర్మవాదులు బొత్తిగా అంగీకరింపకపోవుట ఈ మొదలగు కారణములనుబట్టి యీ శాస్త్రచర్చలు అనుపయోగకరమని మనము గత నూరు సంవత్సరముల భారతదేశ సాంఘిక చరిత్రవలన తెలిసికొనియే యున్నాము ఐచ్ఛికముగ జరిగించుకొనుటకు నూతన చట్టములను బహుజనాభిప్రాయమును బట్టి యేర్పాటు చేసికొనుచుండవలెనే గాని, పూర్వాచార పరాయణులను గాని నవనాగరికులనుగాని ఒప్పింప ప్రయత్నించుట శుద్ధ పొరపాటు దీనిలో మహాత్ముడుకూడ పడినందుకు విచారముగనున్నది ఈయన వెనుకనే శలవిచ్చినట్లు, యే శాస్త్రమైనను అస్పృశ్యతను నిలవబెట్టినయెడల, దానిని త్రోసిపుచ్చుటయే మన విధి. సాంఘికాచారములను, మతములనెడి కేవల నమ్మకములతో ముడిపెట్టుటయే తప్పు. మానవసౌభ్రాతృత్వమునకు యే శాస్త్రమైనను గొప్ప యాటంకము కలుగజేయునపుడును, ప్రపంచములోని అనేక యితర జాతులలో యిట్టి యస్పృశ్యతాచారము లేనపుడును, మన హైందవశాస్త్రములు మాత్రము యిట్టి న్యాయవిరుద్ధమైన పిచ్చి ఆచారము నిలబెట్టవలసినదని నిర్బంధించినను, వానిని తప్పక త్రోసివేయవలసినదే ఇట్టి వానిని మనము

ఉల్లంఘింపగూడని ప్రమాణములుగ గ్రైకొనకూడదు

జనసామాన్యమును ఒప్పించుటకు ఒకానొకపుడు శాస్త్రబలము కూడ తోడగునని కొంద రెంచెదరు నేను వీరితో యేకీభవింపను ప్రజలకు, మత నీతిధర్మములు ప్రపంచములో యెట్లు పరిణామముల పొందినదియు బోధించి, సత్యమార్గమున వారిని నడిపింపవలెను గాని యిట్టి సందుల గొందుల మార్గమున తీసికొని పోకూడదు ఇంగిత జ్ఞానముగల ప్రతివాడును యిప్పుడు మనకు లోకములో కనుపడు వివిధ మతములు, వివిధాచారములు, సాంప్రదాయములు, నమ్మకములు పరికించిన యెడల, యివియన్నియు మానవకల్పితములనియు, మన సంఘాభివృద్ధికి, కొన్ని సంస్కరణలను ద్రొప్పింప దలచినపుడు, యీ పూర్వపుశాస్త్రము లడ్డురాకూడదనియు సులభముగ గ్రహించగలడు. తాను, సహేతువులతో, తన సంఘములోని బహుమందిని తన వాదన నంగీకరింపజేయవలెనుగాని, యెన్నడో వేలసంవత్సరముల క్రింద, తాటియాకుల మీద అప్పటి యాచారములను లిఖించినంతమాత్రమున వానికి మన మెప్పటికిని బానిసలమై యుండవలెనని చెప్పుట మిక్కిలి హాస్యాస్పదమైన విషయము. కాబట్టి యీ శాస్త్ర చర్చ మన కెంత మాత్రము అగత్యములేదు.

## 20 వ అధ్యాయము

సనాతన ధర్మవాదులమని చెప్పుకొను నామమాత్ర బ్రాహ్మణులు, శారదా ఆక్టును రద్దుపరచుటకు మీటింగులు చేసి, బ్రాహ్మణమతమునకు అపాయము తటస్థించబోవు చున్నదని, తీర్మానములను చేయవచ్చును గాని వానికి విలువ సహేతువులు కనుపరచజాలనపుడు, యెంతమాత్ర ముండదు ఈ చట్టమును చేసినది విదేశప్రభువులుకారు మన శాసనసభ్యులలో మెజారిటీ వలననే యీ చట్టము కావింపబడినది ఈ సంఘసంస్కరణ విషయములలో, విదేశప్రభువులు తూష్ణీంభావము వహించుట వలననే, యింతకాలము యీ మూఢాచారములలో మనము పడియున్నారము మన ప్రభువులే యున్న యెడల, యీ పాటికి యెన్నిధర్మజ్ఞసభలో బయల్వెడలి, యీ పూర్వాచారపరాయణుల ముక్కులకు త్రాళ్ళు బిగించియుందురు నేటికిని మైసూరు బరోడా సంస్థానాధిపులు యిట్టి సంస్కరణలను బలవంతముగ ప్రవేశపెట్టియే యున్నారు ప్రతి విషయములోను భేదాభిప్రాయములుండనే యుండును కాని ప్రజాసామాన్యము యొక్క క్షేమమును విచారించి, మనప్రజాప్రతినిధులలో మెజారిటీ వారు తీర్మానము చేయునవి మనపూర్వధర్మజ్ఞసభలు, దేశకాలపాత్రానుసారమును బట్టి చేయబడు

చుండినప్పటికీ, ఇట్టి రాజశాసనమును ధిక్కరించకూడదు ప్రజా సామాన్యమున కయిష్టమైన పనులుచేసి యే రాజ్యము నిలువ నేరదు కాని మైనారిటి వారి మూలాధారమైన హక్కులకు భంగము కలుగచేయకూడదు మన మతములో సహగమ నము, శిశుబలులు, నరబలులు, శక్తిపూజలు, దిగంబరత్వ ములు, యింకను కొన్ని యవినీతికరములగు పనులను మంత్ర తంత్రముల గుండా అంగీకరింప బడియున్నవి వినిని బలవంత ముగ చట్టములచేత ఆపివేయబడినప్పుడు వివాహవయోనిర్ణ యము చేసినంత మాత్రమున మిన్నువిరిగి తలపైబడినట్లు యీ సనాతనధర్మవాదులు చేయుచున్న ఆందోళనమున కర్థమే లేదు ఈ బాల్యవివాహములవలన స్త్రీలవిద్యకును ఆరోగ్య మునకు భంగకరమని ప్రజాసామాన్య మంతయు అంగీకరించి నపుడు, ముప్పది యైదుకోట్ల ప్రజలలో, వైశ్యబ్రాహ్మణులలో కొద్ది లక్షలమంది తమ మతము తమ్మెన్నెల్లపుడు యీ ప్రస్తు తస్థితిలోనే యుండుమని చెప్పుచున్నదనుట పాటింపదగినది కాదు హానికరమైన ఆచారములను బహుజనాభిప్రాయమును బట్టి మార్చుకతప్పదు

ఈ మధ్య బెజవాడ చిత్తూరు కుంభకోణము మొదల గు పట్టణములలో, సనాతన ధర్మవాదులమని చెప్పుకొను బ్రాహ్మణబ్రువుల సభలు జరిగినవి వీరి హేతువులు చరిత్ర చరిణములు. అనేకులచేత ఖండింపబడియున్నవి. కాని యెంత చితకబాదినను, యీ పాము తన తలను యెత్తుటకు ప్రయ

త్నించుచునే యుండును కాని దీనిని లక్ష్యపెట్టు వారు లేరు ఈ సనాతన ధర్మవాదులు, సత్యాగ్రహము జరిపెదమని బెదరించుటకు మొదలుపెట్టిరి వీరి మాటలు కోటలు దాటినను గాని, వీరి సత్యాగ్రహమును యెదుర్కొను బ్రాహ్మణులే యనేకమంది యున్నపుడు, అది జయప్రదము కానేరదు వీరందరు జయిలుకు మాటిమాటికి పోదలచినచో, రేపు ప్రతిదొంగయు, ప్రతి అవినీతిపరుడును, కొంతమందిని తనలో చేర్చుకొని సత్యాగ్రహము చేసెదనని బెదరించు చుండవచ్చును అప్పుడు రాజ్యమే సాగదు అరాజకత్వము బయలుదేరును మెజారిటీ వారి మాటలను విననప్పుడు, ప్రజాస్వామిక ప్రభుత్వమే యుండదు ఈ పూర్వాచారపరాయణులు రాజకీయ సంస్కరణల కత్యుత్సాహముతో బయలుదేరుదురు గాని, వానికి ముఖ్యాధారమైన సాంఘికసమస్యలను పరిష్కరించుకొనుటకు వెరతురు వీరికి కెమిల్‌పాషా, లెనిన్, ముస్సోలిని మొదలగు నిరంకుశప్రభువులుండి గుణపాఠములను చేర్పవలసి యున్నదిగాని, సౌమ్యముగ యెంత బోధించినను, వీరి చెవుల కెక్కునట్లు తోచదు వీరు టర్కీ, చైనా, పెర్షియా రష్యా మొదలగు దేశములలో యెట్టి సంఘసంస్కరణలు, ప్రజాక్షేమమునకు బలవంతముగ కూడ చొప్పించబడు చున్నవో గమనించుచున్నట్లు కనపడదు

ఈ కాలములో, ముస్లిము మౌల్వీలకును, హిందూ సనాతన ధర్మ పండితులకును స్థానము లేదు. సహేతువులు

లేని వీరి యాందోళనము, కొంతకాలము జయప్రదమైనను, తుదకు తుడిచిపెట్టుకొని పోక తప్పదు ప్రజలను ఒప్పించజాలని వీరి శూన్యమైన తీర్మానముల కేమి విలువ? తమ బ్రాహ్మణ వైశ్య సంఘములకైన, ఐచ్ఛికముగ యీ సంస్కరణము వర్తింపకుండగ చేయవలసినదని వీరి కోరిక వీరి తీర్మానములో నుపహరించిన హేతువులెన్ని? (1) వీరి మనస్సునకు కంటగింపుగా నున్నదట! (2) ఈ చట్టమున కవసరమే రాలేదట! (3) ఇది శృతి స్మృతులకు విరోధమట! (4) పరిపాలకులు మత విషయములలో, తటస్థులుగా నుండవలెనట! (5) స్త్రీలు ఋతుమతులు కాగానే వారికి నిషేకము చేయుట ఆరోగ్యమని గొప్ప శాస్త్రజ్ఞుల అభిప్రాయమట! వీని నన్నిటిని అనేక సార్లు, ఖండించియే యున్నారు వీనిలో 1, 2 హేతువులు నిలవవు కొందరు అల్పసంఖ్యాకుల మనస్సులకు కంటగింపు గలిగినంతమాత్రము చేతన, వారి కవసరము కనపడనంత మాత్రము చేతను, ప్రజాక్షేమమునకు భంగకరమగు ఆచారములను త్రోసిపుచ్చక తప్పదు. మూడవ హేతువు అనగా శృతి స్మృతులకు యీ చట్టము విరోధమను విషయమై సంఘసంస్కరణవాదులకు, వీనిలో ఒక్క కారికయైనను, రజస్వలానంతరవివాహమును ఆమోదించిన చాలును ఒక్క ప్రమాణమైనను వీరికి దొరకదని యీసనాతన వాదులు తమ రొమ్ము మీద చేయివేసి చెప్ప సాహసించగలరా? నేను వ్రాసిన వర్ణాశ్రమధర్మ పరిణామమను గ్రంథమును, యితరు లనేక మంది

ముప్పది సంవత్సరముల నుండి వ్రాయుచుండిన వ్యాసములను, దీనిని గురించి జరిగిన చర్యలను, వీరు చదివియున్న యెడల, కావలసినన్ని పూర్వపక్ష సిద్ధాంతము లున్నవనియు దీనిని ఆమోదించు ప్రమాణములుకూడ నున్నవనియు వీరికి గోచరించియే యుండును. బెజవాడలో చేరిన 500 పండితులలో కొందరికయినను యిది తెలియక మానవు అట్లుండియు, శృతి స్మృతుల కన్నిటికిని యీసంఘసంస్కరణము వ్యతిరేకమని యిట్టి సత్యదూరమగు పలుకులతో యిట్టితీర్మానము చేయుట మిక్కిలి విచారజనకమైనది ఈపండితులు స్వగౌరవమును పోగొట్టుకొనిరి రజస్వలానంతర వివాహమును ఖండించు అనేక స్మృతివాక్యములకును ప్రస్తుతాచారములకును వీ రెక్కువ ప్రాముఖ్యత నిచ్చినయెడల వీరి నింతగా నిందించవలసిన యవసరము లేదుగాని, శృతి స్మృతులన్నియు నేకవాక్యముగా వీరి వాదనలను బలపరచు చున్నవని వీరు సాహసముతో పల్కు వాక్యములకు ఒడలు మండుకొని పోవుచుండును ఇట్టి అబద్ధపు ప్రలాపములకు తగిన శిక్షలు వీరికి యీలోకములో లేవని మాత్రము విచారించుచున్నాను ఇట్టి వారితో శాస్త్ర వాదనలో యెన్నడు దిగకూడదు తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళని వాదించు దురభిమానులు, మూర్ఖవాదులతో శాస్త్రచర్చలేమి ప్రయోజనము? శ్రుతులు స్మృతులు సూత్రములు, యివియన్నియు సమాన ప్రమాణములనియు, వీని నన్నిటిని శిరసావహించ వలెననియు వీరి వాదమైనపుడు

వీనిలో ఒక్కకారిక సంఘసంస్కరణ వాదులకు దొరకినను, యీ పూర్వాచార పరాయణులు నోళ్ళు మూయవలసినదే కదా! వీనికన్నిటిని యేకవాక్యతకల్పించుటకు యెంత పెడర్ధములు వీరు దీయవలెనో చెప్పుడు. ఎట్లు పూర్వాచార పరాయణులు వీరు నోళ్ళు మూయనలేదు వీరి కిన్నిటికిని సరసమైన యుద్ధము పెనగ యెడల, యీ మతాచారములు క్రమ క్రమముగా, ఆయాకాలముల స్థితి గతులను బట్టి పరిణామము పొందినవనియు, కాలానుసారముగ మార్పుల నొందుచున్నవనియు స్పష్టముగా కనపడుచుండగా, యేల యీ పెడివాదన చెసెదరు? నోరున్న వానిది రాజ్యమా? ఊరక ఆందోళన చేయుచు, ప్రతి చోటను కొందరు విమర్శ జ్ఞాన శూన్యులైన పండితులు గుడిగుడి గుంచం గుండారాగం గా చేరి తీర్మానములు చెయుచుండుట వలన మోసపోవువారెవరు? బెజవాడలో యిండియా అంతటనుండి 500 మంది పండితులు సమావేశమై శ్రుతి స్మృతులన్నిటికిని, యీ రజస్వలానంతర వివాహములు విరోధములని, తీర్మానములో వ్రాయించరికదా! వీరిలో ఒక్కరు నిలబడి, వీరి వాదనకు విరోధించు ఒక్క ప్రమాణమైనను లేదని ప్రమాణము చెయమనుడు నేను యీ విషయములలో అల్పజ్ఞానినైనను యెదురొక్కనుచున్నాను. అసలు వీరిలో శృతి స్మృతుల ప్రకారము నడచుకొను బ్రాహ్మణు డున్నాడా యని నాకు సందేహము ప్రతి దినము వేదము చదివి వేదార్ధమును తెలిసికొనని వాడు బ్రాహ్మణుడు కాడు సరికదా వాడు పశువు. నరకమున బడు

చున్నాడు ఈ బ్రాహ్మణ లాయర్లు, సర్కారు నౌకర్లు నిజ
మును మరుగుపరుచుట, అబద్ధమును పురికొల్పుట, శూద్రుల
క్రింద కొలువుండుట, సత్యాహింసలు వదలుకొనుట, మొద
లగు పనుల వలన వీరికి రౌరవాది నరకప్రాప్తి కలుగవలసిన దే
కదా! వీరిలో నిక ధర్మజ్ఞు లెవరు? కర్మకాండ ప్రాయశ్చిత్త
కాండల ననుసరించి, వీరు బ్రాహ్మణులే కారని ప్రతి దినము
వీరు చేయు దినచర్యల వలననే స్పష్టము ఈ చట్టము వలన
వీరి మతమునకు భంగము కలుగుచున్నదని చెప్పు వీరి
మాటలను పాటించువా రెవరు?

ఇక నాల్గవ హేతువును గురించి పైన చర్చింపబడియే
యున్నది ప్రజాక్షేమమునకు మన ప్రతినిధులలో మెజారిటీ
చేతనే, యీసంస్కరణలు, సంఘములో చొప్పించబడక
తప్పదు ఆర్యమత విశ్వాసములకును, వ్యక్తి మనస్వాతంత్ర్య
ములకును, స్వదేశ పరిపాలనకైనను భంగము కలిగించుటకు
దేవుడు, వయ్యము ఆత్మానాత్మ విచారము, సగుణ నిర్గుణో
పాసనములు, స్వర్గ నరకములు, పునర్జన్మము, కర్మ, భక్తి,
జ్ఞానయోగములు మొదలగు ప్రాత సాంప్రదాయములకు ఆచా
రములతో, యే నాగరిక పరిపాలనము జోక్యము కలుగజేస్కి
కొనదు ఇవియన్నియు ఆయా మతముల పునాది సూత్రము
లతో సంబంధించినవి కాని ప్రజల నీతిని, ఆరోగ్యమును ధిక్క
రించు ఆచారములను పారద్రోలుటకు నిర్బంధ చట్టములను
వ్రాసుచేయవలసియున్నది ఇక సంఘాభివృద్ధికి, ఐచ్ఛికమైన

చట్టములను అనగా వివాహచ్ఛేదనము, మతాంతరవివాహ ములు, అన్యమతి స్వీకారము, దాయార్హతను తొలగించకుండ చేయుట, స్త్రీల హక్కులను పెంపొందింప చేయుట, అస్పృశ్య తను నివారించి, నిమ్నజాతుల కందరికిని యిప్పుడు లేని హక్కుల నొసంగుట, మొదలగు వానిని గురించి చట్టముల నేర్పరుపక యెప్పుడు అట్లు శీఘ్రముగ జరిగించనివో రాజకీయ సాంఘిక విప్లవములు తప్పక బయలుదేరి, దేశములో అరాజ కము సిద్ధించును వర్ణసంకరమగుచున్నదని సనాతన ధర్మపరుల మని చెప్పుకొను యీ బ్రాహ్మణ బ్రువులు, యీ నేతిబీర కాయలు, ఎటుకమాటకు మొఱబెట్టుకొను వారందరు, మూలకు త్రోయబడుదురు ఈ వర్ణసంకరమే యీశ్వరోద్దేశమనియు యీ కలికాలములో తప్పక సంభవించుననియు వీరి పుక్కిటి పురాణములో నున్నదని నమ్ముచున్నపుడు, వీరు దానికి యెదురీదనేల? యేమి లాభము? ఈయాందోళనవలన ప్రయోజన మేమి? మేము భగవంతుని యుద్దేశ్యమును సరిగా నెరుపడలచుచున్నాము. ఈ కృతయుగ పురుషులు యీపూర్వాచారములను నిలబెట్టబడలచుకొనుట యీశ్వరోద్దే శ్యమునకు ద్రోహము చేయ ప్రయత్నించుటయే కదా? కాబట్టి వీరందరు కడుశీఘ్రముగ యేయడవులకో పోయి, ముక్కుమూసికొని, మోక్షమార్గము నన్వేషించుచు కాలము గడపుట మంచిది కాని, అయ్యో యీ సంఘము చెడిపోవు చున్నదని మొరబెట్టుకొనుటవలన యీశ్వర ద్రోహులగుట

తప్ప వీరికెట్టి ప్రయోజనములేదు అయినవ హేతువులో సారమేలేదు పండ్లు వచ్చుచుండగా శిశువుచేత శనగలు నమిలించుట వంటిది చరక సుశ్రుతములకు విరోధము ఏ ప్రకృతిశాస్త్రజ్ఞుడు ఆమోదించడు

## జీవహింస, ఆత్మహత్య



### 21 వ అధ్యాయము

మచిలీపట్టణములో, బండ్లదొడ్డిలోనున్న గోరక్షణ శాలకు, అక్కడివర్తకులు కొందరు నన్ను తీసికొనిపోయి, వారి సాంవత్సరిక రిపోర్టులను నాకు కనపరచి, నా యభిప్రాయమును, వారి పుస్తకములో వ్రాయించిరి దానిలో, నాకు గలసందేహములను వివరించి, వానిని చర్చించమని వ్రాసితిని గాని, వారట్లు చేయకపోవుటచే, యీ గోరక్షణస్థాపనల యుపయోగమును గురించి నాకు తోచిన యభిప్రాయములను వ్రాయుచున్నాను

ప్రకృతిలో ఒకజీవము, మరియొక జీవమును తిని బ్రతుకుటయే స్వభావికము, పరమదయాళుడగు ఒక భగవంతుడున్నాడని యనుకొన్నను, యిట్టి విధానము నెందుకేర్పరచెనో నేను గ్రహించజాలకున్నాను కొన్ని చెట్లు పురుగులమీద జీవించును. కొన్ని పురుగులు, చెట్లను తిని బ్రతుకును కొన్ని జంతువులు, చెట్లను నమలి జీవించును మరికొన్ని జంతువులు,

భూమిమీదను, గాలిలోన, నీళ్లలోను, యితరజంతువులను భక్షించి వించుచున్నవి మానవుడు, పురుగులను, చెట్లను, ఫలములను, పక్షులను, చేపలను, జంతువులను, తనకొనేక రుచికరములుగా నున్న వన్నిటిని తిని పొట్టపోసికొను చున్నాడు. ఇదిగాక, భూమినిదున్ని నానావిధమైన పంటలను పండించుకొని, వంటచేసికొని, అనేకరుచులను కల్పించుకొని, తినుచున్నాడు. ఇది యంతయు జీవహింసయే కదా! మానవకోటిలోనే, కొందరు అడవిజాతులు, తమవారిలోని ముసలివాళ్ళను పసిపిల్లలను, విరోధులను చంపి తినుచున్నారు. ఇట్లు పరమదయాళుడు, సర్వశక్తిగలవాడు, సర్వజ్ఞుడునగు పరమేశ్వరుడు యేల సృష్టించవలసివచ్చెనో! ఇట్టి సృష్టికి బదులు ఆకలిదప్పికలు లేని జీవరాసులనే సృజించలేకపోయెనా! ఇట్టి క్రూరత్వములో ఆయనకు ఆనందమున్నదనుట కంటె, నిర్దయంతయు, ఆద్యంతములు లేని ప్రకృతిస్వభావమని సమ్మటయే సహేతుకరమైనది దీనివెనుకకు మనము పోజాలము.

మానవుడు, యితరజీవరాసులకంటె, తన మెదడును వృద్ధిచేసికొని, యెక్కువ మేధాసంపన్నుడై ప్రకృతిరహస్యములను క్రమక్రమముగా తెలిసికొనుచు, తక్కినజీవములను స్వాధీనపరచుకొని వానిలో తనకు రుచ్యములైనవాని నన్నిటిని తినుచున్నాడు. నాగరికత హెచ్చినకొలది భూతదయ మొదలగు శాంతిమైన సద్గుణములను వృద్ధి పొందించుకొని, అనవసరమైనబాధలను కలిగించక, తనసోదరులను వదలివేసి, తక్కిన

జీవముల, ననుభవించుచున్నాడు ఇట్లే న్యాయశాస్త్రనిబంధనలన, మతనిబంధనలతో పాటు యేర్పరుచుకొన్నాడు తనకు బొత్తిగా అనుపయోగకరమైనట్టియు, ముసలివి, జబ్బుపడినట్టివియు నగు జీవములను పెంచి రక్షించుటకేల యిష్టపడును? దానివలన ప్రజలకుగాని, వానికిగాని ప్రయోజన మేమున్నది? తన్ను బాధించు క్రూరజంతువులనే గాక తనకిదివరకు పనిచేసిపెట్టి, యిప్పుడు బొత్తిగా ఉపయోగము లేనివానిని చంపి, వానితోలును మాంసమును, మరియొక మంచికార్యమున కుపయోగించవచ్చును కదా! ఇట్లు తాను వానిని చంపకుండినచో, ప్రపంచములో నుండు జీవరాసులన్నియు పెరిగి ఉత్కృష్టమేధావంతుడగు మానవునికి తినుటకు గడ్డికూడ మిగులకుండ చెయగలవు ఇట్లు యీ అతిబాధలను పోగొట్టుకొనుటకు, క్రిమికీటకములను, పక్షులను, మృగములను చంపుచున్నప్పటికి, దినదినము పెరుగుచున్న మానవకోటికి ప్రపంచములో చాలినంత తిండి యుండదని, జనసంఖ్య పెరుగకుండ కొన్ని సాధనల నుపయోగించి, యెక్కువమంది పిల్లలు పుట్టకుండ చేయవలసి యుండునని కొందరు శాస్త్రజ్ఞులు సలహానిచ్చుచున్నారు ఒకవేళ యీ అహింసాసూత్రమును మనమందరము ఆచరణలో పెట్టెదమనుకొనుడు ఒక్క జీవరాసియగు మేకలు, మందలుగ వృద్ధిపొంది, చెట్లు చేమలనన్నిటిని తినివేయును పాములు, పులులు, మొదలగు క్రూరజంతువులు నీటిమీదను, భూమిమీదను, పెరిగిపోయి, మానవకోటికినం

తిన చంపివేయును కోతులు, పక్షులు, మన పయిర్లను, ఫల ములను తినివేయును. పనికిరాని ముసలిగొడ్లు మొదలైన వానిని జాగ్రత్తగ నొకచోట చేర్చి, వానికి వైద్యముచేయుచు, కడుపునిండ తిండిపెట్టవచ్చు, మనము రక్షించుటకు మొదలు పెట్టిన యెడల, పనికవచ్చు మన పశుగణమునకు కావలసి నంత యాహారము దొరకక దుర్బలులై చెడిపోవును కాబట్టి భూతదయసూత్రాచరణలో అతివ్యాప్తి దోషముకలదు. ఇట్టి కారణములమీదనే ఒకానొకప్పుడు మానవహత్యను, ఆత్మహత్యలను, కూడ సమర్థించవలసి వచ్చును. తల్లిని బ్రతి కించుటకు ఆమె కడుపులోనున్న పిల్లను ముక్కలుక్రింద కోసి బయటకు తీయవలసి వచ్చును అన్యాయమునకు ఒడిగట్టిన పరసైన్యమును, స్వసంరక్షణకు డీకొని చంపవలసి వచ్చును. ఒకప్పుడు తనను తానే చంపుకొనవలసి వచ్చును ఒకడు కుద రని రోగముతో యమబాధపడుచు తాను యేవిధముగాను యితరుల కుపయోగపడజాలక, యితరులచేత నిత్యము ఊడి గము చేయించుకొని వారికి శ్రమ కలుగజేయుచున్నపుడు, వాడేల ఆత్మహత్య చేసికొనకూడదు? వాడు పాపిష్టి యెట్లగును? ఏల వానికి సులభముగ డాక్టర్లు ప్రాణము పోగొట్ట కూడదు? మహాత్మగాంధిగారు అహింసాతత్వబోధనకు ముఖ్యాచార్యుడుగా నుండియు, బాధతో గిలగిల కొట్టుకొను గుఱ్ఱమును సులభముగా చంపించుట కెట్లు ఒప్పుకొనెను? అట్లు మనుష్యునిమాత్ర మేలచేయకూడదు? స్థూలదృష్టితో

విచారించువారికి యిది కష్టకరోరముగ నుండవచ్చును గనుక, రాబర్టుయింగర్సాలుగారిచ్చిన మూడుదాహరణములను యిక్కడ వ్రాయుచున్నాను

(1) ఒక మనుష్యుడు రోగమువలన మిక్కిలి బాధపడుచున్నాడు డాక్టర్లందరు, దానివలన తప్పక చనిపోవునని నిశ్చయించిరి ఈలోగా ఆరోగి యమబాధ పడుచున్నాడు తన యూపిరిగమునను పృథాగా యితరులకు అమిత బాధను కలుగజేయుచున్నాడు దినదినమునకు సహింపనలవిగాని బాధ ననుభవించుచు తన ప్రాణమును శీఘ్రముగను సులభముగను పోగొట్టుమని డాక్టర్లను ప్రతిమాలును లేదా తన కేదైనను విషమిచ్చిన ప్రాగెదననును అప్పుడు ఛీ, యిదియంతయు పాపము! నీవు యీలాగు బాధపడుతూ చావవలసినదని దేవుడేర్పరచెను గనుక, అట్లు నీవు చావకపోతే తప్పక నరకమున పడుదువని చెప్పెదవా? ఇది సహేతుకరమని నమ్మెదవా?

(2) ఒకడు నిప్పంటుకొని యున్న ఓడమీద ఒక్కడే యుండెను అగ్నిజ్వాలలు చుట్టూ ముట్టుకొనుచున్నవి చూచాయలో నడిసముద్రములో మరియొక యోడ కనుపడలేదు. సముద్రములో ఉరికినయెడల కూడా చావు నిశ్చయము కాని, సముద్రములో పడినను కూడ చావుతప్పదు గనుక, ఆ యోడ మీదనే యుండి, క్రమముగా ఒడలు, కళ్ళు, నోరు, తల, చెవులు మొదలగునవి యంటుకొని, చచ్చుటయే న్యాయముకాని,

నీటిలో బడి నీ యిష్టమువచ్చిన ప్రకారము ప్రాణమును వదల కూడదని సలహా నీయవచ్చునా? అతను మలమలమాడి చావ వలసినదేగాని, ఆత్మహత్యను చేసికొన కూడదన్నమాట—

(౩) ఒకడు, మనుష్యులను చంపితిను అడవిజాతివారి చేతులలో బడి, వారందరు కలసి, యితనిశరీరమును చిన్న చిన్న ముక్కలుగా చేసి తినుటకు చిన్నచిన్న కత్తులను పుచ్చు కొని యితనిచుట్టూ మూగగా, తనయొద్దనున్న విషమును త్రాగి ప్రాణములను పోగొట్టుకొనవచ్చునా లేక, మనమతా చార్యులబోధ ననుసరించి, ఆత్మహత్య చేసికొనక, చిత్రవధ కంగీకరించవలెనా?

ఇట్లే, మనము, అనుపయోగకరమైన చెట్లను, మనలను బాధించు జంతువులను యెట్లు చంపివేయుచున్నామో, ఆ విధముగనే, గోవులును, మొదలగువానిని యేలచంపకూ డదు? వీనిని చంపక, పోషించుటకు మొగలుపెట్టిన యెడల అవియే మనలను, మన పశుసంపదను చంపివేయును. బ్రాహ్మ ణునికంటె కూడ గోవుపవిత్రమైన దనియు దాని పంచగవ్య ములు త్రాగిన పుణ్యము వచ్చుననియు మనమత గ్రంథములు చాటుచున్నవి తల్లికొడుకుతోను తండ్రి కూతురుతోను, అన్న చెల్లెలితోను సంభోగించు యీ గోవుకు మాత్రము యేల యీ పవిత్రతనీయవలెనో నాకు బోధపడలేదు మనకు చాలా కాలము పాలిచ్చినది గనుక కృతజ్ఞత చూపవలెనందురా కం చమేకలను, గాడిదెలను, బర్రెలను, యెడ్లను దున్నపోతులను

యీ మొదలగు జంతువులన, యిట్టి గోరక్షణశాలల గుండా యేలరక్షించరు? కాబట్టి మనదేశములో వీనిని స్థాపించి, ముసలిగోవులను, రోగిష్టిగోవులన, కడుపునిండ తిండిబెట్టి రక్షించుసభ్యులు, నా సందేహములను బాపవలెనని ప్రార్థించుచున్నాన

## గోరక్షణసభలు

### 22 వ అధ్యాయము

గోరక్షణకొరకు పూనా, బొంబాయి మొదలగు పశ్చిమరాష్ట్రములలో, జైనులు, గుజరాతీలు, మార్వాడీలు మొదలగు హిందువులు సభల నేర్పరచుకొని చాలకాలమునుండి పని చేయునట్లు గానే యిటీవల మనయాంధ్రదేశములో యేలూరు బందరు రాజమహేంద్రవరము మొదలగు పట్టణములలో యిట్టి సభలను స్థాపించుచున్నారు భూతదయయు అహింసయు ఈ స్థాపకుల పరమావధియైన యెడల, కటికవానిచేతిలో పడకుండ ముసలిఆవులన, యెద్దులను, యిప్పుడు వీరు సంరక్షింపదలచుకొనినట్లె గొర్రెలను, మేకలను, పందులిన, గాడిదెలను, లొట్టియలను, కోళ్ళన, కుక్కలను యేల సంరక్షించరాదు? గోవు మనకు పాలిచ్చినదిగనుకన, యెద్దు మనకొరకు కష్టించినదిగనుకను వీనిని రక్షించుటకు ఒక కారణమైన యెడల, యేల బర్రెలను, దున్నపోతులను, మేకలను, గొర్రెలన, గాడి

దెలను, గుఱ్ఱములను, లొట్టియలను, సంరక్షించరు? జీవహింసయే కూడదందురా, యేల తేళ్ళను, పాములను, పులులు మొదలగు క్రూరజంతువులను వీరు చంపెదరు? ఇదియు కూడ నిపనియగుచో మత్స్యములు, మృగములు, పురుగులు, మొదలగు వానిని చంపకపోగా సర్ జే. సి బోజుగారి పరిశోధనలనుబట్టి మనవలెనే ప్రాణములు, ఇంద్రియములుగల శాకముల నెట్లు తినుచున్నారు?

కాని ఇట్టి విధానమంతయు ప్రకృతికి విరోధము ఒకదాని నొకటి భక్షించి జీవించుటయే ప్రకృతిలో స్వభావము. సర్వజ్ఞుడు, సర్వశక్తి కలవాడు, పరమదయాళుడగు ఒక దేవుడుండియుండడని చెప్పు నిరీశ్వరవాదులకు ఇదియొక ముఖ్యహేతువు ఆద్యంతములులేని యీ ప్రకృతికి దయలేదు. కోపములేదు. పూర్వకాలమందు మానవులు, తమ మానవసోదరులనే తిని బ్రతుకుటకూడ కలదు ఈ రోజువరకు అట్టి అడవిజాతుల వారున్నారు. నాగరికత వృద్ధియైనకొలది, జీవరాసులన్నిటిలో మానవు డుత్కృష్టజాతియనియు, అతను రోగియైనను, ముసలివాడైనను, పసిపిల్లవాడైనను, అతనిని సంరక్షించుటవలన మానవసంఘాభివృద్ధికి తోడ్పడవచ్చుననియు యెంచి, ప్రతియాధునిక సంఘములోను అట్టివానిని హత్యచేయకూడదని శాసించినారు తక్కిన జీవరాసులకు అనవసరబాధను కలుగజేయకుండ నిబంధనల నేర్పరచిరి

హిందువులలో గోవును అతిపవిత్రముగ నెంచుటకు

అది ఋగ్వేదము పుట్టకమునుపు వేల సంవత్సరముల క్రిందట నుండియు మన శరీరసంరక్షణకు మంచిక్షీరముల నొసంగుట, సాధువుగనుండి మనయిండ్లలో మచ్చికగా నుండుట, యిదియే మన పూర్వులకు ధనముగా నుండుట ముఖ్యకారణములు ఈ హేతువులనుబట్టియే మన ఆర్యమతము, బ్రాహ్మణమతము, జైనమతము మొదలగునవి పైసాంప్రదాయమును మతముతో బలపరచినవి కాని పూర్వమందుకూడ గోవులను, వానిదూడలను యథేచ్ఛగ మన ఋషులుకూడ తినుట, యజ్ఞములలో నరవధ, గోవధ, అశ్వవధలనుచేయుట ఆచారముగానే యుండెను ఇప్పుడు మస్లిములు, ఆంగ్లేయులు, శూద్రులలో కొందరు యిష్టమువచ్చినట్లు గొడ్డు మాంసములు భుజించుచుండగా వారికడ్డుతగిలి మనము గోవులనుమాత్రమే రక్షించుట కేల ప్రయత్నింపవలెను? పాపము! ఎంతకాలమో పాలిచ్చిన కంచమేకలను, గొర్రెలను, గాడిదెలను, బర్రెలను, లొట్టియలను, చాలాకాలము మనకొరకు కష్టపడి పనిచేసిపెద్దైన యెద్దు, దున్నపోతులు గుఱ్ఱములను అవి ముసలివై రోగిష్ఠివైచనిపోవుటకు సిద్ధముగనున్న వాటిని మనమేల రక్షించ ప్రయత్నించకూడదు! గోవును మాత్రమే యేలకాపాడవలెను? మన పూర్వమతగ్రంథములలో బ్రాహ్మణునికంటె యీ గోవు పవిత్రమైనదని వ్రాసినంతమాత్రముననే, మనపూర్వాచార పరాయణులు యిట్టిపనికి దిగుచున్నారా లేక భూతదయచేతనేనా? ఈ గోవు పూర్వులు కామధేనువులయితే, మన వృక్షములన్ని

టికి కల్పతరువు లుండలేదా?

మనభూతదయన, సమస్త జీవరాసులన్నిటి మీఁదను కనుపరచవలసినదే యందురా యీప్రపంచములో వాని నన్నిటిలోను ఉత్కృష్టజ్ఞానము, భాష, నాగరికత కలిగియున్న మానవుడు ఒక్క నిముషమైనను, జీవించలేఁడు మనకు తినుటకు గడ్డికూడ మిగులదు మనముసలి అవులకును యెడ్లకును వానియంతటవి శిథిలములయి చనిపోయే వరకు కావలసినప్పుడు వానిరోగములకు చికిత్సచేయుచు, జీవింపచేయుటకు మనము వానికి గడ్డి, దాణా కడుపునిండ వేయుచుండుటవలన మనకిప్పుడక్కరకు వచ్చుచున్నవానికి తిండి దొరకపోయి, బలమైన పశుగణము మనకు కరవై పోవును ఈవిషయమై మన గోరక్షణసభ్యులు బాగుగా నాలోచించి సమాధానము తృప్తికరముగా యిచ్చినయెడల నా హేతువాదములోని తప్పులను దిద్దుకొందును కాని యీచర్చలో మతమునుగాని, ఒక ఋషివాక్యమునుగాని, ఒక గ్రంథమునుగాని, నేను పరమప్రమాణముగ నొప్పుకొనను ఈవిషయములో అహింసా వ్రతమును పూర్తిగ ఆచరించవలెనందురా మనుష్యుడు యీప్రపంచమునుండి తుడిచిపెట్టుకొని పోవలసినదే అనవసర బాధలను కలుగిజేయకుండ జీవహింసను ఆహారముకొరకును స్వసంరక్షణకును చేయవచ్చునదెరా? వారితో నే నేకీభవింతును. ముసలిదై శరీరబాధ ననుభవించుచున్న గుర్రమును చంపుటకు అహింసాధర్మము నాచరించు మహాత్ముడు ఒప్పుకొనెను. మ

నష్యానికి సంభవించు గొప్పరోగములను కనుగొనుటకును మానవసంఘాభివృద్ధికిని శాస్త్రపరిశోధనలను చేయుటను జీవహింస చేయవలసివచ్చుచున్నది గొప్ప డాక్టర్లు తమ ప్రాణములనే దీని కర్పించుచున్నారు

ఈ గోవులను రక్షించుట మనమతధర్మమని చెప్పుటచేతనే మనకును, ముస్లిములకును దేశమందంతటను కలుగుచుండిన జగడములకు ఒక ముఖ్యకారణము ఈయాధునిక బ్రాహ్మణమతమే యీగోవుమీది గౌరవమునకును దీని పేడ తినుటకును దీని ఉత్సర్రాగుటకును ముఖ్యహేతువు ఈగోవుల పాలమీదనె మన పూర్వులు, వ్యవసాయము పంటలు యెరుగని స్థితిలో ఆధారపడుటచేతను యివియే వీరికి ముఖ్యధనమగుటచేతను వీనికిగౌరవము నిచ్చిరి దీని పెడక్రిములను పోగొట్టవచ్చును ఇది మురిగినయెడల నూతనక్రిములు అనేక దుష్టమైనవి పుట్టవచ్చును ఈపేడ నుపయోగించని జాతులలో ఇండ్లను శుభ్రముగా నుంచుటకు యితరసాధనములు అవలంబించుట లేదా? నాస్నేహితుడు మోతే గంగరాజు జమీందారుగారు యీ యుద్యమములో త్రికరణశుద్ధిగ యెక్కువ పాటుపడుచు యీగోరక్షణోత్కృష్టతను గురించి పద్యములను వ్రాయువారికి గొప్ప పారితోషికము నిచ్చెదమని వార్తాపత్రికలలో వ్రాసిన దిచదివినమీదట యీక్రిందిసందేహములు నాకు కలిగినవి ఈ వ్యాసమునకు తృప్తికరమై హేతుపూర్వకమైన సమాధానమును గద్యలో వ్రాసినవారికికూడ వారు తగిన పారితోషికము

నియవలసినపని నేను ప్రార్థించుచున్నాను

## బీ ద వి ద్యా ర్థు లు

### 23 వ అధ్యాయము

పాఠశాలలో జతములనిచ్చుకొనలేనట్టియు, జీవనమే దుర్ఘటముగా నున్నట్టియు బీదవిద్యార్థులకు ఉన్నతవిద్య నభ్యసించుటకు సదుపాయములు కలుగచేయుట సంఘము యొక్క విధి అమెరికా విశ్వవిద్యాలయములలో, యేశాస్త్రములగాని పాండిత్యము సంపాదించుకొనదలెనన్న బీదవిద్యార్థి, తనతిరిక సమయములలో గృహస్థులయిండ్లలో పనిపాటలు చేసికొని ద్రవ్యమార్జించి, జీతములకును, భుక్తికిని చాలినంత సొమ్ము సంపాదించుకొనుచున్నాడు తన విశ్వవిద్యాలయములలో ఉపన్యాసము లిచ్చుగంటలలో తాను పనిచేసికొనవలసి వచ్చేయెడల, ఆరుమాసములు పనిచేసి, తక్కిన ఆరుమాసములు కాలేజీకి వెళ్ళవచ్చును ఇట్లు నాలుగుసంవత్సరములకు బదులు యెనిమిది సంవత్సరములైనను చదివి, ఆయాశాస్త్రములలో డిగ్రీలు తీసికొనవచ్చును. ఒకసాలుకు నాలుగు పెరములున్నపుడు, ప్రతిపెరము ఆఖరున అప్పటికి పూర్తిచేసిన పుస్తకములలో పరీక్షింపబడును ఆపరీక్షలో నుత్తీర్ణుడైన యెడల, సర్టిఫికెట్టు నిచ్చెదరు. దరిమిలాను, ఆవిద్యార్థి యెప్పుడుచేరినను, ఆ పైగ్రంథములను మొదలుపెట్టి చదివించె

దరు వెంకటగిరింతయు బుర్రలో యెల్లప్పుడు జ్ఞాపకముంచు కొనవలసిన యవసరము లేదు

ఈ విధానమును మన యాంధ్రవిశ్వవిద్యాలయములో కూడ యేర్పరుచుట మిక్కిలి యవసరము తెలివిగలవిద్యార్థులు సామాన్యముగా కడుబీదలు వీరు యేగృహస్థుని యింటిలో నైనను ప్రవేశించి నౌకరీచేయుచు యేల విద్యనభ్యసించ కూడదు? అమెరికాలో యిండ్లనూడ్చుట, సామానులమీద దుమ్ముదులుపుట, చిప్పలుకడుగుట, వంటచేయుట, పొలము లలో పనిచేయుట, చెట్లకు నీరుపోసికాంచుట, పందులను, మేకలను, పశువులను కాచుట, మొదలగుపను లెన్నిటకో యీవిద్యార్థు లక్కరకు వచ్చుచుందురు ఈపనులలో అగౌ రవమున్నదని, ఆదేశములో యెంతమాత్రము నెంచరు పూర్వము మనదేశములో కూడ గురువులయిండ్లలో శిష్యు లుండి, అన్నివిధములైనపనులు నెరవేర్చుచుండిరని గ్రంథ ములలో కనపడుచునే యున్నది ఈకాలములో కూడ, వారములు మధూకరములు చేసికొని విద్యనభ్యసించుటలేదా? దీనికంటె గురువునకును, గురుపత్నికిని యూడిగముచేసిన తప్పేమి?

కాబట్టి పట్టణములలోని కాలేజీలలో చదువు విద్యా ర్థులు, జీతములకు యింటింటికి పోయి ముష్టియెత్తుచు, వారము లకు ప్రతివారినివేధించి, చిన్నతనమునుండి నీచప్రవర్తనకు అలవాటుపడుటకంటె, ఒక గౌరవకుటుంబములోచేరి, వారికి

సర్వవిధముల సహాకారిగా నుండుట యుక్తముకాదా! ఇది గాక, గృహయజమానురాలు పెద్దగ చంటలో తరిబీతు అయిన యెడల, తాను ఒకవేళ పరీక్షలో నుత్తీర్ణుడు కాకపోయినను తనజీవనము గడుపుకొనగా మంచి కనీసము పదునైదు రూపాయలనైనను సంపాదించుకొనగలరు. ఇప్పటి వయేలకంటె తాము భార్యాబిడ్డలను యెక్కువసమృద్ధితో పోషించుకొన గలరు పాకశాస్త్రములో నేర్పరియైనయెడల, యితని వనో నాధికి యెన్నటికిని యిబ్బందిలేదు తాను గొప్పడిగ్రిని సంపాదించి, గౌరవస్థానమును వహించినను, యీవంటపని నేర్చి యుండుటవలన యితని కనేకసమయములలో అది మిక్కిలి యక్కరకు వచ్చును హోటళ్ళను స్థాపించుకొనవచ్చును భార్యకు సహాయము చేయవచ్చును

## బీదలకు ధర్మము

### 24 వ అధ్యాయము

మన హిందువులలో, భూతతృప్తియే పుణ్యమనియెంచి సంతర్పణలు, సమారాధనలు, అతిథి అభ్యాగతులుగ వచ్చిన వారికెల్లను భోజనముపెట్టుట బ్రాహ్మణ బ్రాహ్మణేతర బిచ్చగాండ్రకు లేదనకుండ ముష్టిపెట్టుట, సత్రములు, సావిళ్లు దేవాలయములు మొదలగునవి కట్టించుచు, వికలాంగులై బొతిగా యేమియు సంపాదించుటకు అశకులెనవారికి బదు

లుగా, దున్నపోతులుగ నుండి పనిచేయగలవారికి భోజన సౌకర్యములను కలుగఁజేయుచుందురు ఎట్లైననేమి యిది కూడ భూతదయ కాదా యనియు దీనివలన తమకు పుణ్య గతులు కలుగుననియు వీరి యభిప్రాయము ఇదియంతయు భగవంతుని దృష్టిలో పాపమేగాని పుణ్యముకాదు నీవు ఆయనయొద్దకు వెళ్లినపుడు, బొత్తిగా ధనము సంపాదించు కొనలేని అశక్తులు, వికలాంగులు దేహపాటవము లేనివారగు నీసోదరు లనేకమంది తిండిలేక మాడుచుండగా, నీధనము నిట్లు దుర్వినియోగ మేలచేసితివనియు, నీ కమాత్రము బుద్ధి లేకపోయినదా యనియు నిన్ను ప్రశ్నించడా? సోమరితన మును పెంచుటకు తప్ప, వీరిట్లు ఖర్చుచేసిన ధనము విఫలము కాలేదా? ఇట్లు చేయుచుండని యెడల బీదలగతి యేమైపోవు ననియు, అందరికి మనము వృత్తులను కల్పించగలమా యనియు కొందరు ఒక గొప్పసంతుప్రశ్న వేయుదురు ఏది యుచితమైన ధర్మమని మనము వాదించునపుడు, యీప్రశ్న అప్రస్తుత ప్రశంసలోనికి దింపును ఇప్పుడు లోకములోనున్న ధనవంతులందరు తమ ధనమంతయు, తమ బీదసోదరులకు పంచిపెట్టి రనుకొనుడు అప్పుడు లోకములోని వారందరు బీద లగుటయే గాక, తిండిలేనివా రనేకకోట్లు మిగులుచునే యుం దురు అదిగాక, ధనాభావముచేత, కృషివాణిజ్యాదు లడు గంటి, మానవాభివృద్ధికిని,* నాగరికతకును భంగముకూడ వాటిల్లును ఈకారణముచేతనే, రష్యాలో ధనవంతుల ధన

మునంతేయు, భూమింటయు, పరిశ్రామికశాలల నన్నిటిని పరిపాలకులే స్వాధీనముచేసికొని, ప్రజలలో వాణిజ్యము, విద్య, వ్యవసాయము, చేతిపనులు, మొదలగునవి సమూహము మీదనే ప్రజలచేత చేయించి, వారివారి వృత్తుల యుత్కృష్టతను బట్టియు, కష్టమును బట్టియు, సమస్తసౌఖ్యములు, ప్రతి కుటుంబమునకు చేయ సమకట్టినారు ఈ విధానము ముందింకను యెంతవరకు జయప్రదమగునో చూడవలెను అక్కడ 18 యేండ్లలోపు బాలురు విద్యాభ్యాసము తప్ప మరియొక వృత్తిలో చేరకుండులాగున నన్ను, 60 సంవత్సరముల పైవయస్సుగలవారు, యేవిధముగాను కష్టించనక్కర లేకుండు నన్ను, గర్భిణిస్త్రీలు, కొన్ని మాసములు యేపనియు చేయకుండులాగున నన్ను, అనేకవిధములైన సౌకర్యములను పరిపాలకులే కావించుచున్నారు ఇట్టి వ్యవస్థలో యెవరికిని గౌరవహానిలేదు తిండి గుడ్డ లేక యెవ్వరును ఉండరు, వ్యక్తికి ఆస్తిలేదు గనుక, నేరములంతగా నుండవు నీతికి కొరతలేదు. సంపూర్ణమనస్స్వాతంత్ర్యము ప్రజలకు కలదు.

ఇట్టి విధాన మితరదేశములలో నమలులో యింకను పెట్టబడలేదు గనుక, యిక్కడ ధనికులు దరిద్రులు అను భేద మేర్పడి, కొందరు బంగారపు తూగుటుయ్యేలలో ఊగుచుండగా, అనేక లక్షలమంది, అన్నమో రామచంద్రాయని వృత్తులకొరకను, ఆహారము కొరకును తపించుచున్నారు. ఈకారణముచేత, సంపన్నగృహస్థులు, యీబీదలకు, తమ

ధనమును పంచిపెట్టవలసినదని నేను చెప్పను అట్లు వారు చేసినను, మనతో అనేకమంది బీదలు, మనలను విడనాడక యుండనే యుందురు. కాబట్టి వారికి నిజమైన ఉపకారము, యిట్లు ఉచితముగ పంచిపెట్టుట కాదు రష్యాలోవలె మనకు సమిష్టి పరిపాలనము వచ్చువరకు (అది యెప్పటికైనను వచ్చితీరును) మన బీదసోదరులకు, వారికి చేతనైన వృత్తి కల్పించి, వారి కాళ్లమీద వారిని నిలబెట్టుటయే, మన విధి వారి కుచితముగ ధర్మము చేయుటవలన, వారి సోమరితనమును వృద్ధి చేయుటయే ఇది పాపిష్ఠికార్యముగాని పుణ్యకార్య మెంతమాత్రము కాదు మనయింటికి నిత్యము బిచ్చమునకు వచ్చు బ్రాహ్మణునికిగాని, బ్రాహ్మణేతరునికిగాని, బియ్యము, డబ్బు యెంతమాత్రము యీయకుండ వెడలగొట్టవలెను వారికి నిజముగా పని దొరకనిచో, పని కల్పించుటకు మనము ప్రయత్నించుతే, వారికి ధర్మము చేసినట్లు యెంచవలెను మనయింటికి, ఆకలిగొన్న అభ్యాగతుడు వచ్చినపుడును, లక్షాధికారియైన అతిథుడు వచ్చినను పని చేసికొమ్మని వెడలగొట్టుట నాయభిప్రాయ మెంతమాత్రము కాదు కోటీశ్వరుడు కూడ, రెండురోజులమరిలనే, భోజనసదుపాయములేని గ్రామమునకు రావచ్చును. అట్టి యభ్యాగతునికి కూడ అన్నముపెట్టుట, ధర్మము. పుణ్యకార్యము కాని, బీద అభ్యాగతులకు ముందుగా, వారిని గురించి విచారించి, పాత్రులైన యెడల అన్నము పెట్టవచ్చును. వారు యిది వృత్తిగా చేసి

కొనవలసని సలహా నిచ్చి, నీ చేతనైనంతవఱకును, అతని కొక వృత్తి కల్పించుటకు ప్రయత్నింపుము

ఈ పద్ధతిని, మన బీదసోదరులయందే కాక, మన కొమాళ్లు, కొమార్తెలు, అన్నదమ్ములు, అప్పచెల్లెండ్రు, కోడళ్లు, అల్లుళ్లు మొదలగు సమీపబంధువుల యెడల కూడ మనము వర్తింపజేయవలెను దీనిలో అస్వాభావికమేమియు లేదు ఇది కారిస్యము చూపుటకాదు నీకొమాళ్లకు, నీశక్తి కొలది, మేజరగువరకు అన్నవస్త్రములు, విద్యయు యిచ్చి, యేదియో యొక స్వల్పవృత్తికి తగినట్లు చేయుటయే నీధర్మము గాని, ఆటువాత, వారు వించేవఱకు నీవు పోషించుట నీకు కర్తవ్యమైన ధర్మము కానేరదు వీరికి చేసినట్లుగానే నిబీద సోదరులు నీధనము నుపయోగించవలెను గాని, దానిని ముద్దచేసి, నివు చనిపోయేటప్పుడు నీ కొడుకులకును, కొమార్తెలకును యిచ్చి పోవుట పాడిగాదు వారు బిడవారైనను, నీవిచ్చిన సౌకర్యములను వారి తెలివిహీనతనైతేనేమి, మరి యితరకారణములనైతేనేమి వారు ఉపయోగించుకొనజాల నపుడు, వారు కూలి చేసికొనియైనను బ్రతుకవలెనుగాని, వారు సంపాదించని ద్రవ్యముతో వారు పొట్టగడుపుకొనునట్లు చేయుట, వారికిని, నీకును కూడ గౌరవహీనము—వారికి, నీవు వివాహములుచేసి, భార్యలను, భర్తలను వారి కంటగట్టుట నీపని కాదు దానిని వారే చూచుకొనవలసి యుండును ఇట్లు ప్రతి మగవాడును, ప్రతి ఆడుదియు, క్రిందివర్ణములలో

వారివలెనే, కష్టించి పనిచేసికొని జీవించుట ధర్మము ఉచిత ముగ నిచ్చు దయాధర్మవచ్చుయు, నిజమైనట్టియు, పుణ్యము నిచ్చునట్టియు ధర్మముకాదు సరికదా సునము ఆబిచ్చగానికి అపకారమునుకూడ చేసినవారు మగుదుము సునగ్గిరకువలెనే, వాడు ప్రతివాని యొద్దకు పోవుచు, యాచకవృత్తియే బాగు గను సులభముగను ఉన్నదని యెంచి, యేవృత్తికి ప్రయత్నిం చక కష్టపడి పనిచేసికొను టొల్లక, సోమరిపోతై, ప్రపంచము నకు తాను, తనకుటుంబమును భారమగుచుందురు ఈవిషయ మై సూత్ర, స్మృతి, పురాణేతిహాసములలో, బ్రాహ్మణులను గురించి వ్రాసిన ధర్మములు, ఆకాలమునాటి పరిస్థితులకు వర్తించి యుండును లేదా బ్రాహ్మణులు, తమ స్వార్థము కొరకు, వ్రాసియుందురు ఈవిసయమునకు అవి బొత్తిగా వర్తించవు

## తంత్రులవిధ్యుక్తిధర్మము

25 వ అధ్యాయము

ప్రతిపురుషుడును, స్త్రీయును, తాను మేజరుకాగానే తన అన్నవస్త్రములకు తనమీదనే యాధారపడవలెనని నా యాదర్శము. స్త్రీకిగాని, పురుషునికిగాని వివాహము ఐచ్ఛిక ముగ నుండవలెను ఇప్పటి మన సంఘస్థితిలో స్త్రీకి చిన్నత నములోనే వివాహము చేయుట నిర్బంధముగ నెంచి, వారికి

కొంచెము మిడిమిడిజ్ఞానము కలిగించు విద్యనుమాత్రము నేర్పి ఒక పెనిమిటి స్వాధీనము లోనికి పంపగానే వారియెడల వారి తండ్రి జరిగించవలసిన విధాయకకృత్యములు నెరవేరినవని యెంచుచున్నాము పెనిమిటి అప్రయోజకుడై గాని, మరి యేయితరకారణములను బట్టిగాని ఆమెకును పిల్లలకును ఆధారముకలుగ జేయలేనపుడు, ఆమె గౌరవజననము చేయజాలక యితరులకు, ఊడిగము చేసి, తనకును తనమైనను పిల్లలకును తిండి సంపాదించుకొనవలసి వచ్చును కాబట్టి తండ్రిసొమ్ము వ్యయము చేసి అల్లుని కొనుక్కొనుట కంటె, తాను అట్టి క్రయధనమును, తనకొమార్తెకును, ఆమెకు కలుగు సంతానమునకును ఒక ట్రస్టు దస్తావేజుద్వారా చెందుచుండునట్లు చేసిన బాగుగనుండును ఇక కొమార్లవిషయమై వారికి వివాహము చేయవలసినవిధి తండ్రికి కించిమాత్రము లేదు! కొమారుడు పోషించగలిగినప్పుడే వివాహము చేసికొని భర్తయని యనిపించుకొనుటకధికారము కలిగియుండును తండ్రి, తనకున్నయాస్తినిబట్టి తనకొమారుడు మేజరయ్యేవరకు విద్యాబుద్ధులు గఱపి, ఉద్యోగమిప్పించుటకు ప్రయత్నించవలెను అతనికి సారస్వతవిద్యగాని సాంకేతికవిద్యగాని అలవడి, మంచిపనిలోనికి వెళ్లజాలకపోయినను, అతను చేయగలిగిన పనిలో యుండి జీవించవలసినదే గాని తండ్రిమీద నెన్నడు ఆధారపడకూడదు. తండ్రికూడ తనకొమారుని కేమిచ్చినను, అట్టి ధర్మము, అతనిగౌరవమును, తన గౌరవమును కూడ చెడగొట్టును

మన దురదృష్టమే మోగాని ఎనవంతుడగు ప్రతితండ్రి యు తానుకష్టపడి సంపాదించిన ద్రవ్యమును ముద్దగాచేసి తాను చనిపోయినపుడు కొమార్లకిచ్చి చచ్చిపోవలెనని కోరును. కొమారుడు తినంతటతాను బాగుగా సంపాదించు కొనుచున్నను, అతనిని ఏనకంటె ధనవంతునిగ వేయుటకు ప్రయత్నించును పిల్లవాడు అప్రయోజకుడైన, వేరుగ చెప్ప నేల ? ప్రతికుటుంబములోను ధనవంతులు దరిద్రులు ప్రయోజకులు మారిమారి పుట్టుచున్నారనియు తానిచ్చుధనము ఒకటి రెండు పురుషాంతరముల కంటెయెక్కువగ ఒక కుటుంబములో నుండదనియు స్పష్టముగా కన్నులార చూచుచు కూడ, తనధనమునంతయు ధనవంతులు ప్రయోజకులగు కుమార్లకైనను, బీదలగు అప్రయోజకులగు కుమార్లకునను, యిచ్చి చనిపోవును. వీరుభయులకు కూడ తన కష్టార్జితమును తండ్రి యీయకూడదనియే నాయభిప్రాయము ధనవంతుడు లేక తానంతటతాను సంపాదించుకొని తన కాళ్లమీద తాను నిలవగలిగిన కొమారునికి బొత్తిగా యీయ నక్కరలేదు బీదవాడై అప్రయోజకుడైన కుమారునికి వివాహమే కాకూడదు గనుక అతని పొట్టకు కావలసిన సంపాదనము, యేచిన్న యుద్యోగము లేక కూలిపనివలన నైనను ఆర్జించు కొనవలసినదే, గాని తనతండ్రి వలె పై అంతస్థులో నుండుట కర్హుడుకాడు చిన్నతనమునుండి తండ్రి తనవిద్యకొరకు చేసిన సౌకర్యములను తన తెలివిహీనత చేతనేమి, తన దుర్మదత వలన నేమి పోగొట్టు

కొన్నప్పుడు, దానిఫలమును తా ననుభవించవలెనే గాని తండ్రినిగాని, మరియొకరిని గాని ముట్టియెత్తి జీవించుట తగదు. ధనవంతుడగు తండ్రి తనకన్న కొమాళ్లు కొమార్తెల యెడల పైన చెప్పిన విద్యుక్తకార్యములను మాత్రము నడపి తన ధనమంతయు తనబీద సోదరులకు వృత్తులు కల్పించుటయందే, వినియోగించవలెను ఇది యెన్నడు ఉచితధర్మముగా పరిగణింపబడకూడదు వీధిలో పోవుచున్న బిచ్చగానికికూడ ఉచితముగ ధర్మము చేయకూడదు వానికి పని కల్పించి ధర్మమును చెయవలసి యుందుము అట్టిపనులను కల్పించుటకు సారస్వత, సాంకేతిక విద్యాశాలలు బాలురకు యెల్లయెడలను యేర్పరచవలయును వానిలో చదువుకొని, పరీక్షలలో ఉత్తీర్ణులైన వారికి పనులు కల్పించుటకును, ఆసుపత్రులు, యంత్రశాలలు, కోర్టులు, పాఠశాలలు, దేవునిగుళ్లు, పౌరోహిత్యములు, నేత మొదలగు చేతిపనులను, వివిధకళలను నేర్చినవారికి వృత్తుల నొసగు సంస్థాపనలకును, ఈ ధనవంతులగు తండ్రులు తమ సంపాదనను ఖర్చుపెట్టవలెను. ఇది న్యాయమైన ధర్మమని యనిపించుకొనును మద్రాసునగరములో నేను కన్నులార చూచిన యుదాహరణ నిచ్చుచున్నాను. ఘనశస్త్రవైద్యుడగు డాక్టరు రంగాచార్యులుగారు తన స్వార్జితముతో గొప్ప వైద్యశాల నేర్పరచి వందలాది జీతము లిచ్చి పురుష స్త్రీవైద్యులను అనేకమంది పనివాండ్రకును జీవనము కల్పించుచున్నాడు. వీరి జీవనమంతయు ఆయనయొక్క తెలివి తేటలమీదనే

గదా యాధారపడియున్నది ఆయనకు పిల్లలు లేకపోయినను ఉన్నను, తాను అన్నివిధములుగ సౌఖ్యము ననుభవించుచు అనేకమందికి జీవనాధారము కల్పించి ప్రజలకు బాధోపశమనముచేసి వారివలన వచ్చుధనము నంతయు ప్రజలకే వినియోగించుచున్నాడు ఇదియే నిజమగుధర్మము ఇట్టిదియే నిజమైన పరోపకారము. ధనహీను డేమి చేయగలడు ? ధనవంతుడే తన విధ్యుక్త కార్యములకు తన బీదసోదరుల యెడల తన ధనమును వినియోగించవలెను.

## విచారణశక్తి

### 26 వ అధ్యాయము

మూఢభయములు, అనాలోచితనమ్మకములు, అతార్కిక విశ్వాసములకంటె మన విచారణశక్తియే మనకు సవ్యమైన మంచిదారిని చూపగలదు పరిశోధన విమర్శనములే మనకెక్కువ ఉపయోగకరములు ఈ ప్రపంచము మృతులైనవారి చేతగాక, జీవించియున్నవారిచేతనే నడుపబడుచున్నదనియు, చనిపోయినవారి అనుభవమును మన ముపయోగించుకొనవచ్చునుగాని, అనాలోచితముగ వారు చెప్పిన దంతయు నమ్మవలదనియు చెప్పుచున్నాను. స్మశానము సింహాసనము కానేరదు. మృతకళేబరము రాజుకాదు మానవుడు ఒట్టిబూడిద తినుచు జీవించగలడా ? ఇప్పటి మతా

చార్యులకంటె పూర్వపు మతగురువుల కెక్కువ తెలిసినదా? ఉభయులకును యీ చిన్నిభూగోళమును గురించిన జ్ఞానమే మిక్కిలి తక్కువగా నున్నపుడు, వీరికి మరియొక ప్రపంచ మునుగురించి అసలే తెలియదు

అజ్ఞానము, భయము, మనోబానిసత్వములవలననే మూఢవిశ్వాసము లేర్పడుచుండును. మనస్స్వాతంత్ర్యమువల ననే సత్యము దొరకవచ్చును మనస్స్వానుభవము మీదనే, తుదకు మనమాధారపడవలెను ఎవరికితోచినది వారు నిర్భ యముగ వెలిబుచ్చినపుడే, సత్యాసత్యముల నిర్ధారణకును, మంచివిషయముల నామోదించుటకును, అవకాశములు కలుగుచుండును అన్యోన్యాభిప్రాయవిమర్శనము తప్పక జరుగుచుండవలసినదే మతాధికారులకు భయపడునంతవర కును, తెలియని విషయములు, వారు తెల్పగల్గిరని నమ్మినంత వరకును, మతగ్రంథములను పూజించినంతవరకును, మనము జ్ఞానశూన్యులమై మూఢవిశ్వాసము లనెడు చింపిరి వస్త్రము లను కట్టుకొని యుండవలసివచ్చును బ్రతికియున్నవారెవ రును, చనిపోయినవారితో సమానులు కారనియు, వెనుకటి యుగములు, ప్రస్తుత యుగముకంటె మంచివనియు, అప్పుడు ధర్మము నాలుగు పాదములమీద నడచుచుండె ననియు, యీ కలియుగములో ధర్మదేవత ఒంటికాలిమీద కుంటు కొనుచు నడచుచున్నదనియు యీమతగురువులు చేయు ఊహ లను మనము నమ్మినంతకాలము, మనకు ముక్తి చేకూరదు.

ఈ మతములలోనుండి, నరకమను ఒక ప్రపంచమును తీసివేసినచో, యిక యేమిమిగులును? అప్పుడీ మతములన్నియు ఆరిపోయిన అగ్నిపర్వతములవంటివగును. వీనిలోనుండి, అభూతకల్పనలు, అస్వాభావికములు, అగోచరములు, నిర్హేతుకములు, అసంభవములు తీసివేసినయెడల మిగిలినది ఉత్తమాయ వానిలో యేమియు నుండదు. మన ప్రస్తుతనాగరికత నాగరితయేకాదని కొందరి మతము. ఈనాగరికతకు మతములే ముఖ్యకారణములని మరికొందరి మతము. మతమెప్పుడును మనలకు నాగరికుల చేయలేదని నా మతము. మనమే, మతములకు నాగరికత నిచ్చుచుంటిమి. మనమభివృద్ధి పొందిన కొలది, మన దేవునికూడ బాగుపరచి, అభివృద్ధి చేయుచున్నాము. ప్రకృతిరహస్యములను మానవుడు తెలిసికొనగలిగినకొలది దేవతలు మనకు దూరమగుచున్నారు. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నెడు త్రిమూర్తులకంటె (I) మానవత్రిమూర్తులు— (1) శరీరమనస్స్వాతంత్ర్యము, (2) మానవసోదరత్వము, (3)మానవసమానత్వము—(II) భౌతికశాస్త్రత్రిమూర్తులు,—(1) కనుగొనుట, (2) పరీక్షించుట (3) స్వానుభవము, (III) జీవితత్రిమూర్తులు—(1) పురుషులు, (2) స్త్రీలు, (3) బాలురు—వీనినే నేను నమ్మెదను. జీవితచరితార్థమునకై మతమున కెన్నటికిని ప్రాముఖ్యత నీయకూడదు. నాస్నేహితులు వావిలాల వేంకటశివావధానిగారు, కృష్ణాపత్రికలో యిటీవల వ్రాసిన ఉపనిషత్సారమును చదివితిని. ఈ ద్వైతాద్వైత విశి

ష్టాద్వైతములు, మతములనఒడవు ఇవి ఊహాప్రపంచమునిూఁ నాధారపడవలసిన వేదాంతములు వేదాంతులు, ప్రపంచ మంతటను ప్రతిదేశములో నున్నారు వీరి వేదాంతములు పరిపరివిధములుగనున్నవి

మన యవధానిగారు చూపించిన ఉపనిషద్వాక్యములే సత్యములని వారనకొరకు నమ్మకము బ్రహ్మను తెలిసికొన్న వాడు బ్రహ్మయే యగును. ఆబ్రహ్మ సర్వాంతర్యామిగనుక, మనలోకూడ నున్నాడు మనము సమాధియను యవస్థను పొంగి, మనలోని యాత్మను, యూ పరమాత్మయే యని తెలిసికొనవచ్చునట! ఇట్లు తెలిసికొనగల వానికిమాత్రమే చావుపుట్టుక లుండవట! చూచువాఁడు చూడఒడునట్టది ఒక్క టేనట! భేదభావమేమియు లేదట! ఏబ్రహ్మము అశబ్దమో, అస్పర్శమో, అరూపమో, అవ్యయమో, అరసమో, నిత్య మో, వాసనారహితమో, ఆద్యంతరహితమో, మహత్తత్వా త్మకమో దానిని తన జవాత్మగా తెలిసికొనువానికి తిరిగి జన్మ ముండదట! ఇట్టి అచింత్యమైన వస్తువు ఒకటే యున్నను, దానిని తెలుసుకొనట, అసాధ్యము అట్టి జీవాత్మనుగాని, పరమాత్మనుగాని ప్రార్థించుట నిష్ప్రయోజనము గనుక, యిట్టి యద్వైతశిద్ధాంతులకు, మతభేదములతోగాని, మతా చారములతోగాని పనిలేదు వీరికి నిర్వికల్పసమాధిలో యేదైన ను కనుపడిన యెడల, అది ఉత్తమాయా ఎండమావి వం టిది ఇది యంతియు వృథాప్రయాసతప్ప దీనివలన వేరు

ప్రయోజనము లేదు మనమే యీ బ్రహ్మాండమునంతయు సృజించితిమని యనకొనగానే మనము బ్రహ్మమే అయిపోదు మట! తానుగాక, యితరదేవత లున్నారని అన్యదేవతోపా సన చేయుచున్నాడో, వాడు అవివేకి, మూఢుడు, పశుతు ల్యుడు తన జీవాత్మ పరమాత్మయే యని తెలిసికొనుటకు, వేదార్థము తెలిసి, నిష్కామముతోను, భగవదర్పణపురస్సర ముతోను కర్మలను చేయవలెనట! అప్పుడు తన యాత్మయు, సూర్యునిలోని యాత్మయు ఒకటే యని కనుగొనునట! ఆత్మ ను ఆత్మయే తెలిసికొనవలెనట!

ఉపనిషత్తులలోని యీ యద్వైతసిద్ధాంతము, యీ ప్రపంచజీవనములో నెట్లుపయోగించును? మనకు నైతికవిధి నిషేధములు తెలిసికొని సంచరించగలిగిన మార్గమును స్పష్ట ముగ మాపెట్టకపోయినను, లోకములోని కలహాపులకు కారణమైన యీ వివిధమతములకు తావులేని యీసిద్ధాం తము చాటుచున్నది ఆత్మపదార్థమనునది తనలో ఒకటి యున్నదనియు, అది యీ సృష్టియంతయు నిండిన పరమా త్మయే యనియు, నమ్మిన యెడల, ప్రత్యేకముగ దేవు డొకడు లేకపోవుటచే తన్ను తాను ప్రార్థించుకొనుట హాస్యా స్పదముగనుక, భక్తియోగమునకు స్థానమేలేదు ఇదిమార్గమే కాదు నిర్వికల్పసమాధిలో జీవాత్మ పరమాత్మల యేకత్వ జ్ఞానము సిద్ధించుటయే ము[illegible] ఆద్యంతములు లేని ప్రకృతిలో ఆద్యంతములులేని పరమాత్మ నిండియుండె, వివిధాత్మలు

లేనేలేవు ప్రత్యేక దేవుడులేడు ప్రకృతి యారాధనయే దైవా రాధనయని యందుమా, ప్రకృతి మన ఆరాధనలు కోరక, తనపని తాను నెరవేర్చుచునే యుండును నీయాత్మను నీవు ఆరాధించుకొనుము, నీశరీరము తిరిగి పుట్టకుండ చేసికొనుటయే యీ సిద్ధాంతముయొక్క ఆదర్శము ప్రపంచములోని క్లిష్టపరి స్థితుల నెదుర్కొనుటకుగాని, మానవసేవకుగాని యీవిధాన మెంతమాత్రము ఉపయోగించదు ఈ సంసారబాధలు మన ము తప్పించుకొనుటకు నిర్వికల్పసమాధియే మనకు శర ణ్యము దీనికని, నిరీశ్వరవాదమగు బౌద్ధమతములోని నిర్వా ణమునకును భేద మెంతమాత్రము లేదు ఈ సమాధిబాధ కూడ మన కక్కరలేకుండ నైతికపథమును త్రొక్కువారి కేల యీనిర్వాణపథము రాకూడదో నే నూహించజాల కున్నాను

పైన చెప్పిన యాత్మపరమాత్మలనుగురించి గాని, వాని యేకత్వమునుగురించి గాని, వాని యునికినిగురించి గాని నాకేమియు తెలియదు తమకు తెలిసినదని యెవరైనను చెప్పినను, వానిని నేను విశ్వసించను వారు ఊహాప్రపంచ ములో, వెర్రిభ్రమలకు దాసులై స్వవంచకులగుచున్నారని నే ననుకొనెదను నేను, యీ ఆధ్యాత్మికవిషయములలో సంశయాత్ముడనై చనిపోవుదునుగాని, వీనిని నేను భ్రమింగదలచ లేను ఈ కాలపు సనాతనధర్మవాదుల మనుకొనేవారు తమకు పరమప్రమాణములని అంగీకరించు యీ యుపని

షద్వాక్యములకు వ్యతిరేకమగు మతమను నొకదానిని నమ్మి, బుద్ధిజాడ్యజనితోన్మాదులై, గాంధిమహాత్ముడు యెల్లపుడు చెరసాలలోనే యుంచబడినతప్ప ఆయన హైందవమతమును నేలపాలుచేయునని ఘోషపెట్టుచున్నారు వీరికి తమ ఋషుల వేదాంత మక్కరలేదు వేదాంతసూత్రములను ఆచరణలో పెట్టుట కొప్పుకొనరు ఇటీవల, వీరి పూర్వులు, ఆయాకాలములలో ప్రచారములోనున్న కొన్ని ఆచారములను స్మృతులుగా లిఖించినంతమాత్రమున, వానిలో కొన్నిటినిమాత్రమే పురస్కరించుకొని, అవి సనాతనధర్మప్రతిపాదికములని బూకరింపుమాటలతో, హిందూమతము అపాయస్థితిలోనికి వచ్చుచున్నదని మొఱలిడుచున్నారు. వీరి యుపనిషత్తులు విశ్వమానవకోటి కంతకును సౌభ్రాతృత్వము కలుగచేయుచుండగా, కొన్ని కారికలను, ఆచారములను పట్టుకొని వీరు వ్రేలాడుచున్నారు మన హిందూసంఘములో విచారణశక్తి వృద్ధియగుచున్నదనియు, వీరియాందోళనము యేటికి యెదురీదుటవంటిదనియు వీరునమ్మవలెను

## ఆత్మసంరక్షణ, జీవుల పోరాటము

## 27 వ అధ్యాయము

స్వసంరక్షణకు జీవుల అన్యోన్య పోరాటము ప్రపంచమందంతటను యెల్లప్పుడు జరుగుచునే యున్నది. ఇది

ప్రకృతి యొక్క నియమము ఇట్టి నియమములను పరమదయా ళుడును, సర్వశక్తిగలవాడును నగు దేవుడను వాడొకడు ఏర్పరచి యుంచెనన్నమాట నేను విశ్వసించజాలను. ఈ బ్రహ్మాండ మంతయు ఒక సృష్టిని లేక పరిణామము నొందెనని మన అద్వైత వేదాంతులు, భౌతికశాస్త్రజ్ఞులు తమ యూహాల వలననైననేమి, పరిశోధనలవలననైననేమి, అభిప్రాయపడు చున్నారు. మన కన్నులకు పదార్థముగ కనపడుచున్న నీరు, వాయువు భూమి యందే సూర్యుని సహాయముతో వృక్ష సంపదలు మొదలైనవి బయలుదేరినవి. ఇవి యొండొం టొకటి కలిసి వృద్ధియైనవి. బలహీనమైన జీవరాసులు, యీ పోరాటములో నశించిపోవుచున్నవి. కొన్ని జంతువులు ఆకులు, కాయలు, పండ్లమీదనే జీవించును. మరికొన్ని తక్కిన జంతువులను తినియే జీవించును. మనుష్యుడు రెంటిని కూడ తిని జీవించును. ఈవిధముగా సమస్తజీవరాసులు క్రమాభివృద్ధి నొందినవి. డేగ, పాము, కప్ప, పులి, సాలి పురుగు—ఇది, అది యననేల—అన్ని జంతువులు, యితరజీవు లను చంపి తమ పొట్టపోసికొను చుండును. మనుష్యుడు, తాను మొదట కోతులనుండి యుద్భవించినను, తన బుద్ధిని అభివృద్ధి చేసికొన్న కొలది శాకాహారమేగాక తనతోడి మానవులను యితర జీవరాసులను చంపి తినుచుండెను. ఇట్లు తన జనసం ఖ్యను ప్రపంచమందంతట వృద్ధిపరచుకొని తన సమీపబంధు వులగు తోకలేని కోతులను అడవి మనుష్యులను నశింపజేయు

చున్నాడు ఎక్కడ తన నాగరికత వ్యాపింపజేయుచున్నాడో, అక్కడనే యున్న పూర్వపు అడవిజాతులు నశించుచున్నవి ఎన్ని జీవరాసులను చంపనిదీ మానవులు యిన్ని కోట్లమంది యొట్లు వృద్ధియొంది? ఈ విత పోరాటములో బ్రతుకుటకు తగినవే నిలుచును. మానవుడు తన మెదడు, బుద్ధిని వికసింప జేసికొనుటవలన అనేకవిధములయిన పరికరములను ఆయుధములను సంపాదించుకొని ప్రకృతిలోని తక్కిన జీవరాసులను తనకు లోబరుచుకొని వానిని చంపి భక్షించుచున్నాడు కాని వానికంటె యితనే యెక్కువ దుర్మార్గుడు తక్కిన జంతువులు తను కడుపునిండగానే తోడి జంతువుల జోలికిపోవు వానికి ఆకలివేసినపుడే ఆహారమును వెదకుకొనుటకు ప్రయత్నించును. మానవుడు సంపూర్ణ స్వార్థపరత్వముతోను అత్యాశతోను తనకును తనసంతతి వారికిని పుష్కలముగ తిండియుండవలెనని అహోరాత్రములు పనిచేయుచునే యుండును కాని కొందరు మానవులు యిట్లు ప్రవర్తింపక, పులిధర్మమునుకూడ విడనాడి భూతదయ, స్వార్థరాహిత్యముల నలవడ జేసికొని హింసచేయకుండా తనుపొట్ట పోసికొనుటకు ప్రయత్నింతురు తమలోని వ్యాఘ్రసత్వమును చంపగల వివేకము సామాన్యులలో కలుగదు దీనికి కారణము యిది ప్రకృతికి విరుద్ధము గనకనే

వ్యక్తులకంటె కూడ అపాయకారులు మానవజాతులు. ఇవి జాత్యాభివృద్ధి, దేశాభిమానమనువానిని పురస్కరించు

కొని తమకంటె బలహీనజాతులను లోబరచుకొని, వానిని నిర్దాక్షిణ్యముగ పీడించుచుండుట వ్యక్తులలో, ప్రకృతినియమమునకు మినహాయింపు లుండుటగాని ఈజాతులకు లేనే లేవని నానాదేశ చరిత్రలు చాటుచున్నవి ఇవి యొండొంటని బానిసలుగ చేసి వాని దేశములను లాగుకొని తాము బలపడుచున్నవి ఇవి సామ, దాన, భేద, దండోపాయములన్నిటిని ప్రయోగించుటకు వెనదీయవు బలహీనజాతులు, నానా రాజ్యసభలో ఆయుధవిసర్జనమునకు పట్టుపట్టిన లాభమేమి? ఇది ప్రకృతిలోని స్వసంరక్షణ సూత్రమునకు వ్యతిరేకము ఇది అస్వాభావికము కావుననే మహాత్మాగాంధిగారి సత్యాగ్రహము, అసహాయోద్యమము, వ్యక్తులమీదనేతప్ప జాతినంతమీదను జయమును పొందకున్నవి ఒక జాతియంత యొక్కయు హృదయమెన్నడు కరుగనేరదు బలహీనజాతులుకూడ కలసి బలవంతులుపయోగించు నానావిధోపాయములను అనుసరించక తప్పదు ఆత్మరక్షణ నియమము, అహింసాసూత్రమును సదా లోబరుచుకొనుచున్నట్లు, ప్రకృతి యంతయు ప్రత్యక్షప్రమాణములతో నిండియుండగా, తమ నోటిదగ్గర యన్నమును, క్రూరమృగములవలె నుండు బలవంతులైన జాతులు వదలుకొన వని ఆశించుట వెఱ్ఱితనము

# రు 12000 లకు డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజు

ఆ 1931 సం॥ యేప్రియల్ 9 వ తారీఖున, పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు రిజస్ట్రేషన్ సబు డిస్ట్రక్టు, కొవ్వూరు గ్రామకాపురస్థులు బ్రాహ్మణులు, హైకోర్టు అడ్వకేటున్నులేటు వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కొమారుడున్ననగు వల్లూరి సూర్యనారాయణరావు వ్రాసిన డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టుదస్తావేజు.

Deed of Declaration of Trust executed by Valluri Suryanarayana Rao B A, B L, L T, High Court Advocate, son of Venkatakrishnaiah garu, Brahmin, residing at Kovvur, West Godavari District

1 నా చిరకాలపు స్నేహితుడును, నిర్మల స్వార్థత్యాగముతో చిన్నతనములోనే తన న్యాయవాదవృత్తిని వదలుకొని, సుమారు 15 సంవత్సరములు కష్టించి తన ధనమును, ఆరోగ్యమును తుదకు తన ప్రాణములనుకూడ నర్పించి,

1 Late Tallapragada Suryanarayana Rao garu an old friend of mine, gave up his lucrative practice at the Bar, while still young and with a rare sacrifice of his wealth, health and at last his life itself worked incessantly for 15 years, established a public

కోపూరు గ్రామములో యేబదివేల రూపాయీల స్థిరాస్తితో "ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ మన" నొక సంస్థాపనను నిర్మించినవాడగు లేటు శిల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు ది 6-3-26 తారీఖున శివసాన్నిధ్యమును చేరినారు ఆయన నామము ఆచంద్రార్కముగ నుండునట్లు తోడ్పడుట నావిధాయక కృత్యమని యెంచి, నాస్వార్జితమగు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా ఆలమూరుకోఆపరేటివ్ ల్యాండు మార్టేజి బాంకులోనున్న నెం 31 to 42 నెంబర్లుగల పండ్రెండువేల రూపాయిల డిబెంచర్లను యీక్రిందిషరతులతో యీక్రింది వివరింపబోవు విషయములను నెరవేర్చుటకు కోపూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘమువారిని ట్రస్టీలుగా

charitable Educational Institution called Andhra Girvani Vidyapitham having immovable properties worth about Rs 50,000 and died on 6th March 1926. I feel it my bounden duty to perpetuate his name for ever in the Andhra Desa, as far as it lies in my power and I therefore hereby endow my twelve thousand rupees worth of Debentures Nos 31 to 42 both inclusive, now in the Co-operative Land Mortgage Bank at Alamuru, Ram chandrapur Taluk, East Godavari District, as a public trust for the following objects, subject to the following conditions

యేర్పరచి యీడిక్లరేషన్ ఆఫ్ట్రస్టు దస్తావేజును వ్రాయుచున్నాను

2 పైన ఉదహరించిన డిబెంచర్లమీద ప్రతి ఆరుమాసములకు వచ్చువడ్డీని మా త్రి మే. కోవూరు విద్యాపీఠ పాలకసంఘము ఖర్చుచేయుచుండవలెను గాని, అసలు మొత్తము శాశ్వత మూలనిధిగా, యెల్లకాలముండవలెను ఈడిబెంచర్లగడువానంతరముకూడ వీనిమీఁదవచ్చు వడ్డి తగ్గినను, హెచ్చినను కోఆపరేటివుల్యాండుమార్గేజ బ్యాంకులలోనే యీఅసలు మొత్తము వేయుచుండవలెను గాని భూములు, యిల్లు మొదలగు స్థిరాస్తులను కొనకూడదు.

3 నేను, నా యిద్దరు కొమాళ్ళు కృష్ణ మోహన్ M A B L Advocate మద్రాసు

II The above Debentures should be kept as a permanent fund and the intrest alone thereon accruing every six months utilised from time to time At the expiry of the 20 years period of deposit the corpus should be invested in the Co-operative Land Mortgage Banks alone whatever be the rate of interest payable but not in the purchase of lands, houses or any other kind of immovable property

III Myself and my two sons Krishna Mohun, M A ,B L Advocate, Madras and Jogan Mohun, L E E , Electrical Engineer

న్ను, జగన్మోహన్ L E E Electrical Engineer బొంబాయియున్ని కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘములో జీవితకాలపు మెంబర్లుగా నుండవలెను. ఈముగ్గురులో నెవరైనను అన్యగ్రామములలో నున్నపుడు సదరు విద్యాపీఠ పాలక సంఘకార్యనిర్వాహసంఘ సమావేశములలో ప్లాని వోట్లువేయుటకును, ఉద్యోగీయులుగా నుండుటకును, వారి యిష్టమువచ్చిన వారిని, మరియొక్కొక్కరిని రాజమహేంద్రవరము, కొవ్వూరు గ్రామస్థులలోనుండి మెంబర్లుగా నామినేటుచేసి, పాలక సంఘ సెక్రటరీకిముందుగా తెలియచేసి, తగినయేర్పాట్లుచేసికొనుటకు అధికారము కలిగియుందురు.

Bombay, should be permanent members for their lives in the Governing Body of the Vidyapitham and during their absence from Kovvur, should have each of them the power to nominate a resident of Rajahmundry or Kovvur to act in their stead both in the General Body's and its executive committee's meetings of the Vidyapitham for the purpose of voting and also acting as office bearers too, if necessary after giving previous intimation to the Secretary or the President of the General Body

4 పైన ఉదహరించిన ట్రస్టుఫండుమీొద రాగలవడ్డీలోనుంచి నెలకు యిరువది (రు 20) రూపాయల చొప్పున కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమున కనుబంధముగా నెలకొల్పబడిన శ్రీవాడ్రేవు జోగాయమ్మ బహద్దరు జమీందారు గారి కళాశాలాధ్యక్షుని (Principal) గౌరవ భృతిక్రింద నిచ్చుచుండవలెను. ఒక వేళ యీ స్వల్పమొత్తమును తనఖర్చులకు స్వీకరించుటకు ఆయన యిష్టపడని యెడల సదరు కళాశాలలో పరిశోధనకును (research) అధ్యాపకమునకును (teaching) సమర్థుడగు ఒక పండితుని జీతము క్రింద నీయవలయును

5 పైమొత్తము పోగా మిగిలిన వడ్డని ఆంధ్రభాషలో సులభశైలిని పండిత పామరులకు

IV Out of the interest on the above trust fund, a monthly sum of Twenty rupees should be paid as honorarium to the Principal of Vadrevu Jogayamma Bahadur Zamindar garu's Kalasala, established as an adjunct to the Andhra Girvana Vidyapitham at Kovvur and in case of his non-acceptance for any reasons of his own to such Pandit therein as is found useful both for the research work in the Vidyapitham, and also for the teaching work in the Kalasala

V The rest of the income should be utilised in getting small books written in easy colloquial Telugu on the following subjects

బోధపడునట్లు చిన్న చిన్న గ్రంథములను యీక్రింద నుదహరించిన విషయములలో విద్యార్థికులచేత కొద్ది పారితోషిక మిచ్చిగాని, ఉచితముగాగాని, వ్రాయించి అచ్చొత్తించి ఆంధ్రదేశములోని ముఖ్యమైన గ్రంథాలయములకు ఉచితముగ పంచి పెట్టుటకును, వ్యక్తులకు స్వల్పఖరీదుకు విక్రయించుటకును, విద్యాపర పాలకసంఘమువారు వినియోగించుచుండవలెను

for the enlightenment of the masses, printed, and distributed gratis among all the important libraries in the Andhra Desa and also sold to individuals for small prices

(ఏ) వేదకాలము నాటినుండి హైందవుల ఆర్యమతములోని శ్రౌతస్మార్త కర్మకాండల జ్ఞానకాండల పరిణామము, ప్రస్తుతము వారిలోనున్న సాంఘికాచారములు, విశ్వాసములు, సాంప్రదాయములు, పట్టింపులు, వర్ణములు, వివాహములు, స్త్రీల విద్యాస్వాతంత్ర్యములు, జ్యోతిషములు,

(a) Critical examination on rationalistic lines of thought of the various religious and social movements in India and of the various customs, beliefs and sentiments prevalent among the common people such as the present petrified caste system, unnatural and artificial relations between the sexes, dogmatic ritual, creeds and ceremonies

మంత్ర తంత్రములు, దేవతలు, దయ్యములు, వర్జములు, లగ్నములు, శకునములు, గ్రహణములు, మంచి చెడుదినములు, అశుచి, ప్రాయశ్చిత్త ఆచారకాండలు, తద్దినములు, దృష్టిదోష, పంక్తిదోష, అంటుదోష, వాయుదోషములు, సాముద్రికము, రసవాదము మొదలగువానిని గురించి మూఢ విశ్వాసములను సప్రమాణముగ ఖండించి విమర్శించుట

(బి) షోడశ కర్మలను గురించి ఆంధ్రటీకా తాత్పర్యములతో గ్రంథములను వ్రాయించి అనవసరమని తోచిన కర్మకాండ విభాగములను సంకుచిత పరచి వేదలక్షణ నేర్చుకొని తగు విమర్శన జ్ఞానమును తెలివియుగల పురోహితులను, దేవాలయార్చకులను, అన్ని వర్ణములలోను బయలుదేరు

irrational conventions based on creeds and colours etc opposed to common sense and reason, unnecessary rules of purity and pollution, grotesque forms of idol-worship astrology, palmistry, alchemy, manthra thanthrams, demonology, supernaturalism untouchability, unapproachability ancestor worship, good and bad days for every daily act etc

(b) A study of comparative mythology, sociology and ethics now in vogue among the various races of mankind and of the evolution of modern Hindu customs, theological doctrines and supernatural beliefs, dogmatic rituals etc and the turning out enlightened priesthood in every caste and sect by imparting a true and correct knowledge of the **karmakanda and the Gnanakanda.**

నట్లు చేయుట, ప్రపంచములో తక్కిన జాతుల మతములు, సాంఘికాచారములు, నీతి వీని పరిణామములు, మొదలగునవి తెలియజేయుట

(సి) ఆర్యమతమునుండి బయల్వెడలిన బౌద్ధమతము, జైనమతము, బ్రహ్మసమాజమతము ఆర్యసమాజమతము మొదలగు వానిలోని సూత్రములన, తెలియజేసి విమర్శించుట, ప్రపంచములో వ్యాప్తినొందియున్న యితరమతములతో ఆర్యమతమును పోల్చి వానిని గురించి ప్రజలకు బోధించుట

(c) A critical examination of the offshoots of Aryan religion such as Jainism, Budhism Brahmo samaj, Arya samaj etc, and a comparative study of the other important religious movements in the world

(డి) మన పూర్వులు రచించిన మానసిక భౌతికశాస్త్రములు, కళలు, అధునిక పరిశోధనల ను బట్టి విమర్శించి, వానిలో అవసరమగు మార్పులను జేసి మన దేశీయ పారిభాషిక పదములతో ఆంధ్ర

(d) The bringing up-to-date of the knowledge imbedded in the ancient works on material sciences and arts and psychic researches by getting small text books written in easy Telugu with the old and the newly coined Sanskrit nomenclature

ములో గ్రంథములను వ్రాయించుట.

(ఇ) గాంధిమహాత్ములవారి సత్యాగ్రహ తత్వములు, వానిలో నిమిడియున్న వేదాంతము, నానా రాష్ట్రపరిపాలనావిధానములు, ప్రపంచములో యిదివరకు జరిగిన, యిప్పుడు జరుగుచున్న సమస్త సాంఘిక రాజకీయార్థిక విప్లవములు, ఉద్యమములు, గ్రామ పునర్నిర్మాణము, సహకార, అసహకారోద్యమములు, నానావిధ సమిష్టివాదములు, మొదలగు వానిని గురించి గ్రంథములను ప్రచురించుట.

(e) Diffusion of knowledge of spiritualised politics of Mahatma Gandhi and of the Gandhian philosophy, of the political, social and economic revolutions and movements of the world past and present and of the modern systems of political Government such as the various forms of socialism, Co-operative republicanism, social and ethical reconstruction, Trade Unionism, Fascism, Syndicalism, Communism, Bolshevism etc

6 పైన వ్రాసిన విషయములను నిర్భయముగను, నిర్మొగమాటముగను, సత్యము తప్పకుండ సప్రమాణముగ సంపూర్ణ మనస్స్వాతంత్ర్యములతో (Free thought) ఆంధ్రులయెదుటవారి

VI The Books on the above subjects should be written impartially, fearlessly with citations of authorities, without the slightest deviation from truth and no book should be priced at more than one rupee These books should be approved of by me

భాషలో పెట్టబడుచుండవలెను ఏ గ్రంథము గాని రూపాయకంటె హెచ్చు వెలను కలిగియుండ కూడదు నాజీవితకాలములో నే నంగీకరించిన గ్రంథములనే ప్రచురించవలెను నాజీవితానంతరము విద్యాపీఠ పాలక సంఘమువారు యిప్పు డేర్పరచు పండితబృందము (Academic Council) చే అంగీకరింపబడిన పిమ్మట ఆసంఘమువారి శాశ్వత సభ్యుల మజారటీ వారి యామోదమును బడయనిదే యేగ్రంథముగాని వెలువడకూడదు

7 నాపై యుద్దేశముల నెరవేర్చుటకు యితరదాతలనేకమంది ట్రస్టుఫండుకు సహాయపడుదురని నేను నమ్ముచున్నాను అప్పటిదేశకాల పరిస్థితులనుబట్టి పైన నేను తెలియజేసిన విషయములలో దేనికైనను యీనిధిమీద వచ్చు వడ్డీని

before publication and after my death by the Academic Council of the Vidyapitham, now to be established and also by the majority of the permanent members of the Vidyapitham

VII I hope that many philanthropists that sympathise with the above objects may contribute their mite to this nucleus and thus render this Vidyapitham a unique and progressive Institution in the Andhra Desa Any how, I consider myself amply rewarded and my soul will rest in peace even if one

అంతగాని కొంతగాని వీలుకొలది ప్రజోపయోగమునకు వినియోగించవచ్చును సాలుకు ఒకచిన్న గ్రంథము వెలువడినను నా యాత్మతృప్తినొందగలదు

8. నేనిదివరకు ది 16-5-1928 తేదీని కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు కొవ్వూరులో నాయింటిమీద రిజిష్టర్డుడీడ్డు ద్వారా యేర్పరచిన రు 120 లు వార్షికము యీట్రస్టుడీడ్డు మొత్తములోనే చేరి యున్నందున సదరు చార్జి రద్దు అయినట్లు భావించుకొని యీట్రస్టును ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ పాలక సంఘమువారు అంగీకరించవలెను

9 ఏ కారణమువలన నయినను నాపై యుద్దేశములను కొవ్వూరు, ఆంధ్రగీర్వాణ విద్యా

book be published in an year, on any of the above mentioned subjects in para V *Supra* according to the necessities of the times

VIII On 16—5—1928 I created by a registered deed a charge on my house at Kovvur for payment of Rs 10 per month towards the salary of the teaching staff in the Vidyapitham, but as that amount is included in that of this trust deed, the Vidyapitham authorities should elect to give up their rights there-under if they accept this trust deed and to free my house from the above charge

IX If, for any reason the Governing Body of the Vidyapitham be unable to discharge its functions properly, the Andhra

పరిపాలక సంఘమువారు సరిగా నెరవేర్చ జాలని చో ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులు శివిల్ కోర్టుగుండా యీ ట్రస్టుఫండును స్వాధీనము చేసి కొని దీనిలో నుదహరించిన కార్యవర్గములను సక్రమముగ యీ కోవ్వూరు విద్యాపీఠములోనే నెరవేర్చుచుండవలెను

University authorities are hereby authorised to get the above trust fund into its own hands through Civil Courts and manage this trust by using only the annual income thereon for the above mentioned objects at Kovvur alone

ఇది నాసమ్మతిన్ని, నాస్వదస్తూరీని వ్రాసి యిచ్చిన డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజు

అడ్వకేటు వల్లూరి సూర్యనారాయణరావు,
సెక్రటరీ
ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము
కోవ్వూరు
పశ్చిమ గోదావరిజిల్లా
9-4-31.

I executed this Deed of Declaration of Trust with my free will and consent, on the 9th April 1931, in my own hand writting

**Valluri Suryanarayana Rao,**
*Advocate, High Court*
AND
*Secretary*
ANDHRA GIRVANA VIDYAPITHAM,
KOVVUR
(West Godavari District)

# APPENDIX II  రెండవ అనుబంధము

— వ్రాయతగిన కొన్ని విషయముల పట్టిక —

1 వర్ణములు 2. అంతర్వర్ణ, అంతర్జాతీయ వివాహములు 3 వితంతు, రజస్వలానంతర వివాహములు—3 వావి 4 వివాహచ్ఛేదనము 5. స్త్రీలవిద్యా స్వాతంత్ర్యములు 6 ప్రకృతి పరిణామము 7 మతపరిణామము 8 నీతి పరిణామము 9 నీతిమత సంబంధము 10 విగ్రహారాధనము 11. పితృపూజ 12. ఆర్యబ్రాహ్మణ మతములు 13 పునర్జన్మ 14 స్వర్గనరకములు 15 దేవుళ్లు దయ్యములు. 16. దైవప్రార్థనము 17 పురాణములు 18 హైందవ ధర్మశాస్త్రకాలనిర్ణయము 19 దైవస్వరూప పరిణామము 20. అవతారములు 21 ఆత్మస్వరూప పరిణామము 22 మంత్రతంత్రములు. 23 కర్మజ్ఞాన భక్తి మార్గములు 24 యోగవిద్య 25. దృష్టిపంక్తి అంటు వాయుదోషములు 26 మంచిచెడు దినములు 27. శకునములు, వర్జ్యములు, లగ్నములు 28 జ్యోతిషము. 29 యజ్ఞములు, యాగములు. 30 శుద్ధాద్వైత జడాద్వైతములు. 31 అహింస, జీవహింస 32. ఆత్మహత్య 33 విశ్వాస సంశయయాత్మ తత్వములు. 34 దానధర్మములు 35. అపక్వశాకాహారము 36 సమిష్టివాదములు 37 మహాత్మ గాంధిగారి సత్యాగ్రహ తత్వము 38 రాజకీయ, సాంఘిక విప్లవములు. 39. భౌతిక శాస్త్రములు. 40 బాలుర విద్యా విధానము.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 10 | పరముపతివ్రత | పరమపతివ్రతయై |
| 5 | 16 | సూత్రాదిక్రమణ | సూత్రాతిక్రమణ |
| 7 | 11 | ముడిబెట్టి | ముడిబెట్టు |
| 7 | 22 | యనిపించుకొనదు | యనిపించుకొనవు |
| 8 | 9 | వానికొరకే | దానికొరకే |
| 8 | 10 | సృజింపబడినట్లు | సృజింపబడినట్లు వారి యూహయని |
| 9 | 2 | యొట్టివిపరీతార్ధములు | యెట్టివిపరీతార్థములు |
| 11 | 1 | ఆయాకాలపువారు | ఆయాకాలపువారి |
| 14 | 14 | దయామిజాల | యామిజాల |
| 16 | 15 | సృష్టివిధానము | సృష్టివిధానమునకు |
| 16 | 15, 16 | ఈపంక్తులు కొట్టివేసి | కొనవలెను |
| 18 | 1 | స్వకీ | స్వీయ |
| 19 | 9 | యని | యను |
| 23 | 11 | పురాణములుపై | పురాణములపై |
| 25 | 4 | నేను | Omit |
| 29 | 5 | గ్రంథములో | గ్రంథములలో |
| 31 | 3 | యగుచుండెను | యగుచుండును |

| | | | |
|---|---|---|---|
| 33 | 5 | చూపుమాపుట మాత్రముచే | చూపుమాపగలిగినను |
| 33 | 9 | కట్టి | కెట్టి |
| 35 | 11 | వీరికంటి | వీరికంటె |
| 37 | 10 | Nature | Nurture |
| 40 | 19 | లేభవించిన | లేకభవించిన |
| 41 | 13 | ఝూదొర | సర్ ఆలివరులాడ్జి |
| 44 | 12 | కాదందురు | కదరదు |
| 45 | 7 | వీనిని | వీరిని |
| 46 | 15 | మొదలగునన్నియును | మొదలగునవన్నియును |
| 50 | 9 | యున్నవనియు | యున్నదనియు |
| 54 | 22 | ననుసరించినవారిని | ననుసరించనివారిని |
| 59 | 12 | మార్ఛకూడదనియు | మార్చకూడదనియు |
| 60 | 5 | బ్రాహ్మణులు | బ్రాహ్మణములలో |
| 68 | 4 | వలెననే | వలెననియే |
| 83 | 13 | మొదలు | మొదట |
| 96 | 21 | యేద్దైనవి | యేవైనవి |
| 100 | 7 | ప్రతి అంతర్వర్ణములుగ | ప్రతివర్ణము అంతర్వర్ణములుగ |
| 101 | 17 | వలెగాక | కేగాని |
| 102 | 17 | ఇట్లు | ఇట్టి |
| 108 | 13 | అట్టి | పై |

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 10 | పరమపతివ్రత | పరమపతివ్రతయై |
| 5 | 16 | సూత్రాదిక్రమణ | సూత్రాతిక్రమణ |
| 7 | 11 | ముడిబెట్టి | ముడిబెట్టు |
| 7 | 22 | యనిపించుకొనదు | యనిపించుకొనవు |
| 8 | 9 | వానికొరకే | దానికొరకే |
| 8 | 10 | సృజింపఒడినట్లు | సృజింపబడినట్లు వారి యూహయని |
| 9 | 2 | యొట్టివిపరీతార్థములు | యెట్టివిపరీతార్థములు |
| 11 | 1 | ఆయాకాలపువారు | ఆయాకాలపువారి |
| 14 | 14 | దయామిజాల | యామిజాల |
| 15 | 15 | సృష్టివిధానముకు | సృష్టివిధానమునకు |
| 16 | 15, 16 | ఈపంక్తులు కొట్టివేసి | కొనవలెను |
| 18 | 1 | స్వకీ | స్వీయ |
| 19 | 9 | యని | యను |
| 23 | 11 | పురాణములుపై | పురాణములపై |
| 25 | 4 | నేను | Omit |
| 29 | 5 | గ్రంథములో | గ్రంథములలో |
| | | యగుచుండెను | యగుచుండును |

| | | | |
|---|---|---|---|
| | 5 | చూపుమాపుట మాత్రముచే | చూపుమాపగలిగినను |
| 33 | 9 | కట్టి | కెట్టి |
| 35 | 11 | వీరికంటి | వీరికంటె |
| 37 | 10 | Nature | Nurture |
| 40 | 19 | లేభవించిన | లేకీభవించిన |
| 41 | 13 | ఝూదొర | సర్ ఆలివరులాడ్జి |
| 44 | 12 | కాదందురు | కదరదు |
| 45 | 7 | వీనిని | వీరిని |
| 46 | 15 | మొదలగునన్నియును | మొదలగునవన్నియును |
| 50 | 9 | యున్నవనియు | యున్నదనియు |
| 54 | 22 | ననుసరించినవారిని | ననుసరించనివారిని |
| 59 | 12 | మార్ఛకూడదనియు | మార్చకూడదనియు |
| 60 | 5 | బ్రాహ్మఖలు | బ్రాహ్మణములలో |
| *68 | 4 | వలెననే | వలెననియే |
| 83 | 13 | మొదలు | మొదట |
| 96 | 21 | యేదైనవి | యేవైనవి |
| 100 | 7 | ప్రతి అంతర్వర్ణములుగ | ప్రతివర్ణము అంతర్వర్ణములుగ |
| 101 | 17 | వలెగాక | కేగాని |
| 102 | 17 | ఇట్లు | ఇట్టి |
| 108 | 13 | అట్టి | పై |

| | | | |
|---|---|---|---|
| 116 | 5 | దానిని | వానిని |
| 123 | 2 | మనోస్వాతంత్ర్యము | మనస్స్వాతంత్ర్యము |
| 133 | 18 | నొప్మింప | నొప్పింప |
| 140 | 12 | యున్నారు. | యున్నాము. |
| 141 | 2 | చర్యలను | చర్చలను |
| 142 | 5 | యుద్ధము | యర్ధము |
| 144 | 3 | పెంపొదింప | పెంపొందింప |
| 155 | 9 | ఉత్స | ఉచ్చ |
| 157 | 7 | ఇల్లు | ఇంటి |
| 169 | 9 | మనలకు | మనల్లను |
| 171 | 4 | చేయుచున్నాడో | చేయుచుందునో |